# భారతి

సాహిత్య మాసపత్రిక

ఫిబ్రవరి 1982



వ్యవస్థాపకులు

క నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

ఫిబ్రవరి 1982

సంపుటము : 59 సంచిక : 2

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1982

# స్వర్గ భైరవం

ఆంగ్ల మూలం: **ఫ్రాన్సిస్ థాంప్సన్** తెలుగు అనువాదం: **శ్రీ శ్రీ**

పరుగు తీశా నతడినుంచి, పగళ్లూ రేలూ గడచి;
పరుగెత్తా నతడినుంచి, సంవత్సరాల పల్లకీ
వంపులు దూసి;
పరుగెత్తా నతణ్ని తప్పించుకుని, నా మనః
పద్మవ్యూహాల మార్గాలు తీసి;
దాగున్నా నతణ్ని కాదని, నా కన్నీళ్ళ
పొగమంచులు మూసి
పరుచుకుని, పదిలపరుచుకుని ఇక ప్రవహించే
నవ్వుల తివాసీ.

పరుగులెత్తాను ఆశల విశాలావకాశాల మీద
జోరు హెచ్చించి;
ఉరకలతో, చిలకరించిన మిాగడ తరకల్లాగ హోరురెట్టించి,
భయాల గిరి గహ్వరాల
ప్రచండ గాఢాంధకారాల
దిగజారి పొగచూరి
పలాయనం చిత్తగించాను నను తరుముతూన్న, వెంట
తరుముతూన్న ఆ బలిష్ఠ పాదాలనుంచి.

అయినాగానీ ఏ తడబాటులేని తొందరపాటులేని వేటతో,
అదరుపాటులేని గమనంతో చంక్రమణంతో,
సముద్దిష్ట మహోత్కృష్ట వేగంతో,
చండ ప్రచండమై విడంబించు
వేగిరింపుల సరాగంతో
ఉరమని పిడుగులాగ ధ్వనిస్తాయి ఆ పాదాలు –
ఆ తడబడని పొరపడని అడుగుల పిడుగుల
దడదడల కన్నా ఆకస్మికంగా
నిస్వనిస్తుందొక గొంతుక నన్ను హెచ్చరిస్తూ:
"అన్నీ నిన్ను కికురుస్తాయి, నన్ను నువ్వు కికురిస్తే" అని.

దేచిరించాను దీనంగా, దేశ భ్రష్టుడిలాగ,
ఎర్రని తెరల ఎన్నెన్నో గవాక్షాల హృదయాల మాటున,
పెన వేసుకున్న దయాధర్మాల చాటున;
(బాగా నాకు తెలిసినా ఆ వెన్నాడుతున్న వాని
విన్నాణపు ప్రేమ,
భయపడిపోయా నెంతగానో, ఏమంటే
అతనుంచే ఇతర మేదీ ఇక నాకుండదని.)
కాని, ఒక చిన్న వాతాయనం విచ్చుకుంటే తేలుతూ వాలి,
ఆ దారిని మూసివేస్తూం దతని ఆగమనపు హోరుగాలి.
భీతికి తప్పించుకోవడం తెలియదు
ప్రేమకు వెన్నాడడం తెలిసినట్టు.

పరుగెత్తాను ప్రపంచం అంచులు సోకి,
గింజుకుని గుంజేశాను నక్షత్రాల బంగారు ద్వారాలను,
చల్లగా మెల్లగా తాకి,
వాటి నినదించే ఇనుప కమ్మీల వెనుక ముసరి,
తలకొట్టుకున్నాను ఆశ్రయంకోసం కొసరి ;
రేరేని పాలిపోయిన రేవుల్లో మధురంగా నిశ్వసించి,
వెండి సవ్వడులు వినిపించాను వెర్రిగా విహ్వలించి.

ఉషస్సుతో అన్నాను : ఉన్నపాటున రమ్మని ;
సాయంత్రంతో అన్నాను : శీఘ్రగామివి కమ్మని –
నీ ప్రభాత కాల సుకుమార గగన పుష్పాలను
తుమ్మరించ మన్నాను కుప్పకుప్పలుగా నా మీద
రక్షించి, నన్నీ ప్రచండ ప్రేమికుడి నుంచి!
తేలించమన్నాను నీ అవ్యక్త సంధ్యావకుంఠనం నాచుట్టూ,
అత డెలాగయినా సరే, చూడకూడదని నాతట్టు!
ప్రలోభపరిచాను అతని భృత్యు లందరినీ,

కాని వారి అకుంఠిత విశ్వాసంలో కనిపించింది
నా విశ్వాసద్రోహం,
వారి అచంచల భక్తిలో విచలించింది
నా చపలచిత్త వ్యామోహం,
చూశాను వారి విద్రోహపు నిజాయితీ, నమ్మకమైన మోసం.
చేశాను వేగశీలమైన వాటి వేగంమీద ఫిర్యాదు ;
వేలాడేను వీచే ప్రతీ ఈదరగాలి జూలునూ పట్టుకుని.
కాని అవి చల్లగా జోరుగా వినీలాకాశపు మైదానాలను
తుడిచిపెట్టుకు పోతున్నా,
లేదా, జలధర గర్జనల సారధ్యంలో
పెళపెళమని అతని రథాన్ని ఒడిసి పట్టుకు పోతున్నా,
ఎగసి పడే మెరుపుల చిత్తడిలో
వాటి పాదాల హేళనల ముట్టడిలో :—
భీతికి తప్పించుకోవడం తెలియదు
ప్రేమకు వెన్నాడడం తెలిసినట్టు.
అయినాగానీ ఏ తడబాబు లేని తొందరపాటు లేని
వేటతో,
అదరుపాటు లేని గమనంతో, చంక్రమణంతో,
సముద్దిష్ట మహోత్కృష్ట వేగంతో,
చండ ప్రచండమై విడంచించు వేగిరింపుల సరాగంతో,
వచ్చేశాయి వెన్నాడుతున్న పాదాలు, విన
వచ్చిం దొక కంఠధ్వని
ముంచెత్తి ఆ పాదాల లయబద్ధ నినాదాల -
"ఏదీ లేదు నీ కాశ్రయం ఇచ్చేది,
నీవు నా కాశ్రయం ఇచ్చేది లేదంటే" అని.

మరి వెదకడం మానేశాను తిరిగాను దారి తప్పినట్టు
ఎదిరించి మనిషినీ మగువనూ, ఏకాంతమే నాదారిచుట్టూ;
అనిపించిం దప్పుడు నాకు చిన్నపిల్లల చిలిపి కళ్ళల్లో
దొరుకుతుందేమో జవాబు, విందాం వాళ్ళేమంటారో అని,
కనీసం వాళ్లే నా వాళ్లు, ఔను నాక్కావలసినవాళ్లు !
తిరిగి చూశాను వాళ్ళ వైపు
ఆశగా ఎంతో సేపు ;
కాని అకస్మాత్ సౌందర్యంతో వారి పరువపు కళ్లు
ప్రత్యుత్తరాల ప్రత్యూషాలు ప్రసరించేలోగా, సరీగా
ఆ సమయానికే లాగేసింది
వాళ్ళ దేవదూత జుట్టుపట్టుకుని నా నుంచి వాళ్ళని.
"అయితే రండి, ఇంకోలాంటి శిశువుల్లాంటి
ప్రకృతి నిసువుల్లారా రండి నాతో" (అన్నాన్నేను)
"పంచుకొండి నాతో మీ సుతిమెత్తని సాంగత్యాన్ని ;
పలుకరించ నియ్యండి మిమ్మల్ని పెదవికి పెదవిగా,
చిలకరించ నియ్యండి గిలిగింతల కౌగిలింతల
అల్లికల ఉల్లాసాల నవ్వుల నవ మల్లికల,
చెలగాటు లాడనియ్యండి నన్ను, మన మాతృదేవి
చెల్లాచెదరైన శిరోజాలతో,
విందారగించ నియ్యండి ఆమె అందాల గాలిగోడల
భవనాలలో,
తాగనియ్యండి ఆమె వినీల వితర్దిక కింద
మీ అకల్మష పద్ధతిలో నన్ను,
ప్రకాశమాన బాష్ప ధారలు కురిసే
దివ స్సరోవర మనోహర సుమధుర మధు కలశిక నుంచి."

అంతే, అలాగే జరిగిందంతా :
నేనూ వాళ్ళ సున్నితపు సాహచర్యంలో సమైక్యం
పొంది
ప్రకృతి దాచుకున్న అనేకానేక రహస్యాల
గడియలు విడలాగాను, చదివేశాను విహాయసాల
పెడసరపు ముఖం మీది పొడిపొడి అక్షరాలన్నీ,
తెలుసుకున్నాను అదుపులేని కడలి గురకలలో
ఉబుకుతూ నురగలతో లేచే
వినీల వలాహకాల విలోల విజృంభణ విధానాలన్నీ;
పుట్టేదీ గిట్టేదీ సమస్తమూ పైకిలేచి పక్కకు వాలి
పోతుంటే
అన్నింటిలోనూ ఆకారం రచించు కున్నాను
విలపించే దివ్యత్వం వెలిగించే, నా విభిన్న మనో
విభ్రమాలకు -
వినోదంగా వాటితో ఆనందించి వియోగంలో
విభ్రమించాను.

బరువెక్కాను సాయం సంధ్యతో,
పగటి మరణించిన పావిత్ర్యాల చుట్టూ ఆమె
ప్రకాశించే కాగడాలు వెలిగించినప్పుడు
ప్రభాతకాల చాల నేత్రాలలో పకపకమని నవ్వాను.
శీతోష్ణాల వాతావరణా లన్నిటిలో కలిసి
విషాదమూ విజయ గర్వమూ పొందాను,
కలిసి కట్టుగా విలపించాం స్వర్గమూ నేనూ
మరిదాని తీయని కన్నీళ్ల క్షారమైనాయి నామర్త్యాశ్రువు
లతో కలిసి;

దాని సూర్యాస్తమాన హృదయాన హత్తి,
అచ్చటి ఎర్రని స్పందన కెదురుగా
పరచుకొని నా హృదయాన్ని ప్రతిస్పందించనిచ్చాను;
కాని అంతమాత్రాన కాదు, అంతమాత్రం చేతకాదు
నా మానవీయ వేదనకు వెసులుబాటు.
చెమ్మగిల్లాయి నా దుఃఖాశ్రువులు స్వర్గపు
పొగమూరిన చెక్కిలి మీద నిష్ప్రయోజనంగా.

ఏలనగా ఆహా ! మాలో ఎవరికీ
ఒకరిమాట లింకొకరి కర్థం కాలేదు,
నేనూ ఈ వస్తువులూ; ధ్వనులతో మాట్లాడుతాను నేను -
వీటి చప్పుడు తమ తమ కదలికలు మాత్రం,
ఇవి మాట్లాడేది నిశ్శబ్దాలతో.
ప్రకృతి పాపం, సవతితల్లి ! తీర్చలేదు నా దప్పిక;
నాకే ఆమె ఋణం ఉంటే చూపించుగాక
తన సుకుమార పయోధరాల,
తొలగించి ఆ దూరపు వినీలపు ఆకాశదుకూలపు
విశాల విలాస వక్షోచ్ఛాదనాన్ని:
దాహంగొన్న నా నోటి నొక నాటికీ
ఆశీర్వదించనే లేదు ఆమె చనుబాలు.
ఇంకా ఇంకా దగ్గర పడుతోందావేట, ఆ వెంటాట,
తడబాటులేని అడుగుల డడడడలతో,
ఉద్దిష్ట వేగంతో, ఉదాత్తపు వేగిరింపుతో,
అంతలో అధిగమించి ఆ వినిర్ధ్వనత్పాదాల వేగాల,

విన వస్తుందొక కంఠధ్వని మరీమరీ క్షిప్రంగా -
"నిన్నేదీ సంతృప్తి పరచబోదుసుమా,
నన్నే నీవు సంతృప్తి పరచకపోతే" అని.

దిగంబరంగా నిలుచున్నాను ఎత్తిన నీ ప్రేమ ప్రహారానికి,
వేచుకుని
పడిందిదెబ్బ, ముక్కముక్కలుగా చీల్చావు నాకవచాన్ని
వేసిన నీ వ్రేటుకి పడిపోయాను మోకాళ్ళమీద;
అయిపోయాననహాయుణ్ని, పిసరంతైనా రక్షణలేనివాణ్ని.
అనుకున్నా నిద్రించానని, అంతలో మేల్కొన్నాను,
తెలుసుకున్నా నింపాదిగా తెరిచూస్తూ
నిద్రలో దిగంబరుణ్నయానని.
పొంగే నా యౌవన శక్తుల పొగరుబోతు దూకుడులో,
కుదిపి వేశాను స్తంభాల్లా నిలబడ్డ ఘడియల్ని,
లాక్కున్నాను నా మీదకు నా జీవితాన్ని
దాక్కున్నాను నాలోనే నేను;
బురదల మరకలతో నిండి నిలుచున్నాను,
నాచు పట్టిన సంవత్సరాల పెనుధూళి మధ్య -
ఆ కుప్పకింద కొంకర్లు తిరిగి వంకర టింకర్లుగా
పడిపోయింది మరణించి నాయౌవనం.

బీటలు వారి నా రోజులు పొగలో ఎగసిపడి
పొంగులు వారి బ్రద్దలయినాయి
సెలయేటి మీద మిల మిలలాడే సూర్యకాంతిలాగ.
ఔను, స్వప్నం దగా చేసిందిప్పుడు స్వాప్నికుణ్ని,
వీణ వైణికుణ్ని వలె;
ఏ గొలుసు గొలుసుల భ్రమల గుత్తులు గుత్తుల మడతలో
భూమిని నా ముంజేతి కంకణం చేసి తిప్పుకున్నానో
ఆ భ్రమలు కూడా లొంగిపోయాయి
తమ బలహీనపు త్రాళ్ళు ధాత్రికి సమాధానం
చెప్పుకున్నాయి
అశేష విషాద భారంతో !
ఆహా! అయితే నీ ప్రేమ పెలుసైన కలుపుమొక్కలాంటిదా?
ఏమో అది అమరలోక పారిజాతమో ఏమో,

తాను౹౹ు తన పువ్వుల్ని తప్ప
ఇరుపంచలకైనా ఇతర సుమాలను రానీయనిది?
ఆహా ! అనంత చిత్రకల్పన శిల్పీ !
కట్టెను కాలిస్తేగాని దానితో గాలిలో చిత్రించలేవా ?
ధూళిలో వ్యయమయింది నానవ్యత్వపు చంచల వర్షం.

ఇప్పుడు నా హృదయం శిథిలమైన కేళాకూళి,
అందులో కన్నీటి బొట్లు కరడు కడతాయి
ధారా పాతంగా స్రవించి;
నా కొమ్మలున్న కన్నుల మనస్సుమీద వడకే తడిసిన
భావాలనుంచి !
ఇప్పటి కింతే; ఇక ముందేమవుతుంది ?
గుజురే అంత చేదయితే ఏమనుకోవాలి పైతొక్క రుచి ?
పొగమంచులో కాలం పొరపాట్లు పోల్చుకుంటాను
చూచాయగా;
అయినా అవ్యాహతంగా ధ్వనిస్తుందొక తూర్యరావం
అనంత కాలపు నిగూఢప్రాకారాలనుంచి;
కుదుపులతో కుమిలే ఆ విషాద తుషారాలు
స్థలాలను పరాస్తంచేసి తర్వాత మళ్ళీ కడుగుతాయి
సగం సగం కనిపించే బురుజులను చుడుతూ;
కాని అతనికన్న ముందుగా కాదు
నన్నురమ్మని పిలిపించిన, నాకు తొలిసారి కనిపించిన,
మెరిసే ఊదారంగు వసనాల చీకటిలో శరవణదళ కిరీటం
ధరించిన,
అతని కన్నముందుగా కాదు;
తెలుసు నా కతని పేరు, ఎరుక నాకతని తూర్యధ్వని
ఏమంటుందో.
మానవుని హృదయమో జీవితమో ఫలసాయం నీ కందిస్తే
అప్పుడు నీపంట పొలాలు

కోరాలా మురికి యెరువుగా, కుళ్లిన మృత్యువునే ?
ఇంతలో హస్తగతమవు తుందిప్పుడు
వింతగా నన్నింతగా వెంట దరుముతున్న
పరుగులను గురించిన గాలి కబురు;
చుట్టుముడుతుంది నన్నాగొంతుక చప్పుడు
విరగబడి పగిలిపగిలి విరుచుకుపడే సముద్రంలాగ;

"అంత చెడిపోయిందా నీ భూమి పెంకులు పెంకులుగా
ముక్క చెక్కలయి ?
చూడు అన్ని వస్తువులూ నిను విడిచి ఎగిరిపోతాయి,
నానుంచి నువ్వెగిరి పోతున్నావు కావున !
విచిత్ర విషాదకర విఫల వస్తువా !
ఎందుకు ప్రత్యేకించాలి ప్రేమను ఎవరైనా నీ కొసం ?
తెలియదా నన్ను మించి శూన్యం నుంచి
ఎవ్వరూ ఏదీ సృష్టించలేదని" (అన్నాడతడు).
"కావాలి మానవ ప్రేమకు మానవీయమైన అర్హత :
మానవుని మట్టి పెళ్లలన్నింటికన్నా
మసక బారిన మట్టి పెళ్లవురా నువ్వు, ఏదీ నీకంత
యోగ్యత ?

అయ్యో ! నువ్వెరుగనే ఎరుగవు
ఏ ప్రేమకయినా నువ్వెంత అనర్హుడివో !
నీలాంటి నికృష్టుణ్ని ప్రేమించే వాణ్ని
ఎవణ్ని చూడగలవురా నన్ను తప్ప, నన్నుమాత్రం తప్ప ?
నీకు హాని కలిగించడానికి కాదు, వినరా, క్షుద్రనరా !
నీవద్ద నుంచి నేను తీసుకున్నదంతా,
ఎందుకనుకున్నావు తీసుకున్నానని,
దాన్ని నువ్వు కనుక్కోవాలని నాబాహు పరిష్వంగంలో!
దేన్ని నీపసిపాపడి పొరపాటు భావించిందో పోగొట్టు
కున్నట్టు,
ఏతత్సమస్తమూ పదిల పరిచాను నేనే
ఇంట్లో నీకోసం భద్రంగా !
కనరా, హీననరా, లేరా !
కరం కరంతో గీలించు, మరి రారా?"
ఆగుతుంది నాచెంతనే ఆ పద నిపాతం :
ఇంతకూ నాధ్వాంతమంతా
అనునయిస్తూ చాచిన ఆతని చేతుల నీడేనా ?
"ఆహా, అత్యంతం నీమమత,
అనన్యం నీ ఆంధ్యం, అద్వితీయం నీ దౌర్బల్యం
ఎవణ్ని నువ్వు వెదుక్కుంటున్నావో వాణ్నే నేను !
ప్రేమనే తరిమి వేశావుగా నీ నుంచి,
నన్నే తరిమి వేసిన నువ్వు."

కీ. శే. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

# శివతాండవము

యెంకి పాటలూ కిన్నెరసాని పాటలూ వలెనే శివతాండవము కూడా గేయకావ్యమే. వాటివలెనే ఈ గేయముకూడా సభలలో కవినోట గీతముగా వినబడినది. పుట్టపర్తివారు మద్దెలా ఫిడేలూ పక్కవాద్యాలుగా మొదటి కాలములో తాళము నిలుపుతూ శివతాండవము పాడడము నేను విన్నాను. యెంకి పాటలూ కిన్నెరసాని పాటలూలాగే శివతాండవముకూడా జంపెవరుసల రచనే. కిన్నెరసాని పాటలలోలాగ శివతాండవములోనూ ఒకొక్క కవళికచుట్టూ రచనాహల్లీసకాలున్నాయి.

ఆధునికులు పెక్కురు శివతాండవమును ఖండకావ్యాలుగా రచించారు. "అవధరింతువు ప్రతి దినసాంతమందు నిత్యనూతన తాండవనృత్యకేళి. ఓయి నటరాజ తలలైన నూపలేక భువనములు దుర్భరానందమున మునుంగ" అని ప్రారంభించారు కృష్ణశాస్త్రిగారు తమ అయిదు గీత పద్యముల ఖండకావ్యాన్ని. దానిలో వారి భావములే వస్తువు. 'ఏవిధాన సౌందర్యరసైకజీవి నిలువనేరుతు.... మామకీన జీవిత శుష్కమార్గముల త్వదీయపాద మంజీరముల్ మ్రోయకున్న' అని చదవగానే 'పాపము!' అనిపిస్తుంది. సౌందర్యరసైక జీవులేకదా కృష్ణశాస్త్రిగారు? కవుకొండల వెంకటరావుగారు 'శివరాత్రి ప్రభ'లో 'నొసట గొసరిన మూడోకన్ను' 'పునుకలాగల గలలు'-'ముమ్మొనవాలు, హుతభుక్ అజకపాలము, డొక్కుడు బడక్' చూపించారు. ప్రభువు తాండవము చేస్తూంటే 'మహాదేవా అభయమిడు మన అభినయానకు హస్తమేలేదు.' కందుకూరి రామభద్రరావుగారు 'వేదన' అన్న సంపుటములో సంధ్యాతాండవములో 'నొసలి జేగురుకంట మసలి రేగిన మంట పశ్చిమాంగణమంత భగ్గు భగ్గున మండు' నన్నారూ 'ఒకవంక తాండవమ్మొక వంక లాస్యమ్మ్మ అర్ధనారీశ్వరము అఖిల బ్రహ్మండమ్ము' అని అర్చించారు. శివతాండవము ఎవరు ఊహించినా ఎక్కడో ఒకచోట మెఱుపు కొట్టుతూనే వుంది. పఠాభి అనే తిక్కవరపు పట్టాభిరామిరెడ్డిగారి 'నటరాట్టు'లో "ఎగురగొట్టబడి విడినజుట్టు ముడినల్లగట్టులాగ కనుపట్టు, గిరుల నట్టనడిదుముకునట్టి వడి అట్టహాసనదిగొట్టు, రగులు నాట్యమాడ నటరాట్టు" అన్న తొలిపంక్తులు కల్లోలాన్ని బాగాపట్టేయి.

పుట్టపర్తివారి "శివతాండవము" ఆ తాండవాన్ని చూపించే యత్నము, తాండవాన్ని చూచినప్పుడు వారికికలిగిన భావపరంపరను ఇచ్చితద్వారా మనకు ఉత్సాహము కలిగించనెంచేయత్నము కాదు. శివతాండవాన్ని వారు వర్ణించిన ఈ కావ్యాన్ని చదివీ వినీ మనము చదువరులము శివతాండవ దర్శనానందము పొందాలి. అనగా ఇది కథాకావ్యమన్నమాట. దీని వస్తువు శివుని తాండవమూ పార్వతి లాస్యమున్నూ, అతిలోకము. పశ్చిమచాళుక్యరాజులు పట్టదకల్‌లో కాబోలు తొలిసారి మలిపించినది మొదలు దాక్షిణాత్య శిల్ప వీధులన్నిటా ఉజ్జ్వలంగా తీరినది శివతాండవ శిల్పము. పట్టదకల్లో జంబులింగ దేవాలయపు గూడులో స్వామి అష్టభుజుడు, కుడివైపు నందీ ఎడమవైపు దేవీ మాత్రమే ఉన్నారు. పాపనాథ దేవాలయ శిల్పంలో స్వామి చతుర్భుజుడు, నందీ అమ్మవారూకూడా ఉద్రిక్తులై పాల్గొంటున్నారు, ఎత్తిన పడగలతో పాములూ కదిలిపోతున్నాయి. బాదామిశిల్పి స్వామికి షోడశభుజములూ ఆయుధములూకాక, ప్రక్కన నందీ వినాయకుడూ, మార్దంగికుడూ కూడా ఉన్నారంటున్నాడు. ఎల్లోరా 14వ గుహలో పృథ్వీ ఆకాశముల నడుమ ప్రభువు తాండవం చేస్తూంటే, వేణుమృదంగాది వాద్యములను మ్రోయించువారు కుడి దిగువనా, చకితురాలైన అమ్మవారు ఎడమవైపునా, పైన ఇటూ అటూ దిక్పాలురూ ఉన్నారు. శివప్రదోషస్తోత్రకారుడు సమ్మర్దము నింకా పెంచినాడు. కైలాస శైల భవనములో కనక రత్నపీఠము మీద గౌరీదేవి ఉపవసించి ఉండగా, వాగ్దేవి వల్లకినీ శతమఖుడు వేణువునూ రమ తాళములనూ విష్ణువు మృదంగమునూ వాయింపగా భగవతి (సంచుపాటగా) గేయమును ఆలపింపగా గంధర్వ యక్ష పతగ ఉరగ సిద్ధ సాధ్య విద్యాధరామర అప్సరసాదులు వీక్షింపగా ప్రదోష సమయములో నృత్యము చేసినాడట పరమశివుడు. నారాయణాచార్యులుగారు ఇంత సమర్దమూకూర్చినారు, విష్ణువును ప్రేక్షకునిగా తీర్చినారు.

'ఏమానందము భూమీతలమున శివతాండవమట! శివలాస్యంబట!' అన్న ప్రకటనతో అరంభించారు పుట్టపర్తివారు. అలపై బంగారు కలలై, పగడపు బులుగులవలె మబ్బులు విరిసినవట. 'వచ్చిరి యేమొ వియచ్చరకాంతలు జలదాంగనలై' అన్నారు.

తరవాత కథలో గగన తలస్థులు దేవతలూ సెలకన్నెలూ నదులూ వనకన్యకలూ సంభ్రమోత్సాహాలతో ఆనందించారే, ఈ వియచ్చర కన్యలు జలదాంగనలు కావడమెందుకో నాకు తెలియలేదు. ఆవేశ పూరిత వాతావరణానికి కల్పనలు చేరిస్తే కృతకత్వము ప్రవేశిస్తుంది. పక్షులు ప్రాబలుకులు పలకడమూ కొమ్మలు పూలురాల్చడమూ భారతి పార్వతికి అలంకారము తీర్చడమూ, చతురాననుడే శర్వునకు సర్వవిభూషలు సవదరించడమూ ఇంపైన వాతావరణాన్ని నిర్మించగా 'రాలెడు ప్రతి సుమమేలానవ్వేషు'నని కవి కల్పన మళ్ళీ తలెత్తినది. ఈ చాపల్యము పండిత కవులలో ఎక్కువ. వారు చదువరికి తన్మయత కలిగించే యత్నంలో తమశక్తి ప్రదర్శనాన్ని మరచిపోలేరు. 'హైమవతీ కుసుమాలంకారములందున దానొకటౌదు నటంచునో' అని ప్రశ్నవేసి 'లలితా మృదుమంజుల మగు కాయము బూవుల తాకులతో వసివాడదో' అని చదువరి కథాశ్రవణా సక్తిని కాక ఆలోచనని రేపుతున్నారు. చూపించబోయే శివతాండవం దగ్గరకు లాగుకుపోక చదువరికి కొంచెము ఆలోచనా విరామము ఇచ్చి కవిగారు తాము కనిపిస్తున్నారిక్కడ. 'తకఝుం తకఝుం తకదిరికిట నాదమ్ములతో లోకమ్ముల వేలుపు నెమ్మిగ నిలబడి నృత్యమాడు నెడ లయానుగతి గ్రమముగా శ్రుతిబట్టుటకో! గొంతులు సవదరించు నుత్కట భృంగమ్ములు' అన్నారు. శ్రుతి అన్నది లయకు సాయపడేది కానేకాదు 'తకఝుం తకఝుం' అనే లయ తునకలు శ్రుతిని గురించి చెప్పేపట్ల కవిగారు ప్రారంభించేయడము వల్ల అవసరమైనది 'లయానుగతి.' కవులు చదువరుల వ్యతిరేకపు టాలోచనలను రేపే ఊహల్ని తెస్తే చదువరుల అపేక్ష తెగుతుంది. వర్ణనా పాటవము వల్ల నిరంతరాయమైన ఆసక్తికలిగిస్తూ జరగబోయే శివతాండవ దర్శనానికి చదువరిని విసరాలి కవి. తాండవానికి ముందు వచ్చే ఈ భావప్రసాధనము మట్టిమీద తిరిగే మానవ చదువరిని ప్రభువు తాండవమాడే 'ఇలాతలము'నకు లాగి నిల్పుటకే ఉపకరించవలె కదా? తెంపుశృంటే ఎలాగ?

నందీశ్వరుని నాంది వింటాము తరువాత. అంతా సంస్కృతములో నడిచి చివ్వర మూడు తెలుగువి సంతరించుకొంది నాంది. వాటిలో రెండుపద్యాలు మళ్ళీ నందీశ్వరుని తాండవ వర్ణనతో నిండేయి. ఈ వర్ణనలోనే "పిక్కటిల్ల, ప్రతినినదము లీనగ, దేవతలు బెగడ" అన్నవి నందినికూడా మానవమట్టానికి తెస్తున్నాయి. శివతాండవముతో వనధి భంగములు శూలములవలె లేచాయీ, కీలాచయములు నగవులు నించాయీ అంటే ఉత్సాహము ధ్వనించి శివతాండవ సంభ్రమము వైపు వేలు చూపిస్తాయి కాని ఢక్కారవములు పిక్కటిల్లేటట్లు దిక్కులు ప్రతినినదము లీనునట్లు తాండవించే సమయము వచ్చింది స్వామి అనడము తాండవాతిశయాన్ని పేలవము చెయ్యడము అవుతుంది అనుకుంటున్నాను.

శివతాండవము ప్రారంభము కావడము వింటాము.

శ్రీ ఆచార్యులుగారు ఈ కావ్యంలో మొదటగా పరదైవమైన విష్ణుమూర్తినీ 'ధింధిమి ధ్వనులు దట్టములై బ్రతిశబ్దమిన.... సాంధ్యల దాండవమాడు .... ఈశ్వరు'నీ స్తుతించినారు. ప్రతి శబ్దములు వీరి మాటలే చూచారా, ఇందాకా నందినోట వినబడ్డాయి! ఈ ప్రార్థన పద్యాలు రెండూ ఇక్కడకాదు, కావ్యానికి ముందు వినబడవలసినట్టివి. భావప్రసాధనమూ నాందీ అయిన తరువాత పరమశివుని సన్నాహమూ తాండవమూ రావలసిన వరుసలో ఈ ప్రార్థనతో కవిగారు ప్రవేశించడము వల్ల చదువరికి రాగల క్షొద్ది ఏమార్పు పోయి 'పరమవైష్ణవుడు తేలిపోయె' ననో మరేమనో ఆలోచన కలిగిస్తుంది.

ప్రారంభించింది శివతాండవము. దశపాదముల తర్వాత 'ఆడెనమ్మా శివుడు పాడెనమ్మా భవుడు' అని అభినయానుకూలి అయిన ధ్రువమును చేర్చినారు కవిగారు. అంత్య ప్రాసలు కూడా పాదములను వింగడీస్తూ నర్తకికి వాచక విరామమేకాక అభినయ విరామము కూడా కలిగిస్తూ సాగేయి. చివ్వర, నర్తకి 'ఆడెనమ్మా శివుడుపాడెనమ్మా భవుడు' అని ఊపిరి తిప్పుకుంటుంది. ఈ రచన నర్తకికే అనడానికి 'ఆడెనమ్మా' అన్న స్త్రీ సంబోధనము సాక్ష్యము. మైలారు భటుడే అయితే స్త్రీ సంబోధన చెయ్యడు.

ముఖమూ తలా కదిలేసరికి చదవేరూ బాలచంద్రరేఖా ముంగురులూ కనుబొమలూ పెదవులూ కదిలేయి. ధిమిధిమిధ్వని సరిద్గిరి గర్భములు తూగెను, అమిత సంరంభ హాహాకారాలురేగెను. తాండవ సంరంభము ఇంకా అందుకోలేదు, అయితే ధ్వనిబొత్తుగా వినిపించకే పోవడము ఇష్టముకాకనే మరి రెండడుగులు ఎక్కువ వేశారు కవిగారు. నేనే అయితే రెండో దశపదిలోని చివరి రెండు పాదాలూ మొదటి దశపదిలోని చివరిరెండుపాదాలతోచోటు మార్పులు చేసి రెండుదశపదులలోనూ భావసామరస్యమువచ్చిందనిసంతోషించి ఉండేవాణ్ణి. అయితే కవిగారు ఆమార్పు చేయకపోవడానికి కారణము వారు ప్రతీ దశపదినీ చివరి రెండు పంక్తులతో 'విని' పించవలెనని అభిలాష పడుటేనేమో అనిపిస్తోంది. అయిదు దశపదులు చివరి పంక్తులలో గట్టిగా వినిపిస్తున్నాయి. మొదటిది చివ్వర థామ్మంది: న్యాయమే కదా! రెండో దశపదిలో నాట్య సంరంభము చక్కగా

గోచరిస్తోంది. జటాచ్ఛటలు ముసురుకొని వ్రేలాడేయి, తలచుట్టు భుజగములు పారాడేయి, మకరకుండల చకాచకలు రేగేయి, హారాళి నృత్యం చేశాయి, శ్వాసలు దండడించాయి, చెమట వెల్లువ గట్టింది. ఈ ఆఖరిది కొంచెము ఆగి ఉండవలసింది). మూడో దశ పదిరో కాంతీ చలనమూ వర్ణితములు. శివునికి సర్వవిభూషలు సవదరించిన చతురాననుడు 'హరహరా' అని వేడినాడు. నాలుగో దానిలో పదముల రచన కిణుకిణు మంటుందీ అనుకూలంగా యెముక పేరులు మర్మరము చేశాయి. అయిదోది అనుప్రాసంతో గట్టిపడిందీ, వాసనలు చిమ్మేయి. ఆరోదానిలోనూ ఏడో దానిలోనూ నాట్యపరిభాష నాట్యవాతావరణాన్ని కప్పివినిపిస్తోంది. ప్రబంధాలలో వనవర్ణనపట్ల చెట్ల పేర్లన్నీ, సరోవరవర్ణన పట్ల పుల్లాంభోజ ఇందిందిర కమఠమీనములన్నీ రావలె ఇక్కడ నాట్యశాస్త్ర పరిభాష ప్రక్కిరిసింది. అతి విశ్లేష దృష్టితో శాస్త్రకారులుపయోగించే రకాలన్నీ ఆ నాట్యములో వున్నాయన్నా పేర్లు గుమిగూర్చినా ఒకపే కదా ? 'తిరుగు చూపులతోనె పరుగెత్తెనట హృదయము, ఇది కానవచ్చేదేమీకాదు. నాటకములో వలెనే తాండవములోనూ రసము సామాజిక నిష్ఠమే నటనిష్ఠముకాదు. హృదయ స్పర్శయే అక్కర లేదు నటునికి 'భావోన్నతి' తో ప్రభువుకు పనేలేదు. భావావృతమై అప్పువారి మేను గరుపారిన అదివేరుమాట. పరవశత్వమున శ్రీపతియున్ జెమర్చిన అది పెద్దమాట. నటరాజ స్వామికిమాత్రము భావమే అక్కరలేదు; ఉన్నట్టు ప్రేక్షకులకు తోచవలెనంతే; దానికి సాధనము తాండవము.

ఈ వర్ణనలలో నారాయణాచార్యులవారిది ప్రబంధ పద్ధతే. ప్రబంధాలన్నిటినీ నూరి మ్రింగి త్రేన్చి రచిస్తారు కాబోలు పెనుగొండ సీమ కవులు ! సహజమే కదా ! స్వామి చూపులు "తరి తీపు వెన్నెలలు విరిసికొన్న విధాన దెలి బూది పూతదెట్టులు గట్టిన విధాన, జలికొండ మంచు గుప్పలు గూర్చిన విధాన, బొనగ ముత్తెపుసరుల్ ల్పోహళించు విధాన, ఘనసారమును దెచ్చి కలయ జల్లు విధాన, మనసులో సంతసము గనుల జారువిధాన" తళుకులు పూసినదట. ఈ వర్ణనల సౌందర్యమునకునూ కన్ను చూపుల సౌందర్యమునకునూ గలట్టిది మేనమామ పోలిక మాత్రమే. జననీ జన్మసంబంధముకాదు. పెద్దనగారు కవిత్వము ఆనందదాయకముగా ఉండాలి అనడానికి చెప్పేరు చూడండి ఉదాహరణలు ! ఏఆనందాని కైనా తీసికొచ్చి ఇవ్వవచ్చును. ఆ ఉదాహరణలు కవిత్వానికే అన్నమాటేమిటి ? ఈ ఉదాహరణలు అంతే ! ధావళ్యాన్నీ ధవళ సుందరాల్నీ స్వామి మెయిదీగతో రాయించి చలనాన్నీ చలన సౌందర్యాన్నీ చారీకరణ భేదాలతో కలబోసి గానాన్నీ సంగీత మాధుర్యాల్నీ స్వామి పాటతో రంగరిస్తే ఈ చిన్న అనుభవాల కిటికీలలో నుంచి స్వామి తాండవ మహదాకాశపు సౌందర్యాన్ని చూడగలిగినంత చూస్తారు చదువరులు. అందాలన్నీ కుప్పగూర్చి "అలాగున్నాయి ప్రభువు కళ్లు" అంటే? "అయితే ఆనందానికి ఆనందము కలిగించే ఉదాహరణవల్ల సూచన చేయకూడదంటారా?" అని అడుగుతారేమో. మనవి చేస్తున్నా.

కవిత్వ రచనకు పరమాదర్శము ఆనందము కలిగించడమే. ఈ ఆనందము కలిగించే పద్ధతులు రెండు చిరకాలము నుంచీ వాడు తున్నారు కవులు. ఒకటి ఆ ఆనందదృశ్యాన్ని చదువరుల ఎదుట పెట్టినట్లు వర్ణించడము. అది చూచినప్పుడూ లేక ఊహించినప్పుడూ కవికి కలిగిన స్పందనమూ దాని ఫలితము ఆనందమూ సంతుష్టి కవి వర్ణనను విన్న చదువరికీ కలుగుతుంది. చివ్వర పతాక (climax) ఉన్న చిన్నకథలు ఉదాహరణం దీనికి. రెండోపద్ధతి కవి తనభావాన్ని నిశ్రేణిగా నమర్చి చివ్వరి భావాలతో చదువరిని భావావేశంలోనికి మీటడం. ఒక మానవుడు కష్టపడుతూండగా చూచినా, అతడు 'దుఃఖపుటెడారులలో నా కన్నీరు నేనే తాగేను' అన్నా మనము జవ జవలాడతాము. ఈ రెంటు పద్ధతులూచదు వరుల ఉపయోగానికని కవితారచన చేసే సత్కవులందరూ వాడ తారు. కవులు ఇంకోరకమువారున్నారు. వారికి తమ చాతుర్యాన్ని చూపిద్దామనే దుగ్ధ. తాము ఊహించగల ఉత్ప్రేక్షల్ని గుత్తులు గుత్తులుగా విసురుతారు. ఫలము – చదువరి దృష్టి రచన నిర్దేశించే సౌందర్యము మీద కాకుండా రచనా సౌందర్యము మీద నిలవడము. వర్ణించే వస్తుసౌందర్యము ఎఘిరిపోయి వర్ణించగల ప్రజ్ఞనిలుస్తుంది. ఇక ప్రస్తుత విషయము: స్వామి చూపులకు 12 దళపదులను కూర్చి "పలపలని వెన్నెలలు చిలికించెడు విధాన, తెలిబూది పూత చెట్టులు గట్టిన విధాన, నగలు కాటుక కొండ పగిలి చెదరు విధాన, తరగలను చిఱుగాలి బొరలు లేచినయట్లు, నెమ్మిదనపింఛమ్ము నెమ్మివిప్పినయట్లు, శివుచెంతశర్వాణి సిగ్గుజారినయట్లు (విష్ణుదేవుడు చీరలివ్వగలవాడు, తిరిపెపుటాలు పాప మీమె సిగ్గుకాచువారెవరు?), దొలుసారి రతి వింత సౌలభ్యగ్రమ్మినయట్లు," అంటూ తమకు అందిన అందాలు చెప్పుకుంటూ సాగినారు కవిగారు. ఇవి కన్నుల అందమును తెలుపునట్టి వేమీకావు, కవిగారి సౌందర్యపు కొఠారు లలోని వస్తువేనని స్పష్టము. వీరి పద్ధతిలో కనులకే కాదు దేనికేనా చేర్చవచ్చును వీటిని. వర్ణ్య వస్తు సౌందర్యమును కానేకాదు ఇవి చెప్పడమూ, మరి కవిగారి సేకరింపు గొప్పను. ఈ రచనలు కవి కోసమే, మనకు శివతాండవంలో స్వామికన్నుల సౌందర్యము, చూపడానికి కానేకాదంటున్నాను. ఇది ప్రబంధాల పద్ధతి. ఈ పంక్తుల రచనలో పెద్దనాది కవుల సంప్రదాయాలు పాటించ బడ్డాయా "ఏమి? ఆ పద్ధతికి పురుగేమైనా పుట్టిందా" అని ఎదురు

ప్రశ్న వేస్తే 'లేదు మహాస్వామీ, ఈ రచన ఆధునికుల పద్ధతిలో కాక నాలుగువందల సంవత్సరాల క్రితపు ధోరణిలోనే ఉన్నది అని చెప్పడమే నా ఉద్దేశ్యము. మంచీ చెడ్డా మీరే నిర్ణయించుకోమంటున్నాను' అని జవాబు. నన్నయకాలం నుంచి మొన్న మొన్నటి వరకూ, చెప్పే వస్తువు ఇంకొకరిదైనా, చెప్పినవారికే గౌరవము ఇస్తూండినారు తెలుగు నాటి వివిధ మండలాలవారు. నేడు మారిపోతారా?.... అందున్నూ పుట్టపర్తి వారి పోలికలు వారివేనాయె! వ్యుత్పత్తి బలములో ప్రతిభను సాగించుట ఒక పద్ధతీ ప్రతిభా దళాల్నన్నిటినీ గుచ్చెత్తి పాండిత్య స్ఫురణ-అనగా వ్యుత్పత్తి బలస్ఫురణను కలిగించేది ఇంకొక పద్ధతిని. నారాయణాచార్యులు గారిది ఈ రెండో పద్ధతి.

శివుడు చేస్తూన్నది తాండవము; నృత్తము మాత్రము కాదు. నృత్తములో భావముండదు. నృత్యములో ముద్రికా కరణ అంగహారములచే సూచించబడే భావముంటుంది. 22, 23 దళపదులలో వినపడేసమశీర్షకములుసమదృష్టిపతాకము, త్రిపతాకము, అర్ధపతాకము అనే హస్త సంజ్ఞలు నాట్యశాస్త్ర విభూతికి చెందినట్టివేనా? ఇక్కడి శివతాండవ సౌందర్య వర్ణనకు చెందినవా? అని నాకు సందేహము కలిగినది. ఇది వరకు ఒకసారి ఏడవదళపదిలోని మాటలు నాట్య శాస్త్రపరిభాషవి వచ్చాయి. కవిత్వములో అలంకారశాస్త్రపదావళిరావు, అలంకారాలే వస్తాయి. "ఉపమరూపక ఉత్ప్రేక్ష అతిశయోక్తి, భ్రాంతిమంతము వెలుగునట్లు రచించినాడు" అన్న విధంగా సమశీర్షకము, ధూతమస్తము హంసాస్యము అర్ధ చంద్రకరము, సూచీముఖము అన్నవి పరమశివుడు వినరినట్లు వ్రాయడము ఆయన నాట్య విజ్ఞానము సమగ్రము అన్నట్లేనేమోకాని ఆ మాటలకు లక్ష్యమైన నాట్యవస్తు సౌందర్యమును కాన్పించుట కాజాలదు. రెండవ దళపదిలోని సంభ్రమ వర్ణనవలె నాట్య సౌందర్యము - నాట్యశబ్ద వాచ్యతతో కాక - నాట్య వస్తు ప్రదర్శనముతోనే కావాలనుకుంటాను. ఈ శివతాండవములో 1, 2, 3, 4, దళ పదులలోనాట్యము చదువరికి కనబడుతుంది. (ఆ తరువాత కట్టతెగిన ఉత్సాహము అందపుటూహలను ప్రోవువెట్టినది) మళ్ళీ 23 లో "కెలకులకు కంఠమ్ము మెలపుతో నాడించి, కనుగ్రుడ్లు గనుల జక్రము జుట్టిరా, ధనువులై బొమలు దద్దయుగాంతిజూపరా, నొక కాలు దివిగొల్వ నొకకాలు భువినిల్వ, ఇలయెల్ల చెలువు రూపెత్తి నిల్చినయట్లు, కనుదోయి సైగలకు గనుబొమలె బదులొసగ అటు వైపు నిటువైపు నమల హస్తముబాగి" అంటూ నాట్య సంరంభమును చక్కగా కళ్ళకు కట్టేటట్లు వర్ణించారు. వర్ణన ఇలాగ వుండాలంటాను.

సంగీత శాస్త్ర పదావళికూడా సంరంభముతో వచ్చినది. మయూరము షడ్జము నాలిపించెననుట శాస్త్రసిద్ధము. లోకములోని మయూరము కూసేది ఒక స్వరము కాదాయెనేమిగతి? పికమూ అంతే గజాననుడూ అంతే. శాస్త్రాన్ని—కవి సమయాన్ని అందాము-తలుచుకుని ఆనందించవలసినదే. ఇక్కడ ఇంకొక చిక్కు. మయూరము పాసిందన్న షడ్జము ఆధారషడ్జమము కాలేదు, స్థాయి చాలా యెక్కువగదా? అక్కడా కవి సమయమే బలవత్తరము లోకదృశ్యము కంటె గమకములు మూర్ఛనలు మంద్ర మధ్యమ తారస్థాయిలూ చూపేడట ప్రభువు. వక్రరాగము నెత్తి "కనకాంగియే"నని ఎరుగలేని పక్క వాద్యకారునికి చెప్పెనట నటరాజు. కనకాంగి వైచిత్రి శుద్ధ స్వరబద్ధమౌట మాత్రమే. మరి వక్రరాగమనగా యేమిటి? మూర్ఛనలో వక్రతగల నాటకు రంజి వంటి రాగములు వక్రరాగములు. కనకాంగి కాదు. దాన వక్రతలేదు. రాగ సామ్రాజ్యాధి దైవతము మధ్యమము, దాన రెండు భేదాలూ కలవూ రెండూ వినిపించెనట స్వామి. తంబూర తానుగా గళము విచ్చుక పాడినదట. తంబూర శ్రుతి వాద్యమే దానిలో రాగములోని స్వరములు పలికించే ఏర్పాటు లేదు. నాలుగు తీగెలూ నాలుగు స్వరాలు పలుకుతాయి. అయితే తంబూరకు నిత్యనివాసము గాయకునితోనే. ఆ తంబూర కూడా గళము విచ్చుక పాడెనట!

షడ్జమము పట్టినప్పుడు శరజన్ముతేజి (అందరూ అక్కడే ఉన్నారు!) పింఛము విప్పినదట! ఇది కవి సమయానికి అందపుటు పయోగము, స్మృతి సౌందర్యాన్ని రేపుతుంది. ఇంద్రుడు గౌతమ ముని శాపపరిమితికి విచారించాడనడమూ, కాముణ్ణి పరమశివుడు తన మూడు కళ్ళలోనూ సృష్టించాడనడమూ ఇలాంటి అందాలే!

'జనవాంతరంబులో సంసక్తమయి వచ్చి మనసు లోతుల నిల్చి మాటాడువాసనల'ట మువ్వలు!

శివునికీ విష్ణునికీ అద్వైతము చెప్పేరు. ఈ రెండవరకపు అద్వైతము నిర్గుణముకాదు. చాలా అందమైనది. 'నవజటాపటల సంధ్యా కాలవారిదంతా వికాన చంద్ర మంద్రాత పార్థీ శరీర!' అని శివుని వైకుంఠుడూ, 'పద్మమనోజయావకపుష్పితశరీర! పద్మ సుందర నేత్ర! బావాంబరాతీత' అని శంకరుడు విష్ణువునూ నుతించిరట. విష్ణువు శివునికంటె వేరుకాదు. ఇద్దరూ ఒక్కరే అని చెప్పేప్రయత్నం చేశారు నారాయణాచార్యులుగారు.

# పగబట్టిన అరణ్యం

## శ్రీ సోమసుందర్

రాత్రి విన్న
అంత మధురాతి మధుర సంగీతమంతా
తెల్లారక ముందే
ఎటుపారి పోయిందో అంతుపట్టదు
మహారథ్యగా పరచిన నాహృదయ సీమలో
దయతలచి పాదముద్రలైనా
విడువలేదు.

చలితో పోరాడి పోరాడి
అలసి వెలిసి పోయినరాత్రి
కొసల పొగమంచు ముసుగులో దురపిల్లుతోంది
నీరవ నిర్నిద్రహృదయం
ఒక్కటే నాకు మిగిలిన శరణ్యం....
భారవహమైన నైరాశ్యం
పట్టపగలే పగ పట్టిన అరణ్యం....
ఓహో సంగీతలహరీ -
సరోవర తరంగాలు కలవరించే
సరోద్‌నాద మకరంద ఝరీ -
ఈ దయనీయుని సంక్షుభిత స్వాంతవనంలో
తొలకరి మబ్బుల వినీల మయూఖాలతనిసే
పురి విప్పి నర్తించే
సువర్ణ మయూరమై దయచేయవా ?
ఆశా సహస్రాంశువుగా నన్ను మార్చవా ?
నువ్విలా జరిగి జరిగి
నా చేతుల కంద రానంత దూరమైతే
బ్రతక గలనా ?

రాత్రి విన్న
అంత మధురాతి మధుర సంగీతమంతా
తెల్లారకముందే
ఎటుపోయింతో అంతు పట్టక -
చలిలో నరాలు కొయ్యబారుతూ
చీకటి జాములో వెతుక్కుంటూ బయల్దేరానా
ఎప్పటికైనా వేకువ.
గోర్వెచ్చని కోరికలతో సేదతేర్చకపోదనే
ఆశ ఆధారంగా
భారంగా అడుగులు సారిస్తున్నానా
మంచు రవ్వలు పరచిన
గరిక మైదానాల పచ్చల మొండిగుండెల మీదుగా
సంగీత శర్వరి కోసం పోతున్నానా -
తుమ్మకొమ్మల ముళ్ళకంపల్లో
సాలీళ్ళల్లిన బూజుగూళ్ళు
సంగీత పేటికలై మెరసిపోతున్నాయి ....
అమ్మో - మృత్యువు పన్నిన వలలు !
దిగంత శూన్యం వికవికా నవ్వింది నన్నుచూసి ....

యాతన మయలోకం
పన్నిన వాగురలనుంచి నన్ను తరింపచేసే
సంగీతం లభించలేదు, సరికదా -
అభయ మాధుర్యాల
విభ్రాంత మరుద్వ్రతులైనా దొరకలేదు.
కొంటి కోణంగి గువ్వరాళ్ళ ఎదురు దెబ్బలకు
పగిలిన పాదాల మునివ్రేళ్ళనుంచి
రక్త స్రవంతులు ....
ఎవరి దాహం తీర్చను ?

ఓ రసమయ సంగీతలహరీ,
సాక్షాత్కరించవా ?
తప్త హృదయకాసారంలో కురిసే
ఆశా వార్షుకాంబరమై నింపవా ?
కర్తవ్య దీక్షావిధుల అనుగ్రహించవా ?
నిశ్చల సమాధిలో
మేనుమరచి, సర్వాన్నీ మరచి
పత్రతంత్రులను నిశ్శబ్దంగా మీటి రాగాలాలపిస్తూ
వెన్నెలనంతా ఒడిసిపట్టిగ్రోలే కొబ్బరిచెట్టూ
అభయ సంగీత ముద్రలు కాస్త నా కందించవా ?
చిరు చిరు ఆకుల పెదవులు బిగించి
పంశధారల నా దోర్మికల కురిపించే సరుగుడూ
నువ్వేనా దారి చూపించలేవా ?
ఇంత విశాలమగు కాస్మాస్‌లో
ఏ ఆనవాళ్ళ ఆధారంతో
నన్ను విడిచి వెళ్ళిన సంగీతాన్ని ఎలా వెదికి పట్టుకోనూ ?

డా॥ యు. ఎ. నరసింహమూర్తి

# కవిత్వము-అనౌచిత్యము

"ప్రతిభలేని కవివాక్కులో/పిలిస్తేపలికే అనౌచిత్యంలా దూరంగా దాక్కొని తొంగి చూస్తోంది/మృత్యువు కోరల వెలుతురు" అని కుందుర్తి మాట. ఇక్కడి ఉపమానం పరస్పర పరిపూరక మనుకుంటే జీవితానికి మృత్యువు కోరలు ఏవిధంగా నాశనాన్ని కల్పిస్తాయో, ఆవిధంగా అనౌచిత్యం కవిత్వాన్ని పాడుచేస్తుందని తెలుస్తుంది. "తనకీ, ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధరావమే కవిత్వమంటాడు చెలం."[1] ఆ సామరస్యాన్నే ఆలంకారికులు ఔచిత్యమంటారు. ఆ సామరస్యానికి విఘాతం కలిగినప్పుడు అనౌచిత్య మంటారు. ఈ శబ్దాన్ని అలంకార శాస్త్రంలో ముందుగా ప్రయోగించినది ఉద్భటుడు. శాస్త్ర విరుద్ధము, లోకవిరుద్ధము అయినది అనౌచిత్యమని ఉద్భట-ఇందు రాజుల అభిప్రాయంగా విశదమౌతుంది.[2] వ్యవహార-ఆకార-వేష-వచన-దేశ-కుల-జాతి-విద్యా- వయః- స్థాన- విత్తపాత్రముల విషయంలో గ్రామ్యత్వం అనౌచిత్యమని రుద్రటుడి అభిప్రాయం.[3] వివక్షితములైన శృంగారాది రసముల ప్రతీతికి విఘ్నం కలిగించడమే అనౌచిత్య సామాన్య లక్షణమని మహిమభట్టు చెప్పేడు.[4] రసాదులకు భరతాదులచే చెప్పబడిన లక్షణాలయొక్క సమగ్రతలేక ఒక కొంత ఉండడం అనౌచిత్యమని విశ్వనాదుని అభిప్రాయం.[5] దేశము - కాలము - వర్ణము - ఆశ్రమము - వయస్సు - అవస్థ- ప్రకృతి - వ్యవహారము మొదలైన ప్రపంచజాతములైన విషయాల పట్ల లోకసిద్ధము - శాస్త్రసిద్ధము అయిన ద్రవ్య - గుణ- క్రియాదుల కంటె భిన్నమైనరీతి ఏర్పడడం అనౌచిత్యమని జగన్నాధపండితుని అభిప్రాయం.[6] శాస్త్ర బుద్ధికి - లోకదృష్టికి విరోధ మేర్పడి లోక దృష్టినే ప్రమాణంగా గ్రహించి శాస్త్రదృష్టిని విడచిపెట్టాలి. నిన్న నిజమైనది నేడు మిథ్య - నేటి నిజం రేపు మిథ్య కావచ్చును. ఆంధ్ర సాహిత్య పరిషదధ్యక్షుని ఊహకు - భావకవులకు గల భేదాన్ని కృష్ణశాస్త్రి ఇలా వివరించేరు.

"వారికీ మాకు ఉన్న దావంత తేడ
లేని మేనకతో వారు ప్రేమలేని
ఉపరతుల మున్గిపోతారు; ఉన్న చెలియ
సోయగము మాకు ఊర్వశి తీయదనము."

ఆనాటికి ఆ భావన ఉచితమనిపించవచ్చును. కాని కొంత కాలానికి దిగంబరకవుల దృష్టికి భావకవులు "భావనా కల్పిత ప్రేయసీవక్షోజాల రసశిఖరాలకు వ్రేలాడుతున్న గండుగబ్బిలాలు"గా కనిపించేరు. లోకం యొక్క రూపం పరివర్తనశీలమైనది. కాబట్టి క్షణ క్షణ వికాసశీలం కలిగినట్టి లోకవ్యవహారమే అనౌచిత్యజ్ఞానానికి పరమ ప్రమాణమని జగన్నాథ పండితుని అభిప్రాయం.[7]

కవిత్వంలో ఆకృతికి-వస్తువుకు సంబంధించి పరస్పర విరుద్ధాలైన ద్రవ్యాలకు ఒకచోట కలయిక సంభవిస్తే దానిని అనౌచిత్యమంటామని బెరిలిన్ అనే మనస్తత్వ శాస్త్రజ్ఞుడు చెప్తాడు.[8] ఒక ఉత్తేజకశక్తి విజయవంతమైన ప్రేరణలను కలిగించగా, దానిననుసరించి వచ్చిన ఉత్తేజకశక్తి మన నిరీక్షణను వమ్ముచేస్తూ వైఫల్యాన్ని పొందితే దానిని మనం ఆశ్చర్యంగా భావిస్తున్నాము. కొన్ని సందర్భాలలో ఒక ప్రేరణ తనను అనుసరించే లేదా తన తరువాత వచ్చే ప్రేరణవిషయంలో ఒక విధమైన నిరీక్షణను మనలో చొప్పిస్తుంది. ఈ విధమైన నిరీక్షణ తృణీకరించబడినట్లైతే, అతిక్రమించబడినట్లైతే దానిని అనౌచిత్యమనవచ్చును. అందుచేత ఆశ్చర్యానికి, అనౌచిత్యానికి మధ్య చెప్పుకోదగినంత భేదం లేదంటాడు బెరిలిన్.

"నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నేనెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు-
నెత్తురు క్రక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరె...." అనే రచనలో కళాపక్షాన్ని విడచి వస్తుపక్షాన్ని పరిశీలిస్తే ఆశ్చర్యానికి, అనౌచిత్యానికి గల సాన్నిహిత్యం విశదం కాగలదు. రంగులు - ధ్వనులు వేరు వేరు కలయికలలో ఏ రకమైన ఇంద్రజాలాన్ని సృష్టించ గలవో అదే విధంగా కవిత్వంలో పదాలు-వస్తువులుకూడా ఉచిత-అనుచితాలుగా ప్రమాణంగా గల వింత కలయికలలో వేర్వేరుగా గుర్తింపులను పొందుతాయి. అవి పరస్పరం ఆకర్షణను కలిగివుంటాయి. ఒకదానినొకటి తిరస్కరించేవిగా వుంటాయి. ఒకదానినొకటి తగలబెట్టేవిగా వుంటాయి. ఐతే వాటి కలయిక మాత్రం కవుల సామాన్య లక్ష్యమైన, యథార్థమైన, కవితా సంబంధమైన ఐక్యాన్ని సమకూరుస్తుంది-అంటాడు సార్త్రే.[9] ఈ ఆకర్షణ వికర్షణల ప్రత్యుత్థానమే

మన అలంకార శాస్త్రం. భారతీయాలంకారికుల అభిప్రాయాలిక్కడ రససంప్రదాయాన్ని దృష్టిలో పెట్టుకున్నవి కాగా బెరిలిన్ సర్వ సామాన్యమైన అనౌచిత్య లక్షణాన్ని గూర్చి చెప్పడం జరిగింది.

అనౌచిత్యం లేకుండా స్వేచ్ఛను పొందగలిగితే దానివలన మనం ఎంతోగొప్పది, అతి స్వచ్ఛమైనది ఐన ఆనందాన్ని పొంద గలుగుతామని జార్జిశాంతాయన అభిప్రాయం. అంతేకాక ఎదురు చూడని ఔచిత్యం చమత్కారాన్ని కల్గిస్తే, హఠాజ్జనితమైన అనౌ చిత్యం హాయినంతటినీ పాడుచేస్తుందని కూడా ఆయన చెప్పేడు.10 అందుకే "రుచీ ఔచిత్యం ఇవీ ముఖ్యం మెప్పుకి" అంటారు శ్రీశ్రీ, అముద్రా స్వవిషయసూచికలో. "ప్రతిమాటకీ.... ఔచిత్యం వుంది" అంటాడు తిలక్. ఔచిత్యం కావాలన్న పైవారిమాట, అనౌచిత్యం కావ్యజీవితానికి మృత్యుదంష్ట్ర వంటిదన్నమాట. ఆనందవర్ధనుడు శిరసావహించాడు. అనౌచిత్యం కంటె వేరొకటి రసభంగహేతువు లేదనీ, ఔచిత్యమే రసనిర్దేశానికి పరమరహస్యమని ధ్వన్యాలోకం చెప్పింది.11 ఉత్సాహం స్థాయి భావంగా గల వీరరసాన్ని పోషించ వలసిన సందర్భంలో ఈక్రింది శ్రీశ్రీ చరణాలు ఏవిధంగా రస భంగాన్ని కలిగిస్తాయో గమనించవచ్చును.

> అవనీమాత పూర్ణగర్భంలా – ఆసియా ఖండం ఉప్పొంగింది
> సర్వప్రపంచ యోనిద్వారం – భారతం మేలుకుంటోంది.

'గాంధీజీ' అనే ఈ గేయంలో మొదటినుండి యుద్ధంయొక్క వైఫల్యాన్నీ–గాంధీ శాంతవీరాన్నీ పోషించుకుంటూ ఆ ఉత్సాహం ఉత్సవంకాగా ప్రపంచానికి భారతదేశం మార్గదర్శకమయ్యే మహ దవకాశాన్ని వివరించడం జరిగింది. కాని ఆ భావం అలంకారపు మటుమాయలోపడి వికృతస్వరూపాన్ని ప్రదర్శించింది. నిండు చూలాలి పొంగిన కడుపుకాని, ప్రసవించే ప్రయత్నంలో వ్యాకోచం పొందిన స్త్రీ జననాంగం కాని దర్శనీయమైనవి కావు. ఆ రూపాలు ఊహలో సైతం ఏవగింపును కలిగిస్తాయి. అంతటితో పాఠకునిలో ఆ ఉత్సాహసంబంధమైన ప్రతిస్పందనలన్నీ భగ్నమౌతాయి. ఈ అనౌచిత్యం వలన రసభంగ మేర్పడుతుంది. ఈ విధమైన ప్రయో గాల ముందు దిగంబరకవుల మసలివరిబీజాలు, పునర్యోనీప్రవేశం, కారపురోకళ్ళ విషయింపులు అనుచితాలుగా కనిపించవు. అందుకు వారి మేనిఫెస్టో, వారి లక్ష్యాలే కారణాలు. పాఠకుల సంసిద్ధత వారి తీవ్రభావాలకు, తీవ్రపదజాలానికి అనుకూలంగా వుంటుంది. పై ఉదాహరణంలోని రసంభంగం అభివ్యక్తి వైకల్యం వలనఏర్పడింది. అంటే ఆ దోషం కవికి సంబంధించినది. ఈ రీతిగాకాక అనుభూతి వైకల్యం వలనకూడా రసభంగమేర్పడుతుంది. అక్కడ సహృద యుడు తనకు చెందిన సుఖదుఃఖాదుల వలన అవధానాన్ని కోల్పో యినవాడై రసానుభూతిని పొందలేకపోతాడు. వీధినాటకాల ప్రయో గాన్నిగూర్చి అందరికీ తెలిసినదే. నటులు గొంతుచించుకొని పాడడం, హార్మొనీ వాళ్ళగొంతును కమ్మేస్తూమోగడం, నటనలేక పోవడం, ఇతరరభస. ఆ సందర్భంలోని రసభంగాన్ని వేగుంట మోహనప్రసాదు 'వగపేటికి చల్లచిందినన్' అనే కవిత చెప్తుంది.

> "హార్మొనీపెట్టి సాగి సాగి ప్రియ
> హృదయాన్ని పొరలు చీల్చి
> పమిట జార్చి హత్తుకొనును.
> నిను బాసి మనజాల నో ప్రియా....
> హా ! హతవిధీ !!
> ఎక్కడో కిసుక్కున సోడానవ్వు !!

ఇక్కడ అరున్నొక్కశ్రుతిలో ఘోషపెట్తూన్న హార్మొనీని విడచి ఇతర లోపాలను మరచి, ఆ విరహగీతంలో ఐక్యం కావాలని ప్రయత్నించే ప్రేక్షకుడు కిసుక్కుమన్న సోడానవ్వుతో ఒక్కసారి బైటకునెట్టబడతాడు. దాన్నే కవి 'రసభ్రష్టపరాకాష్ట' అన్నాడు. ప్రదర్శనలోనేగాక, కవిత్వంలో సైతం పాఠకుడీవిధమైన అవస్థకు లోనవడం జరుగుతూ వుంటుంది. ఐతే రసభంగానికి కారకుడు కవి ఐనా, పాఠకుడైనా ఆ ఫలితాన్ని అనుభవించేది మాత్రం పాఠకుడే. కవిత్వంలో రసభంగం ఎలా జరుగుతుందన్న విషయాన్ని గూర్చి ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, మమ్మటుడు మొదలైనవారు విశ దీకరించారు. వీరంతా అనౌచిత్యం రసభంగాన్ని కలిగిస్తుందన్న అభిప్రాయం కలవారే.

అనౌచిత్యానికి ఏవిధంగానైనా కవితా ప్రపంచంలో కాలూనే అవకాశంలేదా ? అనే ప్రశ్నకు కూడా పూర్వుల సమాధానముంది. అనౌచిత్యం వలన కావ్యానికి ఆత్మహానిలేదని ఆలంకారికుల భావన.12 కావ్యక్షేత్రంలో అనౌచిత్యం యొక్క ప్రవేశాన్నిగూర్చి ముందు చెప్పినవాడు ఉద్భటుడు. రస భావాదులను కూర్చడంలో ఎక్కడ శాస్త్రవైరుధ్యం, తన్మూలంగా లోకవైరుధ్యం సంభవిస్తుందో అది ఊర్జస్వితాక్రవ్యం ఔతుందని ఉద్భటునిమాట.13 రాగద్వేష మోహ కారణకములైన అనుచిత ప్రవృత్తిగల రసభావాదులను కూర్చడంలో ప్రకటించబడిన బలం మూలంగా ఊర్జస్వి అనే వ్యపదేశం సిద్ధించిందని ప్రతీహారేందురాజు ఈ విషయాన్ని వివ రించేడు.14 ఇక్కడేర్పడే వైరుధ్యాన్ని వారిద్దరూ ఆభాసమని పేర్కొన్నారు.15 ఆభాస మంటే అవాస్తవిక రూపమని అర్థం. అనౌచిత్యంతోకూడి ప్రవర్తించిన స్థాయీభావం యొక్క ఆస్వా దాన్ని రసాభాసమని, వ్యభిచారిభావం యొక్క ఆస్వాదాన్ని భావాభాసమని ఆనందవర్ధన – అభినవగుప్తులు పేర్కొన్నారు.16

అనుచితమైన విభావం ఎక్కడ రసానికి ఆలంబన మౌతుందో దానిని రసాభాసమంటారని జగన్నాథుని అభిప్రాయం.[17] ఇక్కడ రసాభాసప్రవృత్తిలో రెండు భేదాలు కన్పిస్తాయి. (i) స్థాయిభావం యొక్క అనుచితప్రవృత్తి. (ii) విభావంయొక్క అనుచిత ప్రవృత్తి. స్థాయి భావానికి చెందిన ఉచితానుచిత ప్రవృత్తియొక్క నిర్ణయం దాని కాశ్రయమైన విషయంలోని ఉచితానుచితాలనుబట్టి ఏర్పడుతుంది. 'చితిపేర్చుకుందాం' అనే చెరబండరాజు కవితలో ఈ పంక్తులు ఇక్కడ చూడదగ్గవి.

జాతిని జాగృతం చేసే
చైతన్య పుంస్కోకిలల కంఠాల మాధుర్యం
జావలా జారి జారి
ముసలిదాని ముద్దులోని తీపిలాగుందని
మహాశయా పాఠకుడా
మనస్సెప్పుడేని మళ్ళించావూ ?

ఇక్కడ శృంగారభావం ఆ భాసాన్ని పొందుతూంది. అది కవి వాంఛ. కవులు నిత్యనూతనులై సమతావ్యవస్థను సాధించి సాంఘిక చైతన్యానికి మార్గదర్శకులు కావాలి. అందుకు వ్యతిరేకంగా పాత భావాలను పట్టుకొని ప్రేలాడడం ముసలిదానితో సరసమాడడంవంటి దని కవి భావన. మాధుర్యం జావలా జారిపడడంలోని వ్యగ్రత ఇక్కడి అనుచితత్వాన్ని చెప్తూంది. అటువంటి కవుల కల్పనలపట్ల విముఖతను చూపకుండా గతాను గతికంగా స్వీకరిస్తున్న పాఠకులు కూడా దోషులేనని కవి భావన. ఆ కారణంగా ఇక్కడేర్పడిన రసాభాసానికి దానికి స్థాయియైన భావమే కారణంగా కనిపిస్తుంది. ఇక రతి-హాస-శోకాది స్థాయీభావాలు అనుచితములైన ఆలంబనలపట్ల ఉన్ముఖత్వాన్ని పొందడం కొందరి దృష్టిలో రసాభాసమవుతుంది. తిలక్ 'ద్వైతం' చూడండి.

"ఓ ప్రత్యూషపవనలోల మందార లతాంతమా !
నేను ప్రదోషవేళా తమాల శాఖాగ్రఘూకాన్ని
అటు-ఆనంద సుధర్మవైపు నువ్వువెళ్ళ
నక్షత్రధూళిని చల్లుతూ
ఇటు-కలల బూడిదరాసులమీద కూలబడతా కన్నీళ్ళు
చిమ్ముతూ."

ఇక్కడ స్థాయిభావమైన రతి ఉచితమైనదే. దానికి ఆలంబనాలైన వ్యక్తులమధ్య ఉత్తర-దక్షిణ ధృవాలకున్నంత దూరమేర్పడడం వలన వారిద్దరూ ఏ కేంద్రంలోనూ కలుసుకోలేకపోయారు. ఏ అక్షాంశరేఖమీదా నిలిచి కౌగిలించుకోలేకపోయారు. వారిద్దరిమధ్య ప్రేమ బద్ధవైరం లాంటిదయింది. తత్ఫలితంగా రసాభాసమేర్పడింది. వాస్తవానికి పై రెండు రీతుల రసాభాసానికీ మౌలికమైన భేదం లేదని విమర్శకుల భావన.[18] రసాభాసంలో ముందు రస ప్రతీతి ఏర్పడుతుంది. ఆ తరువాత అనౌచిత్య జ్ఞానం కలుగుతుంది. అందుచేత రసాభాసం రసంలో అంతర్గతమైనదే నని ఆలంకారికుల భావన.[19] ఈ రకంగా అనౌచిత్యానికి ప్రాచీనులు స్థానం కల్పించారు.

అనౌచిత్యం హాస్యానికి కారణమౌతుందని భారతీయాలంకారికుల మతము. మొల నూలు కంఠానికి ధరించడం వంటి అయోగ్యమైన వేషం వలన హాస్యం జనిస్తుందని భరతుని అభిప్రాయం.[20] ఈ అభిప్రాయం ఆధారంగా అభినవగుప్తుడు ప్రత్యేకమైన రసంయొక్క ఆభాసం చివరకు హాస్యంగా పరిణమిస్తుందని సిద్ధాంతీకరించడం జరిగింది. క్షేమేంద్రుడు ఔచిత్య విచారచర్చలో భరతుని మార్గాన్ననుసరించి కంఠానిమేఖలను ధరించడం వంటి చేష్టలవలన హాస్యం కలుగుతుందని చెప్తే అదే అనౌచిత్యమని స్ఫురింపజేసేడు.[21] ఈ సందర్భంలో ప్రాచీన - ఆధునిక పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాలు సైతం ఇలాగే వున్నాయి. ఒక చిత్రకారుడు గుఱ్ఱపు మెడను మానవ శిరస్సునకు, అనేక జాతుల పక్షులకు చెందిన విభిన్నమైన ఈకలను పెదవులకు, ఊర్ధ్వ కాయంలో సౌందర్యవతి అయిన యువతి రూపాన్ని, అపర కాయంలో వికృతమైన మత్స్యరూపాన్ని అతికి చిత్రాన్నివ్రాస్తే దానిని చూసి ప్రజలు పరోక్షంలోనైనా పరిహసిస్తారని ప్రాచీన గ్రీకు విమర్శకుడైన హొరేసు అభిప్రాయం.[22] సామాజికౌచిత్యానికి దాని లక్షణం నుండి పరిచ్యుతిని పొందిన వస్తువునకు మధ్య గల భేదాన్ని బట్టి అనౌచిత్యమనే సిద్ధాంతం పరిగణింపబడుతూందని అలెగ్జాండరనే విమర్శకుని మాట. వివాహానికి అతిథిగా పోయే వ్యక్తి ఆ సమయానికి తగిన బట్టలు కట్టుకోకుండా భోజన సమయంలో అవసరమైన వేషాన్ని ధరించడం అనుచితమని అతడు వివరించేడు.[23] ఈ విధమైన చర్య సహజంగా హాస్యోత్పాదక మౌతుంది. ఆభాసమే హాస్యాన్ని కలిగిస్తుం దనే ఈ అభిప్రాయం సర్వేసర్వత్ర వర్తించదని జార్జి శాంతాయన అభిప్రాయం. హాస్యం ఉత్తమమైనది. అయితే దానివల్ల ఏదీ నష్టాన్ని పొందకూడదు. అనుచితత్వానికి అంతకుముందే అనుచితమైన స్థితి మాత్రమే సరియైన స్థాన మౌతుంది. అప్పుడే దానిని మనం అనుచిత శంక లేకుండా ఆనందించగలము. విదూషకుని చేష్టలను హాస్యోక్తులను చూస్తూ వింటూ ఆనందిస్తాము. కాని అవే చేష్టలు, మాటలు ఒక నాగరికుని విషయంలో ప్రవర్తిస్తే మనకు సుఖాన్ని కలిగించబోవు. అనౌచిత్యం గాని, దిగజారినతనం గాని మనకు హాస్యంలో ఏ మేరకు సుఖాన్ని కలిగిస్తాయో ఈ విషయం మనకు

స్పష్టం చేస్తుంది. నిజానికి విదూషకుని చేష్టలలో సైతం ఒక విధమైన ఔచిత్యము, పద్ధతి వుంటాయి. అనుచిత ప్రవర్తన, దిగజారుడుతనం అన్ని వేళలా స్వభావసిద్ధమైన గుణాలుగా వుంటే అవి హాస్యంలో సైతం మనకు బాధనే కలిగిస్తాయి. ఒక్కొక్క సందర్భంలో వాటివలన కలిగే అఘాతం మనలోని తిరస్కార దృష్టి, క్రౌర్యము, స్వార్థము మొదలైన భావాలను ప్రేరేపించడం ద్వారా గాని, మన అవధానాన్ని ఆకర్షించడం ద్వారా గాని తదనంతరం అనుభవించే సుఖానికి కారణం కావచ్చును. కాని అనౌచిత్యం – దిగజారిన ప్రవృత్తి ఎప్పుడూ బాధాకరంగానే వుంటాయని శాంతాయన వివరణ వలన తెలుస్తుంది.24

ఒక్క హాస్యమే కాదు విషాదం సైతం అనౌచిత్యం నుండే పుట్టుందని ఎవరెట్ అనే విమర్శకుని అభిప్రాయం. ప్రకృతిలో అత్యంత విషాదకరమైన జీవనపోరాటం పరిసరాలకు ప్రాణులకు మధ్య ఏర్పడిన కొద్దీ లేక గొప్పదైన అనౌచిత్యం నుండేపుట్టుంది. ఒక వస్తువుకి దాని ఆకృతికి మధ్య ఏర్పడిన అనుచితత్వంవలన హాస్యం పుడ్తే, ఒక వస్తువుకు దానికి చెందిన వాస్తవికావస్థకు మధ్య ఏర్పడిన అనుచితత్వం వలన విషాద మేర్పడుతుందని ఎవరెట్ వివరించాడు. 25

ఏడవకం డేడవకండి
మీరక్తం కలగి కలగి
మీనాడులు కదలి కదలి
మీ ప్రేవులు కనలి కనలి
ఏడవకం డేడవకండి
ఓవ్యథా నివిష్టులార !
ఓకథా వశిష్టులార !
పతితులార !
భ్రష్టులార !
బాధాసర్పదష్టులార !
ఏడవకం డేడవకండి !

విద్యానాథుడు కరుణం రౌద్రకర్మనుండి పుట్టుందని చెప్పేడు. కాని ఈ విషాదానికి రౌద్రకర్మ హేతువుకాదు. ఇక్కడి పతితులు, భ్రష్టులూ సైతం మానవులే. మానవులుగా వారు పొందదగినవి కొన్ని వున్నాయి. కాని సమాజంలోని అసమానత కారణంగా వారు తమ కనీసావసరాలకు దూరంగా కాలం వెళ్ళదీస్తున్నారు. మానవత్వం ఇక్కడ వస్తువైతే, ఆ మానవులలో కొందరు బాధా సర్పదష్టు లవడం ఇక్కడి వాస్తవికావస్థ. తమ జీవితవాస్తవికతకు పరిసరాలకు నడుమగల భేదం వలన పుట్టిన అనౌచిత్యమే ఇక్కడి గాఢశోకానికి హేతువయింది కదా ! వ్యవస్థ వస్తువైనపుడు అనౌచిత్యం ఏవిధంగా విషాదహేతు వయిందో ఇక్కడ తెలుస్తుంది. వ్యక్తి వస్తువైనప్పుడు ఒకవ్యక్తి అనుచితప్రవర్తన ఎంతటి విషాదానికి దారితీస్తుందో షేక్స్పియర్ విషాదాంతనాటకాలు చెప్తున్నాయి. కాబట్టి అనౌచిత్యం నుండి విషాదం పుట్టుందన్న ఎవరెట్ అభిప్రాయం సమంజసమైనది. కాని హాస్యానికైనా, విషాదానికైనా కేవలం అనౌచిత్యమే కారణం కాదు!

ఏవర్గానికి చెందినదైనా కవిత్వానికి పరమావధి అందం – ఆనందం అనుకునే వారెక్కువమంది ఉన్నారు. ఈ సౌందర్య దాహం మనిషిలోని అనైతిక ప్రవృత్తికి సంబంధించిన దంటాడు ఎడ్గార్ ఎలన్ పో. అనైతికత అనౌచిత్యానికి మూలం. ఔచిత్య నియమాల స్పష్టమైన ఒత్తిడులు అసాధారణమైన, మౌలికమైన ఊహలమీద గురిపెట్టబడి వుంటాయంటాడు సార్త్రే. 26 ఇక్కడే ఆదర్శానికి–వాస్తవానికీ ఘటీ పడుతుంది. 1940 లో పాతగోరీలకేసి మొహాలు తిప్పుకొని, పాతపదాలకి – ఊహలకీ చిత్రికలుపట్టే కవులను నిరసించిన వెంకటచెలం–అరుణాచలంగా "రవికిరణాంగుళీ నఖక్షతాలతో – శ్యామలాకాశం కందింది" అంటాడు తన సుధలో. తన నియమాలకు తనస్వేచ్ఛకు ఘటీపడ్డ ఇలాంటి సందర్భాలు ఆధునిక కవిత్వంలో చాలా కనిపిస్తాయి. సిద్ధిమంతులు స్వాధీన కుశలు లంటాడు కాళిదాసు. అందరూ నియమసిద్ధులు కాలేరు. మనోహరమైన వస్తువులాగే వికృతమైన వస్తువు సైతం సౌందర్యానుభూతికి ఉపయోగపడే సాధన మౌతుందంటుంది. ఏడమ్స్. 27 అనౌచిత్యంతో కూడిన వస్తువు అద్భుతత్వాన్ని కలిగిస్తూ, సపస్థితిలో తనతో కలిసివున్న ఇతర వస్తువులకంటె చూపరుల దృష్టిని నిలిపి వుంచుతుందని శాస్త్రజ్ఞులు తమ ప్రయోగాల ద్వారా నిరూపించేరు. 28 నేడు ఔచిత్యం అనేటప్పటి కల్లా రసోన్మాది రోణంకి అప్పలస్వామి కసురుకోవడానికి ఇదే కారణం. అనౌచిత్యం సైతం విషయానికొక గుర్తింపు నిస్తుంది. కొన్ని సందర్భాలలో అనౌచిత్యమే మనలో ఉత్సుకత్వాన్ని ప్రేరేపించే ప్రధానోపకరణంగా వుంటుంది. డాడాయిస్టుల సద్య స్ఫురణలు, అధివాస్తవికుల సర్వసామాన్యమైన అంశాలను వ్యత్యస్తం చేసే విధానాలు, దూరారూఢమైన శబ్దార్థాల మధ్య సమీపవర్తిత్వాన్ని నిర్వహించే పద్ధతులూ ఏ విధమైన ఆకర్షణనే కలిగివుంటాయి. అందులో అనౌచిత్యాన్ని సూచించే గాఢమైన తిరస్కారభావం కనిపిస్తుంది. ఆ భావాన్ని వెల్లడించడానికి వేర్వేరు స్థాయులలో అసుభావ్యతను వెల్లడించే భావాలను జత పరచి కసితీర్చుకోవడం కనిపిస్తుంది.

"ఫిడేలు రాగమ్ ఫిడేలు రాగమ్
ఫిడేలు రాగమ్ములు
వినూతన పదప్రేమికులు, మహాకాముకులు
అన్యోన్యమగు దమ్పతులు కూడ"

అంటూ పఠాభి అక్షరాల్ని, పదాల్ని, పదబంధాల్ని విరిచి 'నాయిష్టం వచ్చినట్లు చేస్తాను' అంటూ ధ్వంసరచన చేసేడు. "ఈ ఫస్టోబరు రోజు ఎవరా వస్త" అని ప్రశ్నించే శ్రీశ్రీ ఫస్టుని అక్టోబరుని ఏకంచేసే హ్రస్వలిపిని చూపించేడు. "క్రూడాయిల్లో తెక్నికలలు" కనడం కూడా ఇలాంటిదే.

"మట్టిముద్దలతో కట్టిన / కోటగోడల మగుళ్ళనించి
నగ్నదృశ్యాలు విలుగ్గొడ్లు అసిరమ్మల తొలిసమర్త
గుళ్ళోనే కావాలని / గుడి చేటిక సందేశం
నా మస్తిష్కం పైకితీసి చదువుకున్నాను"

అంటూ పురిపండా ఒకజ్వాలాకావ్యం వినిపించేడు. నారాయణబాబు "రోడ్డు అవలిస్తే ముగ్గురు ఆడపిల్లలు పుట్టారు" అంటూ అసంబద్ధంగా గతాన్ని ధిక్కరించాడు. ఈ విధ్వంసవాదుల, అధివాస్తవికుల అతీత రచనలపట్ల సంప్రదాయ విమర్శమూక బధిర అంధలక్షణాలను ప్రదర్శించవలసిన ధోరణిఏర్పడింది. ప్రపంచంలో అధివాస్తవిక వాదం తిరుగుముఖం పట్టాన్నపేళ మన కవులు ఆ తోవలో తప్ప టడుగులు వేసేరు. అభ్యుదయవాదం ఆ పథాన్ని శంకిస్తూన్నా 'అర్థ మనర్థమని అనుభవమే నగ్నంగా ఆలాపన చేస్తా' నన్నాడు నారాయణబాబు. 'పద్యం బొక్కటి చెప్పి సార్థముగ తాత్పర్యంబు భాషింపుమా' అనేవాళ్ళను "భావం మన హృదయంలో రగుల్కొ నేటప్పుడు దండాన్వయచింతన బుద్ధిమాలిన తనమని తెలియనవసరం లేదా?" అని ప్రశ్నించారు రోణంకి అప్పలస్వామి.[2] మీరందరి ప్రయత్నాలలో పూర్వుల దృష్టిలో అనుచితాలైన విధానాలే ఆకర్షణను సంతరించుకున్నాయి.

"వస్తుగతం కాని కవితకు భావం బలం
కేవలం భావంలో భ్రమ
అధిక వాస్తవిక విచారమ్ అవ్యక్తమ్
అగవ్య గోచరమ్"- అంటాడు వేగుంట మోహన్ప్రసాదు.

ఒక నిర్దిష్టమైన వస్తువుగాని, స్పష్టమైన అభివ్యక్తిగాని, కనిపించే గమ్యంగాని లేని ఈ విధానాన్ని కవులు ఎందుకనుసరించవలసి వచ్చింది? అంతవరకుగల కవితామార్గంమీద, అర్థంలేని లోకం మీద, వ్యవస్థమీద తమకున్న అక్కసు వెళ్ళగక్కడానికి. ఆ కారణంగానే వారి కవిత్వంలో అనౌచిత్యం ఆకర్షణను సంతరించుకుంది.

కవిత్వానికి రసప్రతీతి ముఖ్యమని పూర్వుల భావన. దానికి అవగాహనక్షమత్వం ప్రాథమిక లక్షణం. ఆ లక్షణాన్ని కోల్పో తూన్నకొద్దీ అది ప్రజలకు దూరం కావడం సహజం. అందుచేత అర్థంకానితనం అనుచితంగా పర్యవసిస్తుంది. వ్యాఖ్యానాలకు వ్యాఖ్యానాలు వ్రాయవలసి వచ్చిన సందర్భాలపట్ల ఆధునికులకు వైముఖ్యం ఏర్పడినమాట ఎవరూ కాదనరు. . అయినా ఆధునికకవి నవీనపంథా అనుసరించి

"బ్రెయిన్‌లో బ్రెన్‌గన్ / రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్ స్పయినల్ కార్డులో స్ప్రెయిన్"- అంటూ త్వమేవాఽహాన్ని దేశం మీదకు వదిలితే, అయోమయంగా చూసిన ప్రజనుద్దేశించి "మన పాఠకుల సోమరితనాన్ని, తుప్పుపట్టిన మెదళ్ళని సీపురాసిన వ్యాసాల్లాంటి ద్రావకాలతో క్షాళనం చెయ్యాలి. అప్పుడుగాని కిలం పోదు" అని కోపగించుకుంటాడు ఆరుద్ర.[30] అలాగని ఊరుకోక త్వమేవాఽహన్నిటీకా టిప్పణి తాత్పర్య వ్యాఖ్యాన సహితంగా తిరిగి ముద్రిస్తాడు. అయినా ఆ కిలం వదలలేదు. 'అస్పష్టత', 'నైరూప్యం' లేనిదే కవిత్వంలేదని ఆధునిక పాశ్చాత్య విమర్శకులలో కొందరు భావిస్తారు. అందుకే "మన కింతవరకు రాని అసంబద్ధ, వ్యతిరేక, అస్తిత్వపు, టస్తవ్యస్త కవిత్వం కావాలి" అని వేగుంట మోహనప్రసాద్ ఆశయం.[31] ఈ రకమైన ఆశయాలను అధ్యయనం చేసిన సంజీవదేవ్ "ఆధునిక కవిత ప్రపంచం అంతటిలో ఒక అసంబద్ధ సందిగ్ధావస్థలోపడివుంది. దాని నిర్వచనం ఇదమిత్థమనే రూపంలోలేదు" అని చెప్పారు.[32] కోరి వరించిన ఈ మార్గంలో సైతం అనుచితత్వమే ఆకర్షణగా మిగుల్తుంది. ఐతే కిలం వదలని పాఠకులు మాత్రం ఈ పిచ్చివాళ్ళ స్వర్గానికి అనంతదూరంలో ఎవరిపనుల్లో వాళ్ళు మునిగివుంటారు. మరీ పల కరిస్తే ఒకసారి విస్మయంతో చూస్తారు. తమ అజ్ఞానాన్ని నిందించుకుంటారు. లండన్‌లో కూడా నన్నయభారతాన్ని మయసభ అనీ, రామరాజ భూషణుడి వసుచరిత్రను స్వయం ప్రభగుహ అని తిరస్కారదృష్టితో ఉపన్యాసాలిచ్చే పురిపండా, శ్రీశ్రీలు మన కాలంలో మనచుట్టూ కమ్ముకుంటూన్న ఈ దళసరి మేలి ముసుగులో ముఖం దాచుకునే కవిత్వాన్ని కళ్ళకద్దుకుంటారనుకుంటాను. కాదంటే ఆరుద్ర బళ్ళో ఓరవళ్ళు దిద్దిన వారందరూ కలం ముడుపు సమ్మెకు దిగవలసి వస్తుంది. ఫ్రాయిడ్ ఫకుక్కున నవ్వుతాడు. క్రిస్టఫర్ కాడ్వెల్ కసురుకుంటాడు.

అనౌచిత్యం కవితావస్తువైన సందర్భాలు మరికొన్ని ఉన్నాయి. వ్యక్తిగాని వ్యవస్థగాని లోకసామాన్యమైన విధికి వ్యతిరేకంగా, అనైతికంగా ప్రవర్తించడం అనుచిత మవుతుంది.

"రాజు తలచిందేను ధర్మం / రాజు చెప్పిందెల్ల శాస్త్రం
రాజులకు పేరైన పద్ధతి / కాద, గాంధర్వం"

అంటాడు కన్యకలో రాజు. రాజుకు తిరుగులేని అధికారాలుండడం వాస్తవమే. కాని ఆ అధికారాలను ధర్మాన్ని స్థాపించడానికిమాత్రమే ఉపయోగించాలి. తన క్షణికోద్రేకాలను తీర్చుకొనే సాధనంగా అధికారాన్ని వినియోగించుకోవాలని చూడడం నీతికి విరుద్ధం. ఆ వైరుధ్యం ఏర్పడడం వలన ఇక్కడ అనౌచిత్యం కాలూనింది. దానికి ఫలితంగా కన్యక అగ్నిప్రవేశం చేసింది. రాజు కోటపేటలు నక్కల కాటపట్లయ్యాయి. అంటే అనౌచిత్యం నుండి ఇక్కడ విషాదం జనించింది. అస్వాభావికమైన వస్తువు సైతం అనుచితంగా పర్యవసిస్తుంది.

"శశీ! చయినా బజారు గగనానికీ నీకూ
ఏ మాత్రం సరిపోదు"- అంటాడు పఠాభి. ఆధునిక నాగరికతకు నిలయమై వుండడం చైనాబజారు స్వభావం. అక్కడ కృతక విద్యుద్దీపాలు కాంతులు జిమ్ముతూ వుంటాయి. అక్కడ ప్రజలంతా తమ ఆడంబరాల్లోనూ, అవస్థల్లోనూ మునిగివుంటారు. ప్రకృతి సౌందర్యం వారికి పట్టదు. చిన్నతనం నుంచి కనిపించే చంద్రుడిలో వారికేమీ కొత్తకనబడదు. చంద్రుని చల్లని వెలుగులు అక్కడ వెల వెల బోతాయి. అందుకే ఆ దాంపత్యం అస్వాభావికమయింది. ఇలాగే అవ్యావహారిక ధోరణిసైతం అనుచితమౌతుంది. తనకు ఊహలున్నాయి కదా అని ఒక కవి ఇతిహాసాలనాటి ఆలోచనలనో, తంజావూరు రసికతనో నేటి సమాజంలో కలగలుపుగా ఒక కల్పనచేస్తే అది వ్యవహార విరుద్ధమౌతుంది. అప్పుడు కుందుర్తి

"శతాబ్దం ముందు పుట్టావు గదా!
ఎవరాదరిస్తారు పద పదా!" అని ఆ కవిని పక్కకు నెట్టేస్తాడు. ఇక్కడ వ్యవహారం తెలియని కవిచర్య అనుచితమౌతుంది. పై అన్నిటికీమించి అనౌచిత్యజ్ఞానాన్ని ప్రేరేపించేది అసమగ్రత. సమగ్రత ఔచిత్యలక్షణం. ఒక కావ్యంలో అవసరమైన లక్షణాలలో ఏది కొరవడినా ఆ లోటు కనిపిస్తుంది. ఒకవ్యక్తి ప్రవర్తనలో, రూపంలో ఏ కొరత కనబడినా అది వైరస్యహేతువౌతుంది. ఈ లోకంలో అనేక లోపాలున్నాయి. అందుకే మానవతకు సమగ్రత సిద్ధించడం లేదు. ఆ లోపం ఎందరికో స్ఫూర్తి నిచ్చింది. సమగ్రతా సాధనకు అన్వేషణ చేయించింది.

"కాదు, కాదు, లక్ష్యం ఇది కాదు అసలు
ఏదో సర్వసంపూర్ణత, స్థిర సమగ్ర సమీచీనత
బహూ వివరాల అంగాంగాలు
అణువుల్లోంచి మూలకందపు టాత్మలోకి
క్షుద్రరేణుకణంనుంచి, మహా మేరునగం వరకు
సంక్షుబ్ధ సాగరాల ఘోషనించి మూగ జీవాల భాషవరకు
అన్నిటినీ ఒక లయ, ఒక తాళం, ఒక రాగంలో మేళవించి
నాలో లోకంకొరకై లోకంలో నాకొరకై
ఏకైక మహోద్రేకం ఉరికించాలని - కోరిక"

అంటాడు బైరాగి. ఆ ఐక్యమే ఔచిత్య లక్షణం. అది సిద్ధించే ఆ అనుచితత్వం తొలగిపోయేవరకు మానవుడికి ఆరాటం తప్పదు.

అనౌచిత్యమనే చోటగల నఞర్థకం వలన ఔచిత్యంయొక్క అభావం అనౌచిత్యమా? విపరీత భావ మనౌచిత్యమా? అనే సందేహంతోపాటు ఆ రెండూ గ్రహింపదగ్గవేనన్న అభిప్రాయాన్ని డా. నగేంద్ర వెలిబుచ్చేరు. చమత్కారంలేనిది కవిత్వంకాదని, ఔచిత్యం చమత్కారాన్ని కలిగిస్తుందని క్షేమేంద్రుని అభిప్రాయం. అందుచేత ఔచిత్యం లేనిదికూడా అనుచితమైనదే అనదగివుంది. నిరౌచిత్యమాత్రకము- అనౌచిత్యరజోస్పృష్టము - అనుచితప్రవృత్తి పరమానౌచిత్యము- విగర్హితము అని అనౌచిత్యంలోని స్థాయీ భేదాలను రామపాల విద్యాలంకార వివరించేరు.

పైని యాకులు క్రిందకు పైకి క్రింది
యాకు లీరీతి నిముసమ్ము నాగకుండ
కదలుచున్నది కాలచక్రమ్ము దాని
నాపగల వాడెవండు లేడవనియందు.

ఈ పద్యంలో అనౌచిత్య మేమీలేదు. అలాగని ఏమాత్రమైనా చమత్కారమూలేదు. ఈ చక్రాకారపంక్తియొక్క గమనం కొత్తది కాదు. దాదాపుగా మనకు కవిత్వం అందిన మొదటిరోజుల్లోది. ఆ కారణంగా ఇది నిరౌచిత్యమాత్రకమౌతుంది. ఇస్మాయిల్ 'రికార్డు' వినండి.

కవిత్వంలాగే / మరోమారు చదివితే
మొదటిలా వుండదు / కన్యాత్వం పోతుంది.

ఇక్కడి సామ్యం సరైనదికాదు. ఒకసారి చదివితే రెండోసారి అక్షరణను కోల్పోవడానికి కవిత్వం దినపత్రిక కాదు. కవిత్వం ఆలోచనామృత మన్నారు. చదివినకొద్దీ చవురూరించేదే నిజమైన కవిత్వం. కన్యాత్వాన్ని చదివినా అంతే అనుకుంటాను. పటుత్వం ఉండాలేకాని ప్రౌఢవయః పరిపాకం వరకు చదవొచ్చు. అందుచేత ఈ సందర్భాలలో మొదటిసారికంటె పోగొట్టుకొనేదేమీలేదు. ఈ విధమైన సామ్యంవలన 'రికార్డు' అనౌచిత్య రజోస్పష్టమయిందనవచ్చును. మహాప్రస్థానం నుండి మరో ప్రస్థానానికి, పురజనులనుండి గిరిజనుల దగ్గరకు సాగిపోయిన శ్రీశ్రీ 'ఓ మహాత్మా! ఓ మహర్షీ!' అనే రచనలో ఈ క్రింది చరణాలు చూడదగ్గవి.

"ఎక్కడయ్యా నీ అహింస / ఏడ నీ కరుణారిరంస
చూడు దేశం ద్వేషభుగ్నం / ఖురత్ జిహ్వానల విభుగ్నం."

రెండో చరణంలోని 'ఏడ'కు, నాల్గోచరణంలోని సమాసానికి ఎంతదూరమో సామాన్య ప్రజలకు ఈ కవిత్వానికి అంత దూరం. అంటే వారినుండి కవిగా శ్రీశ్రీకి కూడా అంతేదూరం. పండితుడైన వాడు కవికావచ్చునుగాని ప్రజాకవి కాలేడు. అటు చూసినా, ఇటుచూసినా ఇక్కడ అనుచిత ప్రవృత్తి సాక్షాత్కరిస్తుంది. ఆదర్శం ఉన్నతమైనదైనా, వస్తువు రసవంతమైనా, కవితోద్దేశాలు కమనీయమైనవైనా ఆకృతి వక్రంగా వుంటే ఆ రచన పసందుగా వుండదు. విశ్వంగారి హృదయాన్ని చూడండి.

"నిండు మనిషి గుండెల్లో / వుండు మానిందాకా
పండు మనిషి వెన్నెముక / దిండు రానుకునే దాకా
కండువా వేసుకున్నవారికే / అస్తరణలూ
ముండువా ఉన్నవారికే పడతమంచాలూ."

ప్రాసంకోసం ఈవిధంగా ప్రాకులాడే ఆధునికులను కొంతమందిని చూసి పాతకవులు పరలోకంలో సైతం సిగ్గుపడతారనుకుంటాను. ఈ మామ్మూలు మాటలమధ్య 'అస్తరణ' ఇముడలేక ఇబ్బందిపడుతూంది. ఈ చరణాలన్నీ 'నిండు' అనే ప్రారంభం నుండి తన్నుకుని వచ్చినట్లు కనిపిస్తుంది. ఇదే పరమానౌచిత్య మంటే. రసపోషణ అనే సంరంభంలో ఇంపుసొంపులను మరచి ప్రవర్తించే సన్నివేశాలు కవిత్వంలో అక్కడక్కడ ప్రమాదవశంగానైనా కనిపిస్తాయి. "స్వప్నాల దుప్పటి"లో ఉత్పలవారి హాస్యరసపోషణ ఎలా సాగిందో చూడండి.

"ఆమె ముక్కెప్పుడును చీదినట్లు లేదు
హస్తమున సూది మొదెక్కినట్లులేదు"-

మామ్మూలు మాటలధోరణి వేరు. కవిత్వంయొక్క ఉదాత్తత వేరు. ఒక అమ్మాయి పరమ సుకుమారంగా వుందని హాస్యధోరణిలో చెప్పడం ఇక్కడ కవి అభిప్రాయం. అంత మాత్రాన పాఠకుడిమీద చీదేస్తే అది విగర్హిత మౌతుంది.

ధనపక్షం నుండి గాని, ఋణపక్షం నుంచి గాని కవిత్వానికి ఔచిత్యాన్ని కూర్చడం కవికి పరమావధి. అందుకు అనౌచిత్య తత్వాన్ని ఆకళించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

## అధస్సూచికలు

1. చలం, యోగ్యతా పత్రం – 'మహాప్రస్థానం'
2. ఉద్భటుడు, కావ్యాలంకార సారసంగ్రహము, శ్లో 4-5
3. "గ్రామ్యత్వ మనౌచిత్యం వ్యవహారాకారవేష వచనానామ్। దేశ కుల జాతి విద్యావిత్త వయఃస్థాన పాత్రేషు॥" (రుద్రటుడు, కావ్యాలంకారము, శ్లో. పు 142)
4. "ఏతస్యచ/అనౌచిత్యస్య/వివక్షిత రసాది ప్రతీత విఘ్న విధాయిత్వం నామ సామాన్య లక్షణమ్." (మహిమభట్టు, వ్యక్తివివేకః, పు 182, చౌఖమ్బా ప్రకాశనము)
5. "అనౌచిత్యం చాత్ర రసానాం భరతాది ప్రణీత లక్షణానాం సామగ్రీ రహితత్వేత్వేకదేశ యోగిత్వోపలక్షణ పరం బోధ్యమ్" (విశ్వనాథుడు – సాహిత్య దర్పణము)
6. "తచ్చ దేశకాల వర్ణాశ్రమవయోఽవస్థా ప్రకృతి వ్యవహారాదేః ప్రపంచ జాతిస్య తస్య తస్య, యల్లోకసిద్ధముచిత ద్రవ్యగుణ క్రియాది, తద్ భేదః" (జగన్నాథుడు, రసగంగాధర – ప్రథమాననమ్.)
7. "విభావాదా వనౌచిత్యం పునర్లోకానాం వ్యవహారతో విజ్ఞేయమ్" (జగన్నాథుడు, రసగంగాధర – ప్రథమాననమ్.)
8. "When we are confronted with a simultaneous combination of elements that are unlikely to occur together, we have incongruity" D. E. Berlyne, Aestnetics and Psychobiology, University of Toronto, Appletn - Cerelniry - Crofles, Educations division. Meridite Corporation, Newyork, P 145
9. Jean Paul Sartre, What is Literature, P 8.
10. "When we attain freedom without incongruity we have a much greater and much purer delight...unexpected justness makes unit, as sudden incongruity makes pleasant foolishness" George Santayana, Essays in Literary Criticism Ed. by Irving Singer, Charles Scribuer Sons, New York, P 385
11. "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్। ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా॥" (ఆనందవర్ధనుడు, ధ్వన్యాలోకము.)

12. "న హ్యనుచితత్వే నాత్మహానిః అపితు సదోషత్వా దాభాస వ్యవహారః అశ్వాభాసాది వ్యవహారవత్"
(జగన్నాథుడు, రసగంగాధరము.)

13. అనౌచిత్య ప్రవృత్తానాం కామక్రోధాది కారణాత్ ।
భావానాంచ రసానాంచ బంధ ఊర్జస్వి కథ్యతే ॥"
(ఉద్భటుడు, కావ్యాలంకార సారసంగ్రహము, 4-5)

14. "తత్ర హి రాగద్వేష మోహ కారణకా అనౌచిత్యేన రసభావా ఉపనిబధ్యంతే. అత ఏవ తత్ర స్వకల్పనా పరికల్పితత్వేన ఊర్జసోబలస్య విద్యమానత్వా దూర్జస్వి వ్యపదేశః" (ప్రతీహారేందురాజు.)

15. "రస భావ తదాభాసవృత్తేః ప్రశమబన్ధనమ్ ।
అన్యానుభావ నిఃశూన్యరూపం యత్తత్సమాహితమ్ ॥"
(ఉద్భటుడు, కావ్యాలంకార సారసంగ్రహము, 4-7)

16. "రస భావ తదాభాస తత్ప్రశాన్త్యాది రక్రమః ।
ధ్వనే రాత్మాఙ్గి భావేన భాసమానో వ్యవస్థితః"
(ఆనందవర్ధనుడు, ధ్వన్యాలోకము 2-3)

"ఔచిత్యేన ప్రవృత్తౌ చిత్తవృత్తే రాస్వాద్యత్వే స్థాయిన్యా రసో, వ్యభిచారిణ్యాభావః, అనౌచిత్యేన తదాభాసః"
(అభినవగుప్తుడు.)

17. "అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వమ్"
(జగన్నాథుడు, రసగంగాధరము.)

18. డా. నగేంద్ర, రససిద్ధాంత్ 'రసాభాస్'

19. "రస భావౌ తదాభాసౌ భావస్య ప్రశమోదయౌ ।
సంధిః శబలతా చేతి సర్వేఽపి రసనా ద్రసః"
(ఆనందవర్ధనుడు, ధ్వన్యాలోకము.)

20. "అదేశ యుక్తో వేషోహి నశోభాం జనయిష్యతి ।
మేఖలోరసి బంధే చ హాస్యం సముపపాదయేత్ ॥"
(భరతుడు, నాట్యశాస్త్రము, 21-53)

21. "కంఠే మేఖలయా నితమ్బఫలకే తారేణ హారేణ వా
పాణౌనూపురబంధనేన చరణే కేయూరపాశేన వా ।
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నాయాన్తికే హాస్యతామ్
ఔచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతి ర్నోగుణః"
(క్షేమేంద్రుడు, ఔచిత్యవిచారచర్చ, 3 శ్లో.)

22. Horace, The Art of Poetry, 1-5

23. H. B. Alexander, 'A History of Literary Aesthetics in America' Ed. by Max. I. Bayu, Frederick ungar Publishing Co., New York. 1973 P. 147

24. George Santayana, Essays in Literary Criticism P. 384

25. Charles Caroll Everet. "Poetry, Comedy and Duty" Quoted in "A History of Literary Aeasthetics in America", P. 142

26. Jean Paul Sartre, What is Literature.

27. "Like the greatesque, the ugly becomes a contributary factor in a total aesthetic experience" Elizabeth Kemper Adams "A History of Literary Aeasthetics in America". P. 148

28. D. E. Berlyne, Aeasthetics and Psychology, P. 197

29. 'చితి - చింత' - వేగుంట మోహన ప్రసాద్, పీఠిక

30. ఆరుద్ర దాశరథికి రాసిన లేఖ, త్వమేవాఽహమ్.

31. ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 1979 మే 20.

32. 'చితి - చింత', వేగుంట మోహన ప్రసాద్, పీఠిక.






శ్రీమతి ఇందిరా గాంధి
ప్రధానమంత్రి

"శ్రమ యేవ జయతే"



శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

# నిజాయితీ, కఠోర పరిశ్రమ, స్థిర సంకల్పం ద్వారా అధికోత్పత్తి సాధన - రిపబ్లిక్ దినోత్సవాన మన విజ్ఞప్తి

జాతికి శంఖారావం వినిపించింది. క్రమశిక్షణకు, కఠోర పరిశ్రమకు పునరంకితమయ్యే తరుణం వచ్చింది. న్యాయసమ్మతమైన సమసమాజాన్ని ఏర్పాటు చేసేందుకు ఏకైక మార్గాన్ని సూచిస్తూ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మనల్ని చైతన్యవంతుల్ని చేసే సందేశం ఇచ్చారు.

కఠోర పరిశ్రమ, సత్యాన్వేషణకు దీక్షతో పాటుపడడం ద్వారానే గౌరవం, ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం అన్నదే ఆమె సందేశం. ఉత్పత్తి పెరుగుదల, సంక్షేమ పథకాల విస్తరణ ద్వారా బలహీన వర్గాల సమగ్రాభివృద్ధి సాధించగలమనే విషయాన్ని ప్రధాని నూతన కార్యక్రమం స్పష్టీకరిస్తున్నది.

మన రాష్ట్రంలో ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతులు, మహిళలు, బాలలు వంటి బలహీన వర్గాల ప్రజలకు మన అభివృద్ధి ఫలితాలు అందజేసేవిధంగా వివిధ పథకాలు ముమ్మరంగా అమలు జరుగుతున్నాయి.

- సాంఘిక సంక్షేమ పథకాలను బడ్జెట్ కేటాయింపు 1977-78 నుంచి నేటివరకు రు. 21.57 కోట్ల నుంచి రు. 78.12 కోట్లకు (నాలుగురెట్లు) పెరిగింది.
- 14 లక్షల కుటుంబాలకు ఇళ్ళస్థలాలు సమకూర్చారు. ప్రస్తుత సంవత్సరంలో మరో 1.05 లక్షల కుటుంబాలకు ఇళ్ళస్థలాలు సమకూరుస్తారు.
- షెడ్యూలు కులాలవారి కోసం ఒక ప్రత్యేక అనుబంధ ప్రణాళిక అమలు జరుగుతున్నది. ఈ అనుబంధ ప్రణాళిక క్రింద ఖర్చుచేసేందుకు 1980-81లో రు. 42.80 కోట్లు, 1981-82లో రు. 50 కోట్లు కేటాయించారు. 1982-83 సంవత్సరంలో రు. 89.37 కోట్లు కేటాయించాలని తలపెట్టారు.
- షెడ్యూలు కులాల ఆర్థిక సహాయ సంస్థ ప్రస్తుత సంవత్సరంలో 1.19 లక్షల మంది దారిద్ర్యరేఖను దాటేందుకు వీలుగా వివిధ పథకాలు చేపట్టింది.

- మెట్రిక్ అనంతర చదువులకోసం స్కాలర్‌షిప్పులు పొందే షెడ్యూలు కులాల విద్యార్థుల సంఖ్య 1977-78లో వున్న 27.538 నుండి 1980-81లో 54, 000కు పెరిగింది.
- ఎక్కువమంది విద్యార్థులు స్కాలర్‌షిప్పులు పొందేందుకు వీలుగా వారి తల్లిదండ్రుల ఆదాయ పరిమితిని రు. 6,000 నుండి రు. 12,000లకు పెంచారు, వసతి గృహాలలో విద్యార్థుల భోజన ఖర్చులకిచ్చే మొత్తాన్ని నెలకు రు. 85లకు పెంచారు.
- సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో ఇతర ముఖ్యాంశాలు :- కులాంతర వివాహాలను ప్రోత్సహించడం, పేదలకు ఉచిత న్యాయసహాయం, హరిజనులపై జరిగే అత్యాచారాలు విచారించేందుకు సంచార న్యాయస్థానాలు ఏర్పాటు చేయడం వంటివి.
- విద్యుదుత్పాదన స్థాపిత ఉత్పాదకశక్తి 2,300 మెగావాట్లకు పెరిగింది.
- ఆంధ్రప్రదేశ్‌లోనెలకొన్న పారిశ్రామిక శాంతి, అనుకూల వాతావరణం, నీరు, విద్యుచ్ఛక్తి సరఫరా ప్రభుత్వము ఇస్తున్న ఉదార ప్రోత్సాహం నూతన పారిశ్రామికవేత్తలను ఆకర్షిస్తున్నాయి.
- రు. 6,000 కోట్ల పెట్టుబడి వినియోగించి పరిశ్రమలు ఏర్పాటుచేస్తున్నారు,
- బలహీన వర్గాలకోసం చేపట్టిన 2,20,000 గృహాల నిర్మాణం వివిధ స్థాయిలో ఉన్నది. గుడిసెల నిర్మాణానికి సహాయం రు. 400 నుండి రు. 1000కి పెంచారు.
- పోలవరం బ్యారేజి, శ్రీశైలం కుడికాల్వ, జూరాలప్రాజెక్టు నిర్మాణం చేపట్టారు, నాగార్జునసాగర్ కాల్వల ఆధునికీకరణ ముమ్మరంగా కొనసాగుతున్నది.
- గ్రామాల్లో మంచినీటి సరఫరా పథకాల అమలుకు అధిక ప్రాధాన్యం ఇస్తున్నారు.
- యువజనులు, స్థానిక సంస్థల సహకారంతో సామాజిక అటవీ పథకాన్ని ముమ్మరంగా అమలు చేస్తున్నారు. పరిశ్రమల కోసం నష్టపరిచిన వాటి స్థానంలో తిరిగి చెట్లు నాటేందుకు పారిశ్రామిక అటవీనిధిని ఏర్పాటుచేసారు.
- కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు దీక్షతో అమలు జరుపుతున్నారు. 1981 ఏప్రిల్ నుండి డిసెంబరు వరకు, 183075 కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు జరగాలని లక్ష్యంకాగా 1,83,527 ఆపరేషన్లుచేశారు.
- 1982-83లో వార్షిక ప్రణాళిక పెట్టుబడి రు. 600 కోట్ల రికార్డుస్థాయి చేరుకుంది.
- 1980-81లో దుర్భిక్షం, వరదలు వంటి అవాంతరాలను అధిగమించి 100 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండించారు.

ఆంధ్రప్రదేశ్ హరిజనులు, ఇతర బలహీనవర్గాల పరిస్థితి ఇదివరటికంటే చాలా మెరుగుగా ఉంది. వారుకి ఉజ్జ్వల భవిష్యత్తు ఉన్నది.

మనం 1982 సంవత్సరాన్ని ఉత్పాదక సంవత్సరంగా ప్రకటించుకున్నాం. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ చురుకుగా పురోగమిస్తున్నది. శ్రీమతి ఇందిరాగాంధీ చూసిన బాటలో మన రాష్ట్రం ముందుకు సాగుతూ, శ్రీ టి. అంజయ్యగారి నాయకత్వంలో ప్రజలు, ముఖ్యంగా బలహీన వర్గాల వారి సంక్షేమం కొసం నూతన 20 అంశాలతో సహా మరిన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయబోతున్నది.

Advt. No. 1

**డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం**

**DIPR No. 1/Advt. I/C3/81**

# ద్వేషగీతం

## శ్రీ రమణారెడ్డి

పర గడుపు దిగని పాచి నోళ్లతో,
జిడ్డు వదలని మాడు మొగాలతో,
అర కడుపు అగ్గి గుండాల్లో పడి
మాడే నులి పేగుల నాగాలతో,
మురికి జేరిన మొరటు వేళ్ల మొటిక గోళ్ళతో,
గార పళ్ళతో,
అనేకంగా అసంఖ్యాకంగా పేర్చుకున్న చింపిరి తలల్తో,
దిస మొలల్తో,
ఆస్తిపరులు అదిరదిరి పడేలా
అధికారం వెర్రెలిచ్చేలా –
వెండి మిన్నుల్లోకి వేనవేల నల్లజడల తుఫాను మబ్బులా
ఎండిన యిసక మీదికి ఎన్నెన్నో పాయలతోటి
ఎర్రటి వరద వుబ్బులా
చిగురైనా అల్లల్లాడని వుమ్మదం పైకి దండెత్తే
పడమటి గాడుపులా
జీవసమాధి పాలైన నిజజీవితం నిష్ఠురజీవనంలోంచి
అక్షయ జవసత్వాలతో
కక్షను ముందెట్టుకు — వస్తూంది
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
వచ్చి పడక తప్పదు — ద్వేషం!

కుళ్ళుబోత్తనం కాదు చూళ్ళేనితనమూ కాదు
అసూయాగ్రస్తం కాదు
కుత్సిత బుద్ధో కుట్ర పద్ధతో 'కుంభకోణమో' కానేకాదు
పట్టపగటి పూట, నట్టనడిజామున,
నిబ్బరంగా నిర్భయంగా
నీళ్లు నుంచక నిర్ణయంగా
కాళ్లు వంచక వుద్యమంగా
కురిసే మిన్నున మెరిసే నిడుపాటి పటాకత్తి చూపుల్తో
మరుపురాని అగణ్య అన్యాయాల జ్ఞాపకాల పేర్పుల్తో
పచ్చిపుండైన గుండెనిండా గాఢక్రోధం కుక్కుకుని
పగను వెంటబెట్టుకుని ముఖం చెండుకుని–
ఒళ్ళే ఆయుధాగారంగా
ఊర్పే ఆగ్నేయాస్త్రంగా
నడిచే జడల మర్రిలా
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో – అదో
వచ్చిపడితీరుతూంది – ద్వేషం!

వీరభద్రుడై దక్షాధ్వర విధ్వంసం సల్పడమేకాదు
గరుత్మంతుడై కాద్రవేయుల్ని పొడిచి గుచ్చి భక్షించడమే కాదు
గణాచారిలా శివమెత్తి వున్మత్తనృత్యం చెయ్యడమూకాదు–
బొట్టు బొట్టుగా రాలే విలువైన చెమటలో నుంచి
మట్టి పాలౌతున్న కాయకష్టం శక్తి నష్టంలోంచి
బూడిదలో పోసిన కావిరికళ్ళ కన్నీళ్ళనుంచి
వాడి వత్తలైన ప్రాయమూ పరువమూ నుంచి
పుసీ చీమిడీ కలగలిసిన తీరని గోడునుంచి
తమ శ్రమే తమకు శత్రువైన బతుకు బీడునుంచి
దయామయమైన దగానుంచి నగిషీ దోపిడీనుంచి
కొలిమి తిత్తులైన పూపిరితిత్తులనుంచి
ఎండిన యెదుర్రొమ్మునుంచి
పనిముట్లైన చేతి రెట్టలనుంచి
బతుకుదెరువైన బండచాకిరినుంచి–
కల దెలుసుకుని లేచినట్టుగా
కూడబలుక్కుని ఏకకట్టుగా
నీటితో కాలుస్తూ
గాలితో వేలుస్తూ
చూపుతో కాటేస్తూ
స్పర్శతో మసిచేస్తూ
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో – వచ్చేస్తూంది ద్వేషం!

పాములా పసిరిక కళ్ళతో కాదు, పులిలా మంటుక కళ్ళతో కాదు,
గూబలా తొలిచే కళ్ళతో కాదు, గెద్దలా గుచ్చే కళ్ళతో కాదు,
రెమ్మలు తుంచీ కొమ్మలు చెలిగి లాభం లేదని
ముష్టి చెట్టుని మొదలంటా నరికి సమూలంగా పెరిగి
తక్షకుడితో బాటు ఇంద్రుడికి సైతం హోమాగ్నిలో
'స్వాహా' పలికి
వెడలని నిట్టూర్పుల పెరిగే పెనుబరువుతో
విడవని కన్నీళ్ళ నుడిసే వురవడి పరువుతో
కాలాన్ని కడిగేస్తూ
చరిత్ర వంకర దీరుస్తూ
నేలను చదునుజేస్తూ
నూకుమ్మడిగా
రామందాడిగా
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
రానే వచ్చిందదో ద్వేషం !

పోటెత్తిన కారునలుపు కడలి తరగమీది నురుగుతెట్టెలా
పొరలీ కెరలీ కోసుకునీ దూసుకునీ వడిగా చిత్తడిగా
ధైర్యాన్ని ముందుంచుకుని, నిశ్చయాన్ని పక్కనుంచుకుని
అనేక శ్రేణుల ఏకైక పర్వతంలా నిక్కుతూ
తొక్కుతూ
పరిణామ మహాశక్తిగా విక్రమించి విప్లవించి
సాధ్యా సాధ్యాలనూ బలాబలాలనూ సమీక్షించి
మతి మంతునిలా వ్యూహం రచించి
యుక్తిశాలిలా యెత్తు గడల నూహించి

ప్రతిముందడుగూ ప్రజారాశి పైఅడుగుగా
నిరూపించి
సుడిగుండంగా
యమగండంగా
సుశిక్షిత విజిగీషులై
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
ఇదో వచ్చిపడుతూంది ద్వేషం !

మబ్బుకింద కురిసే మరో మబ్బుగా నిండిన వర్షా
కాశంలా
తరగవెంట ఎగిసే మరో తరగగా పడగెత్తిన ప్రళయార్ణ
వంలా
పోరు పిమ్మట తీవ్రించే మరో పోరు సాగుతూన్న నిరంతర
రణరంగంలా
విషలిప్తంగాని ఆయుధాలను ప్రయోగిస్తూ
విపరీతంగాని స్థిమితబుద్ధితో యోజిస్తూ
దయకు యోగ్యత కోల్పోయిన దురవస్థపై పగబట్టి
దోచుకు బతికే దుర్నీతి కంఠానికి వుక్కు వురి చుట్టి
ధర్మంతానై న్యాయం తానై
మానవ మహనీయత మేనై
తెలివితో తేకువతో
చురుగ్గా కరుగ్గా
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
అరె ! విచ్చేసిందిదే ద్వేషం !

# అనుకరణ

## ప్రియదర్శి

స్వరముతో తేనియల్
ఒలికింప యత్నింప
పుంస్కోకిల కూజితము
ననుసరించితినేమో
ననిపించును -
నడకతో నాట్య
మొనరింప యత్నింప

రాయంచను నా ఎద
పంచన నిలిపితి
నేమో ననిపించును -
నా సొంత గొంతుతో
ఎపుడు పాడెదనో కదా !
నాదైన రీతితో
ఎపుడు నడచెదనో కదా !

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

# ఆవేశఫలితం

ఈ మధ్యన వర్షాలు బడి చెట్లూ చేమలూ చిగిర్చినయి. వరిచేలు పచ్చగా ఏపుగా ఎదుగుతూ గాలికి రెపరెపలాడుతున్నయి. ఆ పొలాల మధ్యగా ఎర్రగా వంకర్లు తిరుగుతూ పోతూ వుంది డొంక దారి. మామిడి తోపులూ, వెలగ చెట్ల గుంపులూ, అక్కడక్కడా, డొంకను మింగి వేయాలని చూస్తూ వుండగా నిస్సహాయంగా నిల బడినట్లున్నాయి, డొంక పొడుగూతా కాలవ ప్రక్కన పచ్చగా నిల బడిన నిద్రగన్నేరు చెట్లు. ఆ నిద్ర గన్నేరు మొక్కలని వన మహోత్సవం సందర్భంగా నాలుగేళ్ళ క్రిందట పెట్టారు. వాటికి కొంత ఖర్చయింది. ఆ వ్యవహారం మీద సమితి ఆఫీసుకి వెళ్ళాడు పంచాయితి ప్రసిడెంటు పున్నయ్య. కాని పున్నయ్యకీ సమితి ప్రసిడెంటు పెద పెంటయ్యకీ ఈ మధ్యన చెడింది. అందు వలన, ఆ మొత్తాన్ని పంచాయితీకి ఇచ్చేదిలేదు పొమ్మన్నాడు పెంటయ్య, నిర్మొహమాటంగానె.

'ఎందుకులేదు ? ఇదివరకు ఇస్తానన్నారుగా ?' అడిగాడు పున్నయ్య.

'నాకు ఇదివరకు సంగతి తెలీదు. నేను ఇప్పుడు ఇచ్చేది లేదు' అని పెంటయ్య అనగా. మాటా మాటా పెరిగింది. ఘర్షణ అయింది. గట్టిగా తిట్టుకున్నారు పరస్పరం.

'సర్లె. నువ్వు ఆ వూరి ప్రెసిడెంటుగా ఎన్నాళ్ళు సాగుతావో నేజూడనా ?' అని పెంటయ్య అనగా 'నువ్వు ఈ సమితి ప్రెసిడెం టుగా ఎన్నాళ్లు సాగుతావో నేనూ జూస్తానుగా.' అని వచ్చాడు పున్నయ్య ఆవేశంగా వూగిపోతూ.

ఆమాట అయితే అన్నాడుగాని పున్నయ్య గుండెల్లో రైళ్లు పరుగెడుతూనే వున్నాయి, అప్పట్నుంచీ. పున్నయ్యకి వూళ్లో అపోజిషను బయలుదేరింది. కరణం కామయ్య నాయకత్వాన కొందరు బయలుదేరారు. వాళ్లు పెంటయ్య దగ్గరకి వెళ్ళి గుస గుస లాడి వస్తున్నారని పున్నయ్యకి తెలిసింది ఈమధ్యన.

పున్నయ్యకి వూళ్లో నలుగురయిదుగురు నమ్మిన బంట్లు వున్నారు. వాళ్ళని బట్టుకుని ఆశ్రితులూ వున్నారు. వాళ్ళందరి అండ దండలతో ఇన్నాళ్లూ చలాయించుకుని వచ్చాడు పున్నయ్య. కాని ఇటీవల ఆనలుగుర్లోనే కుత కుతలు బయలుదేరాయి. ఉప వర్గాలుగా ఏర్పడినాయి. ఒక వర్గానికి నాయకుడు నాగయ్య. రెండవ దాని లీడరు లోకేశ్వర్రావు. తగాదాలాడుకుని ఒకసారి తన దగ్గరికివస్తే నాగయ్యని చీవాట్లువేసి పంపించాడు పున్నయ్య. అందువలన నాగయ్య మరల పున్నయ్య దగ్గరకి రావటంలేదు. నాగయ్య, కరణం కామయ్య కలిసి తిరుగుతున్నట్లు తెలిసింది పున్నయ్యకు ! ఈ పరి స్థితుల్లో - క్రిందా పైనా నిప్పుల కుంపట్లు పెట్టుకుని పదవిని ఎన్నాళ్ళు నిలుపుకొనగలడో పున్నయ్యకే తెలియటంలేదు! అయితే సమితిలో పున్నయ్య ఫ్రండ్సు చాలమంది వున్నారు. ఎర్రటిఎండలో రొప్పుకుంటూ, చెదిరిన మనస్సుతో ఆ డొంక వెంట వూరికి తిరిగి వస్తున్న పున్నయ్యకు వూరి బయట నాగయ్య ఎదురయాడు. ఏ మాత్రం ఇది లేకుండా తల పక్కకు తిప్పుకుని పోతున్న నాగయ్యని పలకరించి రాజకీయం చెయ్యబోయాడు పున్నయ్య - లోపల్లోపల పళ్ళు నూరుతూనే.

'నాగయ్యా ! ఎటు బోతున్నా ?'

పొగరుగా, సమాధానం ఇవ్వకుండానే పోయాడు నాగయ్య. అగ్గిమీద గుగ్గిలం వేసినట్లు మండిపోయాడు పున్నయ్య, 'విశ్వాసం లేని గాడిద కొడుకు' అని లోపల్నే తిట్టాడు.

వూరి మధ్యన మర్రిచెట్టు వుంది. మర్రిచెట్టు కింద చప్టా మీద కూర్చుని పేకాడుతూవున్న లోకేశ్వర్రావు పున్నయ్యని జూసి పలకరించాడు.

'బావా ! బస్తీనుంచేనా ? ఏం జేసుకొచ్చావు మన యవ్వారం?'

'నాబొంద జేసుకొచ్చాను. నా చావులు నేను జస్తూవుంటే నువ్వు ఇక్కడ కూర్చుని జల్సాగా కాలక్షేపం జెయ్యి.' అని అరి చాడు పున్నయ్య. ప్రస్తుతం లోకేశ్వర్రావు కొన్ని గట్టి చిక్కుల్లో వున్నాడు. అందువలన అతనికి పున్నయ్య సహాయం తప్పనిసరి. లేపోతే మునిగిపోతాడు! ఆ కారణంగా లోకేశ్వర్రావు కోపం తెచ్చుకోకుండా, లేచి, పున్నయ్య దగ్గరకువచ్చి, 'ఎందుకు బావా ? అంత కోపం? నా పని ఏం జేసుకొచ్చావు ?' అని బ్రతిమాలినట్లు మళ్ళీ అడిగాడు.

'ఏం జేసుకొస్తాను ? నా ఒక్క చేతిమీద ఏమవుతుందీ ?' గర్జించాడు పున్నయ్య.

'అయితే నాగతి ఏమిటీ?' దీనంగా అన్నాడు లోకేశ్వర్రావు.

'ఎవరి గతికి ఎవరు కర్తలునాయనా?' అని వేదాంతం పలికి, పున్నయ్య విసురుగా వెళ్ళిపోగా హతాశుడయిపోయాడు లోకేశ్వర్రావు. మనసు వికలమయి ప్రాణం వుసూరు మనగా అక్కణ్నించిలేచి ఇంటివయిపు సాగిపోయాడు.

లోకేశ్వర్రావు ఇల్లు చేరేసరికి అక్కడ అతని కోసమే ఎదురు చూస్తూ వున్నాడు సూరయ్య. సూరయ్య లోకేశ్వర్రావుకి ఆశ్రితుడు. అతనికి అర్జంటుగా పైకం అవసరమయింది. లోకేశ్వర్రావుని అడగ్గా అపూట వస్తే చూస్తానన్నాడు. సూరయ్య వచ్చేసరికే - లోకేశ్వర్రావు బయటికి వెళ్ళాడు. అందువలన వుదయం నించీ అక్కడే పడిగాపులు పడివున్న సూరయ్య లోకేశ్వర్రావుని చూసి ఎంతో సంతోషించాడు తన పని అయిపోయినట్లే అనుకుని. కాని సూరయ్యని చూసీ చూడనట్టు పోతున్న లోకేశ్వర్రావుని సూరయ్య వెనుకపడి పలకరించాడు. 'అర్జంటుగా డబ్బు గావాలి. కూతురు ఇవాళో రేపో కనేరోజులు. ఇంటి దగ్గర ఇబ్బందిగా వుంది.'

'అయితే ఏం చేద్దామంటావ్?' అన్నాడు ఆవేశంగా లోకేశ్వర్రావు.

సూరయ్య తెల్లమొహం వేసాడు!

'డబ్బు సర్దుతానన్నారు. ఇంట్లో ఖర్చులు. బయట అప్పులవాళ్లు.'

'ఇప్పుడు లేదంటున్నాను.' అని దులపరించుకుని ఇంటి లోపలికి వెళ్ళాడు లోకేశ్వర్రావు.

సూరయ్యకి నడుం విరిగినట్టయింది. తన ఆశల పేకమేడలు కూలి పోయాయి. సూరయ్య పేదరయితు. పెద్ద సంసారం. ఇద్దరాడపిల్లలు నలుగురు కొడుకులు. పెద్ద కూతురు పెళ్ళిచేసి పంపాడు, అప్పుచేసి. ఆ అప్పు తీరలేదు. సంవత్సరం తిరిగేసరికి పురిటికని పుట్టింటికి వచ్చి కూర్చుంది కూతురు. కూతురుతోపాటు అల్లుడూ వచ్చి అత్తవారింట్లో తిష్ఠవేసాడు. అతనిపేరు అంజయ్య. ఏ పనీ చెయ్యడు. చిన్న చిన్న ఉద్యోగాలు చాలా చేసాడు. కాని ఎందులోనూ నిలకడలేదు. ప్రస్తుతం నిరుద్యోగ పర్వం. అందువలన భార్యతోపాటు అత్తవారింటికి వచ్చాడు. నెల అయింది. ఇంకో నెల దాకా భార్య కనదు. అంతవరకూ భారంలేదు. తరువాత సంగతి అప్పుడు చూసుకోవచ్చును.

నులక మంచంమీద విశ్రాంతిగా కూర్చుని చార్మినారు సిగరెట్టు తగలవేస్తున్న అంజయ్య మామగార్నిచూసి గౌరవపూర్వకంగా నవ్వాడు. అతను మామగార్ని ఒక కోరిక కోరివున్నాడు. అంజయ్యకి సైకిలు ఎక్కాలనిమోజు. ఆ మోజుని అత్తవారు తీర్చాలని అడిగాడు. సరే చూద్దామన్న సూరయ్య ప్రతిసారీ ఆ పనిని వాయిదా వేస్తూ వచ్చాడు. ఈ సారయినా తనకి సైకిలు ఇప్పించాలని భార్యకి చెప్పి వుంచాడు.

ఆ పరిస్థితిలో గుండెలు భగ్గుమంటూ ఇల్లు చేరిన తనని చూసి ఇకిలించిన అంజయ్యనిచూసి అగ్నిపర్వతంలాగా పేలాడు సూరయ్య.

'సోమరిపోతులాగా అలా కూర్చుని సిగరెట్లు తగలెయ్యక పోతే ఒకసారి అలా పొలంవెళ్ళి గేదెలకు గడ్డి కోసుకురారాదా?'

ఆ మాటకి అంజయ్యకి తిక్క రేగింది. అల్లుడని అయినా మర్యాద లేదు.'

'ఆ అవసరం నాకు లేదు.' అన్నాడు అంజయ్య.

'అవసరం లేదూ? తిని కూర్చుంటే ఎక్కణ్నించి వస్తుందనుకున్నావు?'

'మీరు అలా మాట్లాడితే నేనీ ఇంట్లో క్షణం వుండను' అని అంజయ్య తెగేసి చెప్పగా, సూరయ్య ఆశ్చర్యం నటించి, 'సరే. అలాగే వెళ్ళు. ఈ పూటే వెళతావా? బండి వుంది.' అని బరిసెల్లాంటి మాటల్తో అల్లుణ్ని పొడిచి విసురుగా బయటికి వెళ్ళాడు, ఎలా వచ్చాడో అలాగే.

అంజయ్య నిప్పులు తొక్కిన కోతిలాగా గంతులువేసి, పెద్ద పొట్టతో ఇంట్లో కూర్చునివున్న భార్య పొన్నమ్మ దగ్గరికి వెళ్ళి 'నే వెళ్ళిపోతున్నా. నీ చావు నువ్వు చావు' అన్నాడు. పున్నమ్మ భర్తని బతిమాలి అసలు విషయం అడిగి తెలుసుకుని బెంబేలు పడిపోయి వెళ్ళి, పక్కింటికి వెళ్ళి బియ్యం బదులడిగి లేదనిపించుకుని, కోపంగా అప్పుడే ఇల్లు చేరిన కన్నతల్లి కాంతమ్మకి ఆ విషయం చెప్పి ఏడ్చేసింది. అప్పటికే అంజయ్య అంగలు పంగలు వేసి ఇల్లువదలి పోయాడు - నే వెళ్ళిపోతున్నా నంటూ మహా కోపంగా.

కడుపు చెరువయిన కాంతమ్మ, భర్త సూరయ్యనీ ఇంట్లో వాళ్ళనీ, కలిపీ విడివిడిగానూ, శాపనార్థాలు పెట్టుండగా - గంతులు వేస్తుండగా

'అమ్మా నాకు బెల్లంపెట్టవే' అంటూ పదిసార్లు విసిగించాడు, చిన్నకొడుకు కిష్టిగాడు. 'పెడ్తాను పట్టరా, చచ్చినాడా' అని ఆ కోపంతో వాడి వీపున రాంధోలు మోత మోగించింది. కాంతమ్మ.

కిష్టిగాడు ఆ దెబ్బలు భరించలేక, కళ్ళవెంట నీరు కారుతూ వుండగా, ఇంటి వెనక్కు దొడ్లోకి పరుగుతీసాడు. వాడి గుండెలు అవమానంతో మండినయి. లేత మనస్సు ప్రతీకారేచ్ఛతో ప్రజ్వరిల్లింది. వీపు కాల్చినట్టు మంట పెట్టగా ఏం చెయ్యాలా అని ఆలోచించాడు.తన కసిని ఎట్లా తీర్చుకోవాలా అని అటు ఇటు చూశాడు.

ఎదురుగా పశువుల పాకలో స్తంభానికి కట్టేసి వున్న లేగ దూడ కిష్టిగాడ్నిచూసి స్నేహపూర్వకంగా అంబా అని పిలిచి తోకాడించింది. దాని వయసు రెండు నెలలు. దాన్తో కిష్టిగాడు రోజూ ఆడతాడు. దాంతోపాటు చెంగు చెంగున పరుగు దీస్తాడు.

ఎదురుగా మొండి గోడ కానించి వున్న వెదురు బొంగు కనపడింది కిష్టిగాడికి. ఆ కర్రని తీసుకుని దూడ దగ్గరకు వెళ్ళి వీరావేశంతో పటపట నాలుగు దెబ్బలు వేసాడు కిష్టిగాడు. దూడ గిలగిల లాడింది దెబ్బలకి. గిరగిర తిరిగింది. చేసేదిలేక కళ్ళ వెంట నీరు గారుస్తూ 'అంబా అంబా' అని అరిచింది.

'ఒరేయ్ ! ఒరేయ్' అని వెనకనించి అరిచింది అప్పుడే అటువచ్చిన కాంతమ్మ, అది జూసి. కర్రని అవతలపడేసి భయంతో వీధిలోకి పరిగెత్తాడు కిష్టిగాడు, ముక్కుని ఎగబీలుస్తూ.

సాయంత్రమయింది.

ప్రొద్దుహూకింది.

చీకటి పడింది.

ఆ చీకట్లో, రాజీ కోరుతూ, బస్తీనుంచి పున్నయ్య దగ్గరకి వెంటయ్య పంపించిన పెద్దమనిషి, ఆడొంక వెంట, వరిచేలమధ్యగా మోటారు సైకిలు మీదవచ్చి, పున్నయ్యని కలిసి సంప్రదింపులు జరిపి, సంధి కుదిర్చాడు. పున్నయ్య లోకేశ్వర్రావుని పిలిపించి, చాలాసేపు మాట్లాడి, అతని చిక్కుల్ని పరిష్కరించే భారాన్ని తిరిగి తన బుజాలకి ఎత్తుకున్నాడు. లోకేశ్వర్రావు సూరయ్యని పిలిపించి డబ్బు ఇచ్చి ధైర్యం చెప్పి పంపించాడు. వరదకొండు దాటింది.

సంతోషంతో సూరయ్య ఇల్లు చేరేసరికి మనస్సు మార్చుకుని, మళ్ళీ తిరిగివచ్చి వాకిట్లో మంచంమీద కూర్చుని పొన్నమ్మతోను, కాంతమ్మతోను కబుర్లు చెప్తూవున్న అంజయ్య కనిపించగా, ఆనందించాడు.

ప్రొద్దుగుంకగానే ఇల్లు చేరి, తల్లితో చీవాట్లుతిని తరువాత అన్నం తిన్న కిష్టిగాడు నిద్రలో పడ్డాడు.

వీపుమీద 'కిష్టిగాడి దెబ్బలు' సలపగా, అపూట పాలుహూడా తాగకుండా నీరసంగా పడుకుని వున్న దూడవీపుని నాలుకతో నాకుతూవున్న తల్లి గేదె కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి.

# జిడ్డు కృష్ణమూర్తితో !

## శ్రీ నిఖిలేశ్వర్

మర్రి చెట్టు నీడన
సెలయేటి సోయగాలతో
నడయాడే వాక్ చాతుర్యానికి
ముగ్ధులై నిట్టూర్పులు వొదిలి
అదోరకమైన ఆనందానికి - కాలక్షేపానికి
అలవాటైన మధ్యతరగతి మేధావులకు,
దిక్కుతెలియని యూరోప్ శూన్యదృక్కులకు -
ఒక నిట్టూర్పును
ఒక నిస్సహాయత్వాన్ని
మిగుల్చుతున్న నువ్వు,
నీలోకి నువ్వు చూసుకున్న
నిన్ను నువ్వు తెలుసుకున్నానని అనుకున్నా -

పేరు ప్రఖ్యాతుల చీకటి - వెలుగులను
లైంగికానుభూతుల క్షణికత్వాన్ని
అమేయమైన ఆనందాన్ని
తృష్ణలోనే దాగిన మృగతృష్ణను
ధనంలోని భౌతిక మూలాన్ని
నువ్వు నిరాకరించి నిలవ గలిగినా;
నీ ఆలోచనకు
నీ అదిభౌతిక చింతనకు
ఎవరిశ్రమ మూలమో,
ఆ శ్రమను ఎంత నాజుగ్గా
ప్రపంచ ధనస్వాములు
నీ తత్వ చింతనా
చలివేందిరాల్లో దాక్కొని
ఎన్ని హొయలుపోతూ
నంజుకుంటున్నారో
అసలు చూశావా కృష్ణమూర్తి ?

ప్రపంచానికి
నిరంతర వ్యాఖ్యానంతోనే
జీవితాన్ని మొత్తం
ఒక "రుషీవాలీ"గా,
నీపేర ఒక ఫౌండేషన్‌గా మాత్రమే మిగిల్చితే,
ఎవడిపిచ్చి వాడివెర్రి స్వర్గంగా
తయారైన దశలో—
అసలు ఈ ప్రపంచాన్ని
సమూలంగా శాస్త్రీయంగా
మార్చగలిగే శ్రమశక్తి
అడుగడుగునా
వర్గరహిత సమాజ స్వప్న సాఫల్యంకోసం
సజీవ సంఘర్షణ జరుపుతున్న
సామాన్యుడి అజేయశాస్త్రం
నీ చెవుల దగ్గరే ఆగిపోయిందా ?

శ్రీ యస్. లింగమూర్తి    శ్రీ జి. సుదర్శన్

# అంత్యోదయ కార్యక్రమం-రాజస్థాన్ అనుభవం

భారతదేశ ఆర్థిక వ్యవస్థలో పేదరికము అనాదినుండి పాదుకొని యున్నది. ప్రతి పంచవర్ష ప్రణాళికలో పేదరికాన్ని నిర్మూలించడం ఒక ముఖ్యమైన లక్ష్యంగా పెట్టుకుంటూ వచ్చాము. కాని దీనిని పూర్తిగా రూపుమాపడంలో మనము ఇంతవరకు సఫలీకృతులం కాలేదు. ఆరవ పంచవర్ష ప్రణాళిక ప్రకారం దాదాపు 41 శాతము ప్రజలు పట్టణ ప్రాంతాలలో మరియు 48 శాతము ప్రజలు గ్రామప్రాంతాలలో దారిద్ర్యరేఖ క్రింద నివసించు చున్నారు.

గతంలో ప్రభుత్వం చేపట్టిన గ్రామాభివృద్ధి కార్యక్రమాల ఫలితాలన్ని సంపన్న వర్గాలకు మాత్రమే చేకూరినవని ఎన్నో పరిశీలనలు వెల్లడి చేసినాయి. అందుచేత బహుగువర్గాల అభివృద్ధికై యస్. యఫ్. డి. ఏ., యం. ఎఫ్. ఏ. యల్. మొదలైన ప్రత్యేక ఏజన్సీలను సృష్టించడం జరిగింది. కాని ఈఏజన్సీల కార్యక్రమాలు కూడా పేదవాళ్ళలో అట్టడుగువాళ్ళను సృష్టించలేదు. అందువల్ల రాజస్థాన్ రాష్ట్రప్రభుత్వం అతి పేదవాళ్ళను అభివృద్ధిపరచడానికై "అంత్యోదయ" అనే ఒక క్రొత్త కార్యక్రమాన్ని రూపొందించింది. ఈ కార్యక్రమం మొదట అతిపేదవాళ్ళ అభివృద్ధితో మొదలుకొని క్రమక్రమంగా మిగతా పేదవాళ్ళందరకు విస్తరిస్తుంది.

రాజస్థాన్‌లో ఈ కార్యక్రమము అక్టోబర్ 2, 1977 రోజున ప్రవేశపెట్టబడినది. దీనిప్రకారం దారిద్ర్యరేఖ క్రింద నివసించే గ్రామాలలోని పేదవాళ్ళలో ప్రతిగ్రామమునందు ఐదు అతిపేద కుటుంబాలను గుర్తించి వారికి తగినటువంటి అభివృద్ధి కార్య క్రమాలను రూపొందిస్తున్నారు. రాజస్థాన్ రాష్ట్రములోని మొత్తము 33 వేల గ్రామాలు ఒకదశాబ్దకాలములో ఈ కార్యక్రమము కిందకు రావాలని ఉద్దేశించడం జరిగింది. మొదటి 5 సంవత్సరములలో సుమారు అరు లక్షల కుటుంబాలు దీని క్రిందకు వస్తాయి.

ఈ అతిపేద కుటుంబాలను గ్రామాలలోని గ్రామసభలు గుర్తించడం జరుగుతుంది. ఈ సభలకు గ్రామస్థులందరు, ఆ ప్రాంతానికి చెందిన యం. ఎల్. ఎ. మరియు యమ్. పి., అగ్రామ పంచాయితీ అధ్యక్షుడు, జిల్లాపరిషత్ ప్రముఖ్, పంచాయితీ సమితి 'ప్రధాన్' మొదలైన వారంతా హాజరవుతారు. ఈసభలు గుర్తించిన అతిపేద కుటుంబాలకు తగినటువంటి అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన సూచనలను చేస్తాయి.

పేదకుటుంబాలను గుర్తించేటప్పుడు ఈ క్రింది అంశాలను దృష్టిలో వుంచుకొంటారు.

1. ఏ విధమైన ఆదాయాన్నిచ్చే ఆస్తులు లేని లేక 15 నుండి 59 సంవత్సరముల మధ్య వయస్కులైన కుటుంబాన్ని పోషించే వ్యక్తులు లేని కుటుంబాలు.

2. ఆస్తులులేని కుటుంబములో ఒకరుగాని లేదా అంతకంటె ఎక్కువ మంది వ్యక్తులు ఏదైన ఒక ఆర్థిక కలాపాన్ని చేపట్టే సమర్థత కలవారై యుండాలి. కాని మొత్తము 5 గురు వ్యక్తులుగల కుటుంబ ఆదాయము రూ॥ 1200ల కంటె మించకూడదు.

3. ఏదో కొంతభూమిలేని వ్యవసాయకూలీలు మరియు చేతి వృత్తుల కుటుంబాలలో 5 గురు గల కుటుంబం ఆదాయము రూ॥ 1200ల నుండి రూ॥ 1800ల మధ్య వుండాలి.

4. ఏదో కొంతభూమినిగాని లేదా ఇతర ఆస్తులనుగాని కలిగియుండి నెలకు రూ॥ 55 ల కంటె తక్కువ తలసరి వినియోగము గల కుటుంబాలు.

పైన వివరించిన ప్రకారంగా గుర్తించబడిన కుటుంబాలకు ఈ క్రింది పద్ధతులలో ఏదో ఒక విధంగా సహాయం చెయ్యడం జరుగుతుంది.

1. ఏ పని కూడా చేసే స్థితిలోలేని వృద్ధులు మరియు బలహీనులయిన వ్యక్తులు గల కుటుంబాలలో ఆస్తులు లేకున్నగాని లేదా కుటుంబాన్ని పోషించేవ్యక్తి లేకున్నగాని వారికి పెన్షన్ ఇవ్వబడుతుంది. ఇటువంటి వ్యక్తులు ఒకరున్న కుటుంబానికి నెలకు రు॥ 40 చొ॥న మరియు ఒకరికంటె ఎక్కువున్న కుటుంబాలకు నెలకు రూ॥ 60 చొ॥న ఇస్తారు.

2. మిగులు ప్రభుత్వ భూములున్న ప్రాంతాలలో అంత్యో దయ కార్యక్రమ కుటుంబాలకు ఆ భూములకు ప్రాధాన్యత ప్రాతి

పదికగా పంచుతారు. ఈ భూములు లభించిన వారికి పరపతి మరియు ఇతర ఉత్పాదకాలను సప్లయి చేస్తారు.

3. మిగతా కుటుంబాలకు స్వయం ఉపాధి పథకాల ద్వారా అభివృద్ధి మార్గాలను చూపెదరు. స్వయం ఉపాధిపథకం క్రింద సుమారు 25 రకాలకార్యక్రమాలు ఉన్నాయి. వీటిలో ఎడ్లబండ్లను ఇవ్వడం, గొర్రెల పెంపకం, పాడి పశువుల పెంపకం, కోళ్ళ పెంపకం, పందుల పెంపకం, చాపల అల్లకం, బుట్టలు అల్లడం, నవారు నేయడం, చెప్పులు కుట్టడం, సైకిళ్ళు రిపేరు చేయడం మొదలైనవి కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు.

ఈ కార్యక్రమం యొక్క మొదటి దశ సెప్టెంబరు 1978 నాటికి పూర్తి అయింది. దాదాపు 1,60,368 దారిద్ర్యరేఖ క్రింద నుండే కుటుంబాలను ఈ దశలో గుర్తించడం జరిగింది. మార్చి 1979 నాటికి గుర్తించబడిన కుటుంబాలలో 1,39,986 కుటుంబాలకు వేరు వేరు రూపాలలో సహాయంచేయడం జరిగింది. ప్రభుత్వం అంచనాప్రకారం ఒక దశాబ్దకాలంలో సుమారు 2 మిలియన్ల కుటుంబాలు ఈ కార్యక్రమము క్రిందకు వస్తాయి. ఇందుకై మొత్తము ఖర్చు రూపాయిలు 187 కోట్లు ఖర్చుపెడతారు.

మార్చి 31, 1979 నాటికి జిల్లాలవారీగా ఈ కార్యక్రమము సాధించిన ప్రగతి ఈ క్రింది పట్టికలో ఇవ్వబడింది.

## జిల్లాలవారిగా అంత్యోదయ కార్యక్రమ ప్రగతి

(మార్చి 31, 1979 వరకు)

| క్రమ సంఖ్య | జిల్లా పేరు | లాభపడవలసిన కుటుంబాల సంఖ్య | లాభపడిన కుటుంబాల సంఖ్య | శాతము |
|---|---|---|---|---|
| 1. | సిరోహి | 2584 | 2584 | 100.0 |
| 2. | ఉదయపూర్ | 15339 | 15339 | 100.0 |
| 3. | జోథ్‌పూర్ | 3622 | 3622 | 100.0 |
| 4. | అల్వార్ | 8561 | 8561 | 100.0 |
| 5. | టోంక్ | 3797 | 3797 | 100.0 |
| 6. | బన్స్‌వారా | 6679 | 6679 | 100.0 |
| 7. | మథోపూర్ | 6301 | 6301 | 100.0 |
| 8. | చిత్తోర్‌ఘర్ | 8709 | 8693 | 99.8 |
| 9. | ఝున్‌ఝును | 3287 | 3268 | 99.4 |
| 10. | జైపూర్ | 12242 | 12153 | 99.3 |
| 11. | భిల్వారా | 3922 | 3862 | 98.5 |
| 12. | పాళి | 4323 | 4228 | 97.8 |
| 13. | బుంది | 3327 | 3203 | 96.3 |
| 14. | జైసల్‌మేర్ | 1740 | 1666 | 95.7 |
| 15. | సికార్ | 5606 | 5344 | 95.3 |
| 16. | చురూ | 3943 | 3728 | 90.5 |
| 17. | బికనేర్ | 2666 | 2419 | 90.7 |
| 18. | గంగానగర్ | 6072 | 5453 | 89.8 |
| 19. | జాలోర్ | 3410 | 3020 | 88.3 |
| 20. | దుంగర్‌పూర్ | 4160 | 3649 | 87.7 |
| 21. | బార్మల్ | 3780 | 3248 | 85.9 |
| 22. | ఝూలావార్ | 6514 | 5414 | 83.1 |
| 23. | నాగౌర్ | 5777 | 4777 | 82.7 |
| 24. | భారత్‌పూర్ | 11428 | 9313 | 81.5 |
| 25. | కోటా | 8041 | 5680 | 70.6 |
| 26. | అజ్మీర్ | 6782 | 3935 | 58.0 |
| | మొత్తము | 1,52,582 | 1,39,986 | 91.7 |

పట్టిక ప్రకారం రాష్ట్రం మొత్తములో ఈ కార్య క్రమం ప్రగతి 91.7 శాతముగా నున్నది. రాష్ట్రంలోని మొత్తం 26 జిల్లాలలో 7 జిల్లాలు నూటికి నూరుపాళ్లు లక్ష్యాన్ని సాధించాయి. చాలా జిల్లాలలో ఈ కార్యక్రమము ప్రగతి 81 నుండి 100శాతము వరకు ఉన్నది. కేవలం 2 జిల్లాలలో మాత్రమే దీని ప్రగతి 58 శాతము మరియు 70.7 శాతముగా నున్నది.

రెండవ దఫా అంత్యోదయ కుటుంబాలను గుర్తించడం నవంబరు 15, 1978 నాటికి ప్రారంభమై సుమారు 1,11,779 కుటుంబాలు ఇంతవరకు గుర్తించబడినవి. వీటిలో సుమారు 57,882 కుటుంబాలకు వేర్వేరు పథకాలక్రింద సహాయము అంద జేయడం జరిగింది.

ఈ కార్యక్రమం నడవడికపై ప్రణాళిక సంఘంవారు 1978లో ఒక పరిశీలన జరిపారు. ఈ పరిశీలనలోని కొన్ని ముఖ్యాంశాలు ఈ క్రింద నివ్వబడినవి.

1. ఈ కార్యక్రమానికి సంబంధించిన వివరాలు పేద వాళ్ళందరు ఎరుగునట్లుగా ప్రచారం చేయబడ్డవి.

2. దీనివల్ల పేదవాళ్ళ అంతస్థు మరియు పరపతి శక్తి పెరిగింది.

3. పేద కుటుంబాలను గుర్తించడం చాలావరకు న్యాయం గానే వుంది.

4. పరపతి ఉపయోగిత సక్రమంగా జరుగుచున్నదా? లేదా? అనేది చూడటానికై వాణిజ్య బ్యాంకులు గట్టి పర్యవేక్షణ సిబ్బందిని నియమించవలసిన అవసరం ఉన్నది.

5. యస్. ఎఫ్. డి. ఎ. పథకంలో ఉన్న మాదిరిగా "రిస్క్ ఫండ్"ను ప్రవేశ పెట్టాలి.

6. ప్రతి ఒక అభివృద్ధి పథకానికి కావలసిన మొత్తము పెట్టుబడి ప్రభుత్వము ఇచ్చినచో కార్యక్రమం సమర్థవంతంగా రూపొందుతుంది.

7. ముడి పదార్థములు మరియు మార్కెటింగ్ సౌకర్యాలు విస్తృత పరచవలసిన అవసరం ఉన్నది.

8. ఈకార్యక్రమాన్ని సమర్థవంతంగా అమలు పరచడానికి ఒక ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పరచాలి.

9. సకాలంలో తగిన చర్యలు తీసుకోవడానికి కార్యక్రమం నడవడికపై అప్పుడప్పుడు పరిశీలనలు జరుపవలెను.

పైన వివరించిన విధంగా ఇంతవరకు ఈ కార్యక్రమం యొక్క ప్రగతి 58 నుండి 100 శాతం వరకు ఉన్నది. రాజస్థాన్ రాష్ట్రం సాధించిన ఈ ప్రగతి దేశంలోని మిగతా రాష్ట్రాలకు మార్గదర్శకంగా అగుపించు చున్నది. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం క్రింద ఈకార్యక్రమాన్ని అమలుపరిచే రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రప్రభుత్వం ధనసహాయము చేస్తానని ప్రకటించింది. ఈ కార్యక్రమాన్ని ఉత్తరప్రదేశ్, హిమాచల్‌ప్రదేశ్, బీహార్, గుజరాత్, మణిపూర్ మరియు ఒరిస్సా రాష్ట్రాలుకూడా ప్రవేశ పెట్టినాయి. రాజస్థాన్ రాష్ట్రానికి ప్రపంచ బ్యాంకు సహాయం అందజేస్తానని హామీ ఇచ్చింది.

ఈ కార్యక్రమం విజయవంతంకావడానికి ముఖ్యంగా ఈ క్రింది సూచనలను పాటించవలసి ఉంటుంది.

1. ఋణాల ఉపయోగిత సక్రమంగా జరిగేటట్లు చూసి, అవి అనుత్పాదక కార్యక్రమాలవైపు మళ్ళించకుండా తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

2. ఋణాలు సక్రమంగా రాబట్టుకోడానికి తగిన చట్టాలను ప్రభుత్వంవారు రూపొందించాలి.

3. సాధ్యమైనంతవరకు ఋణాలను డబ్బు రూపంలో కాకుండా వస్తు రూపంలో అందజేయటం మంచిది.

4. ఈ కార్యక్రమాన్ని అమలు పెట్టడంలో స్వచ్ఛంద సేవా సంస్థల సహకారం కూడా తీసుకోవాలి.

5. స్థానిక ప్రజాప్రతినిధులు ఈ కార్యక్రమానికి సంబం ధించిన జ్ఞానాన్ని పేదవాళ్ళలో కలుగజేసి వారు లాభం చెందు నట్లుగా చూడాలి.

పైసూచనలను మరియు ప్రణాళికా సంఘంవారి పరిశీలన లోని ముఖ్యాంశాలను దృష్టియందుంచుకొని దేశమంతటా ఈ కార్యక్రమాన్ని అమలు పరచినచో అనాదినుండి మన ఆర్థిక వ్యవస్థలో దృఢంగా పాదుకొనియున్న పేదరికం కూకటి వేళ్ళతో సహా పెకిలింపబడుతుందనడంలో సందేహం లేదు.

[శ్రీ లింగమూర్తి వరంగల్ వి.కె.యం.కాలేజీలో అర్థశాస్త్రోపన్యాసకులు. శ్రీ సుదర్శన్ అక్కడ అర్థశాస్త్రంలో రిసెర్చి స్కాలరు.]

# పచ్చటి చెట్టుమీద పిడుగు

శ్రీ కె. యస్. రమణ

యెందుకని అడక్కు
యేదీ యెందుకని అడక్కునేస్తం

అలా బతికెయ్యటం తప్పించి-
మరేదీ ఆలోచించెయ్యకు

అంతా అంతే అంతా చివరికి అంతే
అంతంలేని యీ భువనం అంతా
నిత్య నూత్న శ్మశానవాటి
తలబద్దలు కొట్టుకుని యేం ఫలం
మొగ్గలెప్పుడూ నలిగిపోతుంటాయి
యెర్రటి బుగ్గలెపుడూ అకలితో రక్కబడుతూనే వుంటాయి
అకురాలిపోతూ చివరిమాట చెప్పదు
పుడుతున్న శిశువు అణుయంత్రాల్ని వుచ్చరిస్తుంది.
యేదీ నిలబడదు నిదానించదు
శాశ్వతంగా యేదీ కళ్ళముందు పాతుకోదు
సత్యం కదిలి పోతూనే వుంటుంది వేగంగా
ముక్కలవుతూనే వుంటుంది ముక్కలు ముక్కలుగా,
అడక్కు అడక్కు
చిరుగుల చొక్కాని తిరగేసి తొడుక్కుంటేమాత్రం
చివరికి ఆకులు కూడా అందని కాలిన శాపం
తల్లీ తల్లీ నువ్వుండీ లేకుండీ
తండ్రీ తండ్రీ వున్నట్లా లేనట్లా
యెక్కడని యెవరని నిశ్శబ్దంలోంచి చిమ్మిన వేదనార్తనాదం
నిశ్శబ్దంలోనే కలుస్తుంది
నువ్వు యెరగని సుఖాలు దుఃఖాలు
వరదలా నిన్ను ముంచెత్తుతాయి
తడిసిపోయి వుబ్బిపోయి వికృతంగా విర్రవీగే
శవాన్ని చూసి జడవకు అరవకు
నొక్కేసుకో వొప్పేసుకో
నోరునొక్కేసుకో బతుకనే తప్పును వొప్పేసుకో.

యీ పత్తినుంచి నువ్వు లాగగలిగినంత
నూలును మాత్రమే లాగగలవు

గర్భశోకాల్ని ఘరికొయ్య వుదంతాల్ని
రాత్రి దాచుకోలేందు
ధాత్రి ఆపుకోలేందు తమ్ముడూ

అరుణారుణ ప్రసవాల్ని
అలకెందుకు జీవితం మీదా
మళ్ళీ మళ్ళీ పలకిచ్చి
ఓ నమాలు దిద్దమనే నాన్న మీదా

అదీ - అదీ -
ఆరిందలా నువ్వు కళ్ళుతిప్పు
యేదీ నీ దృష్టినుంచి తప్పుకోనట్లు నటించు
నీకు నువ్వే సర్వజ్ఞుడవని భ్రమించు
లోయల్లో సర్పాల్ని స్వప్నాల్ని
లోతుల్లోకి తొక్కెయ్
యింకొంచెం యింకొంచెం
మిగిలిన నిన్ను కొంచెం కొంచెం
గిల్లి గిల్లి కాకులకీ గద్దలకీ వేస్తుండు
సంఘ జీవనం సాగిస్తుండు
నువ్వు నువ్వుగా కలిసి జీవించలేని గుంపులో
నేస్తం కలిసి తిరిగేసెయ్
అవసరాన్ని మించిన అవసరంతో
అవసరార్థం అనవసరంగా కలిసి బతికేసెయ్
కప్పేసుకో మర్మావయవాలని
అన్ని సిగ్గుల హంగులతోనూ
యెందుకని అడక్కు రహస్యం
పిడికిలి యెందుకు మూయాలో యెందుకు తెరవాలో
పిడికిలికే తెలీదు సుమా
తుఫానులా యేదో దుఃఖం నన్ను పూడ్చుకుపోతోంది

నేస్తం మునిగిపోతున్నానో కరిగిపోతున్నానో
యేమైపోతున్నానో
నీ కన్నీటి మసక మసక వెనుక మసకగా
అదృశ్యుణ్ణవుతున్నానో
కనిపిస్తూ మాయమవుతూ
పడుతూ లేస్తూ పరుగులు పెడుతూ
అంతేలే నేస్తం
అదంతే
అంతమాత్రాన ఆ పచ్చటి చెట్టుమీద పిడుగులా
ఆ ప్రశ్న యెందుకులే నేస్తం. తమ్ముడూ నాకన్నా
రక్షించుకో నిన్ను
యెక్కడున్నావ్ యెక్కడున్నావ్
అయ్యో అయ్యో
అన్నా నా అన్నా నా
అదంతే
అంతమాత్రాన ఆ పచ్చటి చెట్టుమీద పిడుగులా
ఆ ప్రశ్న యెందుకులే నేస్తం. తమ్ముడూ నాకన్నా
అన్నా నా
విన్నావు కాదు....
విన్నావు కాదు... !

# అందిన ద్రాక్ష

శ్రీ మేకా మన్మధరావు

తొలి వెలుగుల
తూరుపు మధుశాలనుండి
పసిడి వన్నెల మిసిమి పాత్రలో
చైతన్య మధువును నింపి
సుదూరం నుండి నీకోసం
నడచివస్తుంది ఉషఃకన్య సాకీ -

ప్రియ మిత్రమా ! మేలుకో !
హృదయాన్ని చషకంగా చేసుకో !
బ్రతుకు రుబాయతు చేసి పాడుకో !

ప్రతి ఒక 'నిన్న'
వాడిన పొగడ పూలదండ.
వీడని స్మృతుల పరిమళం దానినిండ.
'రేపు'
ఒక స్వప్నాల స్వాతి చిప్ప.
ఏ దరి చేరేనో తెలియని పూలతెప్ప.

'నిన్న' మొన్నటికి 'రేపు'.
'రేపు' రేపటికి 'నేడు.

ఈ దినాల పరుగుల పరవళ్ళు
ఎప్పుడు ఎవరు
అవుతవుతారో తెలియని చెదుగుళ్ళు !

నా గుడిసె వెనుక
కాలే కట్టె ఈ సత్యాన్నే
పుటం వేస్తుంది !
నా అరుగువార ఏకతార
ఈ తత్వాన్నే మీటుతుంది.

అందుచేతనే అంటాను -
'నేడు' ఒక అందిన ద్రాక్ష
దాని సద్వినియోగమే కావాలి నీ దీక్ష !

శ్రీమతి ఆర్. నీరజ

# క్రొత్త అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలు ఒక చారిత్రక పరిశీలన

17వ శ॥నికి పూర్వము స్వదేశ ఉత్పత్తియే దేశాలయొక్క పరిమితి అవసరాలను తీర్చగల్గుతూ, ఇతర దేశాలతో వస్తు వ్యాపార సంబంధాలు అతి తక్కువ స్థాయిలో ఉంటూ, దేశాల మధ్య ఆర్థిక దోపిడీకి తావివ్వలేదు. తరువాత తరువాత మర్కెంటలిజమ్ బహుళ వ్యాప్తినొంది, ప్రపంచ దేశాలు, అంతర్జాతీయ ప్రఖ్యాతి నార్జించుటకై అంతర్జాతీయ వ్యాపారంలో ప్రవేశించి అధిక లాభాలను స్వర్ణరూపంలో గడించుతూ ఆర్థిక దోపిడీకి పునాది వేసినవి.

18వ శ॥లో మొదటగా ఇంగ్లండులో, తరువాత యూరప్‌లో వచ్చిన పారిశ్రామిక విప్లవము ఉత్పత్తి విధానంలో మౌలికమైన మార్పులను తీసికొనివచ్చి యంత్రాల సహాయంతో భారీ ఉత్పత్తికి, తద్వారా ఏర్పడే అధిక మిగులు ఉత్పత్తికి అవకాశాన్ని కల్పించి, పరిశ్రమకు అవసరమైన ముడిపదార్థాల క్రయానికి, మరియు తయారైన వస్తువులను విక్రయించడానికి విదేశ మార్కెట్ల అన్వేషణ, ఈ అన్వేషణ ప్రపంచ యుద్ధాలవరకు దారితీయుటకు తోడ్పడినవి.

రికార్డో సిద్ధాంతము ప్రకారము ప్రతిదేశము తనకు తులనాత్మక ప్రయోజనము ఎక్కువగా ఉన్న వస్తూత్పత్తిలో ప్రత్యేకీకరణ చేసి, ఆ వస్తువుల నెగుమతి చేసి, తులనాత్మక ప్రయోజనము తక్కువగా ఉన్న వస్తువులను దిగుమతి చేసికొనిన ఇరు దేశాలకు లాభదాయకంగా ఉంటుంది అని పేర్కొన్నాడు. ఆడమ్ - స్మిత్, హెక్షర్ ఓహిలిన్, ప్రెబిష్‌లు కూడ దేశాల మధ్య వ్యాపారము అన్ని దేశాలకు లాభదాయకంగా ఉంటుంది[1] అని పేర్కొన్నారు.

ప్రపంచ శక్తిగా పేర్కొనబడిన బ్రిటన్, ఇతర మిలిటరీ శక్తివంతమైన ఐరోపా దేశాలు, లాటిన్ అమెరికా, ఆసియా, ఆఫ్రికా దేశాలతో చేయువ్యాపారము, వలస విధానానికి దారి తీసి, ప్రపంచ దేశాలన్నీ అభివృద్ధి చెందిన తయారైన వస్తువుల నెగుమతి చేయు సామ్రాజ్యవాద దేశాలుగాను, వెనుకబడిన ముడి పదార్థాలను ఆహారధాన్యాలను వ్యవసాయ ఉత్పత్తులను అందించే వలస దేశాలుగాను విభజన చెందినవి. అంతర్జాతీయ వ్యాపారంలో పాల్గొను వస్తువుల ధరలను నిర్ణయింపడంలో సామ్రాజ్యవాద దేశాలు ముఖ్యంగా బ్రిటన్ ఏకస్వామ్య అధికారాన్ని పొంది, యంత్రపరికరాలకు, తయారైన వస్తువులకు అత్యధిక ధరలను నిర్ణయించి; ఆహారపదార్థాలకు, ప్రాథమిక వస్తువులకు తక్కువ ధరలను నిర్ణయించి, అధిక లాభాలను సంపాదించి, దేశాలమధ్య ఆర్థిక అసమానతలను విస్తృత పరచినవి.

రెండవ ప్రపంచ యుద్ధము తరువాత అంతర్జాతీయ ఆర్థిక రాజకీయ సాంఘిక విషయాలలో అనేక మార్పులేర్పడినవి. అవి, యుద్ధంవలన ప్రపంచదేశాల ఆర్థికస్థాయి కుంటుపడుట, అంతర్జాతీయ మార్కెట్‌గా లండన్ తనస్థానాన్ని కోల్పోవుట, వలస దేశాలలోని జాతీయ పోరాటాలు, జాతీయ రాజ్యాల ఆవిర్భావము, రాజకీయ స్వాతంత్ర్యమేర్పడుట, పెట్టుబడిదారీ విధానానికి, పెట్టుబడిదారీ మార్కెట్‌కు పోటీగా సామ్యవాదము, సామ్యవాద మార్కెట్ ఆవిర్భావము మొదలైనవి. క్రొత్తగా ఆవిర్భవించిన జాతీయ దేశాలు రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించిననూ, ఆర్థిక స్వాతంత్ర్యము సంపాదించలేదు. కావున ఈ దేశాలు తమ దేశాలలో దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుటకు తీవ్రమైన ప్రయత్నములు చేసినవి. దేశీయ పరిశ్రమల అభివృద్ధి, పారిశ్రామికీకరణకు, ఇతరదేశములపై మూలధనం కొరకై యంత్రపరికరాల కొరకై ఆధారపడుటను తగ్గించుటకు, వెనుకబడినతనము నుండి బయటపడుటకు వీలు కల్పించి, వ్యవసాయ రంగంలో సాంకేతిక విప్లవాత్మక మార్పులను ప్రవేశపెట్టుటకు, జాతీయ విముక్తికి పోరాడే శ్రామిక వర్గాన్ని ఏర్పాటు చేయుటకు, అధిక ఉత్పత్తికి, నిరుద్యోగము వంటి సాంఘిక సమస్యలను తొలగించుటకు తోడ్పడగలదు. ఈకారణాల దృష్ట్యా అనేక వెనుక

బడిన దేశాలు పారిశ్రామిక అభివృద్ధి దేశీయ పరిశ్రమల అభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చినవి.

ఆర్థికాభివృద్ధి స్థాయి, పారిశ్రామికాభివృద్ధి స్థాయి ననుసరించి ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఉత్తర దక్షిణ దేశాలుగా ఈ మధ్యకాలంలో విభజన చెందినది. భూగోళంమీద ఉత్తరాన ఉన్న, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు అయిన అమెరికా, కెనడా, బ్రిటన్, రష్యా మొదలైన దేశాలు ఉత్తర విభాగంగాను, పారిశ్రామికంగా వెనుకబడిన దేశాలైన లాటిన్ అమెరికా దేశాలు, ఆఫ్రికా దేశాలు మరియు ఆసియాదేశాలు దక్షిణ విభాగంగాను పేర్కొనవచ్చు ను.

ఈ రెండు విభాగాలమధ్య ఆదాయ అంతరము నిరవధికంగా పెరుగుతూ వచ్చింది. దక్షిణ దేశాల జనాభాలో ⅓ వ వంతు ఉత్తర దేశాలలో ఉన్నారు. మరియు దక్షిణ దేశాల జాతీయాదాయం కంటే 12.5 రెట్లు ఉత్తరదేశ జనాభా అనుభవిస్తున్నారు. ప్రపంచ జనాభాలో ¼ వ వంతు జనాభా ఉత్తర దేశాలలో ఉంటూ ప్రపంచ ఆదాయంలో 80 శాతం వీరు అనుభవిస్తున్నారు. ప్రపంచంలోని యంత్ర పరిశ్రమలలో 90 శాతం ఉత్తర విభాగంలో కేంద్రీకృత మైనట్లు తెలియుచున్నది. 2

రెండవ ప్రపంచ యుద్ధము తరువాత కొన్ని దశాబ్దముల వరకు ఎగుమతి దిగుమతి ధరల నిష్పత్తులను పరిశీలించిన, ఈ ధరలలోని మార్పులు అభివృద్ధి చెందిన పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాలకు అనుకూలంగా మారినవని తెలియుచున్నది. ఐక్యరాజ్య సమితి యొక్క ప్రత్యేక పరిశీలనను గురించి వెనుకబడిన దేశములు 1949 లో 2,200-3,000 మి. డాలర్లు ఎక్కువగా, తయారైన వస్తువుల దిగుమతులకు చెల్లించవలసి వచ్చింది. ఎగుమతి దిగుమతి ధరల వ్యత్యాసం వలన వెనుకబడిన దేశాలు సరి అయిన ఆదాయమును పొందలేకపోయినవని ఐక్యరాజ్య సమితి రిపోర్టువలన తెలియు చున్నది. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో 1950 - 54 లో మాత్రమే ప్రాథమిక వస్తువుల గిరాకీ పెరిగి విదేశీ వ్యాపారము వెనుకబడిన దేశాలకు స్వల్ప అనుకూలతను కల్గించినది. కాని 1954 నుండి 1962 వరకు తయారైన వస్తువుల ధరలు 11 శాతము పెరిగి, ప్రాథమిక వస్తువుల ధరలు 14 శాతము తగ్గి తత్ఫలితంగా ప్రాథమిక వస్తువుల నెగుమతిచేయుదేశాల కొనుగోలు శక్తి 22 శాతము తగ్గినది.

**పెట్టుబడిదారీ దేశాల ఎగుమతి ధరల సూచికలు**

1958 = 100

| సంవత్సరము | మొత్తం వస్తువులు | ప్రాథమిక వస్తువులు | తయారైన వస్తువులు | ప్రాథమిక వస్తువులు, తయారైన వస్తువుల ధరల నిష్పత్తులు |
|---|---|---|---|---|
| 1954 | 99 | 109 | 93 | 117 |
| 1955 | 99 | 104 | 94 | 111 |
| 1956 | 101 | 105 | 98 | 107 |
| 1957 | 103 | 106 | 101 | 105 |
| 1959 | 99 | 97 | 99 | 98 |
| 1960 | 100 | 97 | 101 | 96 |
| 1961 | 99 | 95 | 102 | 93 |
| 1962 | 99 | 94 | 103 | 91 |
| నికర మార్పు 1954–1962 | | —14 శాతం | +11 శాతం | — 22 శాతం |

(ఐ. రా. స. ప్రచురణ ప్రకారం)

పాశ్చాత్య దేశాలయొక్క దిగుమతుల ధరలు (ప్రాథమిక వస్తువుల ధరలు) తగ్గడం వలన 1958 లో అమెరికా డాలరులు 736,000,000 లను; బ్రిటన్ 816,000,000లను; జర్మనీ 796,000,000లను; జపాన్ 502,000,000లను; అదనపు లాభాలుగా పొందినవి. 1952-60 మధ్య కాలంలో ప్రాథమిక వస్తువుల ధరలు తగ్గడం వలన ఆ వస్తువుల నెగుమతి చేయు దేశాలు 55,800,000,000 లను నష్టపోయినవి. ఒకవేళ ఈ దేశాలు తాము ముఖ్యంగా ఎగుమతి చేయు కాఫీ, కోకా, ప్రత్తి, వరి వస్తువుల ధరలను 1953-54 ధరలతో స్థిరంగా ఉంచగల్గిన 1951-61లో అదనంగా 10,400,000,000ల ఆదాయాన్ని సంపాదించి ఉండేవని ఒక ఆర్థిక శాస్త్రవేత్త అభిప్రాయపడినాడు. ఈ విధంగా వెనుకబడిన దేశాల శక్తి సంపద అంతా సామ్రాజ్యవాద పెట్టుబడి దారీదేశాలకు వంపబడింది.

ఈ విధంగా అభివృద్ధి చెందిన, చెందుతూ ఉన్న దేశాల మధ్య వ్యాపారం ఎల్లప్పుడూ అభివృద్ధి చెందిన దేశాలకు అనుకూలంగా ఉంటూ బ్రిటన్ 1955-60 లో పౌనులు 1,226,000,000

లాభాలను సంపాదించినది. తిరిగి ఈ లాభాలలో 570,000,000 లను అభివృద్ధి చెందుతున్న దేశాలకు అప్పుల రూపంలో గ్రాంట్ల రూపంలో అందించినది. ఈ గ్రాంట్ల వలన అప్పుల వలన ఏర్పడే ఆర్థిక ఫలితాలను వ్యాపారంలోని ప్రతికూల పరిస్థితులు రద్దు చేసినవి. చాలా దేశాలకు గ్రాంట్లవలన, ఆర్థిక సహాయం వలన పొందిన లాభము కంటె విదేశీ వ్యాపారంలోని ప్రతికూల పరిస్థితుల వలన వచ్చిన నష్టం ఎక్కువగా ఉంది. ఈ ప్రతికూల పరిస్థితులు ఆయాదేశాల ఆర్థిక శక్తులన్నింటినీ నాశనం చేసినవి.[3]

1975లో అమెరికా, జపాన్, యూరపు సమిష్టి విఫణి ఎగుమతులలో 1/4వ వంతుకంటె ఎక్కువగా దక్షిణదేశాలకు వెళ్ళాయి. యూరోపియన్ కమ్యూనిటీ కమిషన్ ప్రకారం దక్షిణ దేశాలతో వ్యాపారం వలన ఉత్తర దేశాలలో ప్రతి సం॥ 1973 నుండి 1977 వరకు అదనంగా 900,000 ఉద్యోగాలు కల్పింపబడినవని తెలియుచున్నది. 1981 వరకు దక్షిణ దేశాల విదేశీ వ్యాపారంలో లోటు 60 బిలియన్ల డాలర్ల వరకు పెరగవచ్చునని అంచనా వేయబడింది.[4]

ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడే పారిశ్రామిక మాంద్యం చమురు ధరల పెరుగుదల, 1980లో ప్రపంచ సంక్షోభానికి దారి తీస్తుందని, ఈ సంక్షోభం నుండి బయట పడుటకు క్రొత్త అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలను ఏర్పరచాలని అందుకుగాను ఉత్తర దేశాల కొనుగోలు శక్తిని కొంత దక్షిణ దేశాలకు బదిలీ చేయాలని చాలామంది ఆర్థిక శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ప్రస్తుత అంతర్జాతీయ వర్తక సంబంధాలు దక్షిణ దేశాల అభివృద్ధికి ప్రతికూలంగా ఉన్నవని, వాటిస్థానంలో తమ అభివృద్ధికి తోహదపడు న్యాయమైన సమానమైన వర్తక సంబంధాలను ఏర్పాటు చేయాలని, నైరోబీ, మనీలా, రోమ్, ఢిల్లీ, న్యూయార్క్, జెనీవా, పారిస్‌లలో జరిగిన అంతర్జాతీయ శిఖరాగ్ర సమావేశాలలో దక్షిణ దేశాలు చేసిన డిమాండ్‌కు వ్యతిరేకంగా సంఘటనలు జరుగుచున్నవి.

1930లలోని ప్రపంచ మాంద్యము, తదుపరి రెండవ ప్రపంచయుద్ధము తరువాత, ప్రపంచ దేశాలకు ఆర్థిక సహాయమును అందించుటకు, వినిమయరేట్ల నియంత్రణకు, ద్రవ్యోల్బణను అరికట్టుటకు ఏర్పడిన అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ అభివృద్ధి-పునర్నిర్మాణపు బ్యాంకువంటి అంతర్జాతీయ సంస్థలు తమఉద్దేశాలను నెరవేర లేకపోయినవి. పియర్సన్ కమీషన్ ప్రకారము 1950నుండి 1970 వరకు, అభివృద్ధి కొన్ని పారిశ్రామిక దేశాలకే పరిమితమై, ఆర్థిక అంతరాన్ని తగ్గించడానికి బదులు విస్తృత పరచినట్లు తెలియుచున్నది.[5] ఈ విషయాలన్నీ కూడా ప్రపంచ దేశాల అభివృద్ధికి, అన్ని దేశాల మధ్య సహకారమెంతో అవసరమని నిరూపించుచున్నది.[6]

క్రొత్త అంతర్జాతీయ సంబంధాల నేర్పరచుటకు నైతిక భౌతిక ఒత్తిడులు కలవు. ఆర్థికంగా ఆలోచించినట్లైతే పాత సంబంధాల పతనమే క్రొత్త సంబంధాల ఆవశ్యకతను ఏర్పరచినది. వెనుకబడిన అభివృద్ధి చెందుతున్న దేశాలు అవలంబించే రక్షణ విధానాలు, ధనవంతమైన దేశాలు తమలో తాము పరస్పరము మార్కెట్లను చాలాకాలం నిలుపుకోలేకపోవటం, అభివృద్ధి చెందిన దేశాలు ముఖ్యంగా అమెరికాలోని తిరిగి పూరింపలేని సహజసంపద తరిగిపోయి ఇతరదేశాలమీద ఆధారపడే పరిస్థితి ఏర్పడటము, పారిశ్రామిక దేశాలలోని వస్తువులను విక్రయించుకోవడానికి, అభివృద్ధి చెందని దేశాలలో కొనుగోలుశక్తిని పెంచలేకపోవడం, తగిన నష్టపరిహారం చెల్లించకుండా ఇంకా బీద దేశాల సహజ సంపదను దోపిడీ చేయుట క్షేమకరం కాకపోవడం మొదలైనవి, క్రొత్త సంబంధాల ఆవశ్యకతకు తోడ్పడినవి.[7]

ప్రపంచ దేశాల డిమాండును పురస్కరించుకొని 1974లో ఐక్యరాజ్యసమితి క్రొత్త అంతరాతీయ ఆర్థిక సంబంధాలను ఏర్పాటు చేయాలని తీర్మానించినది. ప్రపంచ దేశాలన్నీ ప్రపంచ సంపదను అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాల మధ్య సమానంగా న్యాయబద్ధంగా పునఃపంపిణీ చేయాలని నిర్ణయించుకొన్నవి. సమానత్వము, దేశాల సార్వభౌమాధికారమును పరస్పరం గౌరవించడం, అన్ని దేశాల మధ్య సహకారము, అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాలమధ్య అంతరాన్ని తొలగించడం, ఆదాయ అసమానతలను తొలగించుట, ఆర్థిక సాంఘిక అభివృద్ధిని త్వరిత పరచడం, ప్రస్తుత భవిషత్ తరాల ప్రజలకు శాంతి, న్యాయము సమకూర్చడం అనే అంశాలపై క్రొత్త సంబంధాలు ఏర్పాటు ఆధారపడినది.[8] పెట్టుబడులు కార్యక్రమాలు, వ్యాపారము పెట్టుబడులు, ఆర్థిక సహాయము మరియు ఋణము, ప్రపంచ ద్రవ్య సంస్కరణ, సాంకేతిక విజ్ఞాన బదిలీలు మొదలైన విషయాలను



జాతీయాభివృద్ధికి

ప్రధాని

## శ్రీమతి ఇందిరాగాంధీ

నూతన కార్యక్రమము



**శ్రీమతి ఇందిరా గాంధి**
ప్రధానమంత్రి

**శ్రీ టి. అంజయ్య**
ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ. టి. అంజయ్యగారి నాయకత్వంలో నూతన 20 అంశాల కార్యక్రమాన్ని దీక్షతో, సమధికోత్సాహంతో అమలు జరిపేందుకు ఆంధ్రప్రదేశ్ పునరంకిత మవుతున్నది.

# 20 అంశాల కార్యక్రమ వారోత్సవాలు

## 1982 ఫిబ్రవరి 1 నుంచి 7 వరకు

### పంచాయతిరాజ్ దినోత్సవం

**ఫిబ్రవరి 1, 1982**

- నీటిపారుదల సదుపాయాలు అధికం చేయడం,
- జాతీయ గ్రామీణ ఉపాధి కల్పన కార్యక్రమం అమలు.
- నీటి ఎద్దడి గ్రామాలన్నిటికీ మంచినీటి సరఫరా.

### వ్యవసాయ దినోత్సవం

**ఫిబ్రవరి 2, 1982**

- మెట్ట వ్యవసాయాన్ని అభివృద్ధి పర్చడం.
- పప్పుదినుసులు, నూనెగింజల అధికోత్పత్తి.
- సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాల అమలు.
- అడవుల పెంపకం, సామాజిక అటవీ పథకం, వ్యవసాయ అటవీ పథకాలను ముమ్మరం చేయడం,
- నిత్యావసర వస్తువుల పంపిణీ విధానాన్ని పటిష్టం చేయడం.

### సాంఘిక సేవల దినోత్సవం

**ఫిబ్రవరి 3, 1982**

- కుటుంబ నియంత్రణను ప్రోత్సహించడం.
- ప్రాథమిక ఆరోగ్య సౌకర్యాలు విస్తృత పర్చడం.
- కుష్టు, క్షయ, అంధత్వం నివారణ.
- బాలికల విద్యవల్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తూ, అందరికీ ప్రాథమిక విద్యా సౌకర్యాలు విస్తరింపచేయడం.
- వయోజన విద్యావ్యాప్తి.
- విద్యార్థులకు పాఠ్యపుస్తకాలు, నోటుపుస్తకాలు సరఫరా.

## పరిశ్రమల దినోత్సవం

**ఫిబ్రవరి 4, 1982**

- ప్రత్యామ్నాయ ఇంధన వనరులు, బయోగ్యాస్ అభివృద్ధి.
- పరిశ్రమలలో పెట్టుబడి పద్ధతులను సరళం చేయడం.
- పారిశ్రామిక విధానాలను క్రమబద్ధం చేయడం.
- చేతి వృత్తులు, చేనేత, చిన్నతరహా, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి.
- ప్రభుత్వ రంగ సంస్థల పని తీరు మెరుగు పర్చడం.

## బలహీన వర్గాల దినోత్సవం

**ఫిబ్రవరి 5, 1982**

- వెట్టిచాకిరి నుండి విముక్తి పొందిన వారి పునరావసం.
- షెడ్యూలు కులాలు, తెగల అభివృద్ధి పథకాలను ముమ్మరం చేయడం
- ఇళ్లు లేని గ్రామీణ పేదలకు ఇళ్ళ స్థలాల పంపిణీ
- గ్రామీణ పేదలకు గృహనిర్మాణ సహాయం విస్తృతం చేయడం.
- మురికి వాడలలో పరిసరాల పారిశుధ్య కార్యక్రమం అమలు.
- ఆర్థికంగా వెనుకబడినవర్గాలవారికి గృహనిర్మాణ పథకాలు అమలు.
- వ్యవసాయ కూలీలకు కనీసం వేతనాల అమలు.
- స్త్రీ, శిశు సంక్షేమానికి మరిన్ని పథకాల అమలు.
- పౌష్టికాహార పథకాలు ముమ్మరం చేయడం.

## భూముల పంపిణీ దినోత్సవం

**ఫిబ్రవరి 6, 1982**

- వ్యవసాయ భూ పరిమితిని అమలు చేయడం.
- భూమి రికార్డుల తయారు.
- భూముల ధర విపరీతంగా పెరగకుండా అరికట్టడం.

## నీటి పారుదల విద్యుచ్ఛక్తి దినోత్సవం

**ఫిబ్రవరి 7, 1982**

- నీటిపారుదల వనరుల అభివృద్ధి.
- విద్యుదుత్పాదన గరిష్టస్థాయి సాధించడం.
- విద్యుచ్ఛక్తి మండలి పనితీరును మెరుగుపర్చడం.
- గ్రామాలన్నిటికీ, విద్యుత్సరఫరా.

"సత్యమేవ జయతే" అనేదిమన జాతీయ సూక్తి. మన దైనందిన జీవితంలో 'శ్రమయేవ జయతే' అను మరో సూక్తి అనుసరించాలి. అవిరళకృషి సత్యాన్వేషణకు అంకితం కావడం ద్వారానే గౌరవం, ప్రగతి, సౌభాగ్యాలను సాధించగలం."

శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధాన మంత్రి.

---

Advt. No. 2

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

DIPR No. 2/Advt. I/C3/82

క్రొత్త ఏర్పాటు పరిశీలించును. ప్రపంచ వ్యాపారంలో పాల్గొను ముఖ్యమైన వస్తువులను సమీకరించి వాటి ధరలను, ఆ వస్తూత్పత్తి దేశాల ఆదాయాలను స్థిరీకరించుట, అభివృద్ధి చెందుతున్న దేశాల ఎగుమతులను ప్రోత్సహించి వ్యాపార అడ్డంకులను తొలగించుట, వ్యాపారంలోని ప్రతికూల పరిస్థితుల వలన ఏర్పడిన నష్టాలకు ప్రతిగా ధనవంతమైన దేశాలనుండి బీద దేశాలకు పెట్టుబడి, మూల ధనమును తరలించుట, పారిశ్రామిక దేశాల చర్యలవలన తగ్గిపోయిన ద్రవ్య సహాయమును తిరిగి ఎక్కువ చేయుట. పారిశ్రామిక దేశాలు తమ జాతీయాదాయంలో 0–7 శాతమును బీదదేశాలకు సహాయం రూపంలో అందించుట, పెరుగుతున్న అంతర్జాతీయ ఋణభారాన్ని ఉపశమించుట, అంతర్జాతీయ ద్రవ్యనిధిని సంస్కరించి ప్రత్యేక ఋణం ఏర్పాటుం (ఎస్ డి ఆర్) లను అభివృద్ధికర ద్రవ్యానికి సంబంధాన్ని కల్పించి వాటిని బీదదేశాల అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించుట, దేశాల మధ్య సాంకేతిక అంతరాన్ని తగ్గించుటకై సాంకేతిక విజ్ఞానాన్ని అభివృద్ధి చెందిన దేశాలనుండి బీద దేశాలకు బదిలీ చేయుట, మల్టీనేషనల్ కార్పొరేషన్‌ల యొక్క కార్యకలాపాలను పరిమితం చేయుట, మొదలైనవి ఈ క్రొత్త అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలలోని అంశాలు.[9]

ఐ. రా. స. వాతావరణ రక్షణ సంస్థ, ఐ. రా. స. వాణిజ్యం - అభివృద్ధి సంస్థలు మెక్సికోలోని కొకాయక్ వద్ద 1974 అక్టోబరులో ఏర్పాటు చేసిన సదస్సులో ప్రపంచ దేశాల ఆర్థిక శాస్త్రవేత్తలు పాల్గొని, వలస విధానమే బీదదేశాలు, ధనవంత దేశాలమధ్య ఆదాయసంపద వ్యత్యాసాలను విస్తృత పరచుటకు, 3 వంతుల సంపద, పెట్టుబడి మరియు మొత్తం పరిశోధనలు ఒకవంతు ప్రపంచ ప్రజల అధీనంలో ఉంచుటకు, కారణంగా పేర్కొన్నారు.[10]

1970 తరువాత ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అనేక మార్పులేర్పడినవి. అవి చమురు ధరలలో విపరీతమైన పెరుగుదల, ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడే మాంద్యము, డాలర్ సంక్షోభము, సామ్యవాద మార్కెట్ పటిష్టంగా తయారై పెట్టుబడి దారీ మార్కెటుకు పోటీగా నిలుచుట మొదలైనవి. వర్తక నిబంధనలు నిర్ణయించడంలో ఏకస్వామ్య అధికారానికి బదులు ద్వంద ఒప్పందాలు ఏర్పడుట, పెట్రోలు ఉత్పత్తి చేసే అరబ్ దేశాల చర్యలు, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రత్యామ్నాయ దేశీయ పరిశ్రమల ప్రోత్సాహము అందుకు రష్యా అందించే ఆర్థిక సాంకేతిక సహాయము మొదలైన విషయాలు క్రొత్త సంబంధాలు ఏర్పడుతున్నవనటానికి గల కారణాలు.

ఈ మార్పులన్నియూ వ్యవస్థలో క్రమానుగతంగా ఏర్పడే పరిణామాలే కాని వీటిని ఏ అంతర్జాతీయ సంస్థకూడా ఒకేసారి అమలు చేయలేదు. పైగా ఈ అంతర్జాతీయ సంస్థలు నిష్పక్షపాతంగా వ్యవహరిస్తాయనడానికి వీలులేదు. ఈ అంతర్జాతీయ సంస్థల కార్యకలాపాలలో ఎన్నో వృద్ధి నిరోధక రాజకీయ శక్తులు పనిచేస్తాయనడంలో ఆశ్చర్యంలేదు. ఒకవేళ ఈ సంస్థలు అంతర్జాతీయ సంస్థలుగా అన్ని దేశాలకు వర్తించే సంస్థలుగా పనిచేయగలిగిన, ఈ క్రొత్త మార్పులను క్రమబద్ధం చేయుటకు, త్వరితం చేయుటకు తోడ్పడగలవు. ఈ క్రొత్త ఏర్పాటు పూర్తి ఉద్దేశాలు నెరవేరిన అభివృద్ధి చెందుతున్న, చెందిన, దేశాల పురోగతికి, ప్రపంచ సంక్షోభ విముక్తికి తోడ్పడగలదు అని చెప్పవచ్చును.

విదేశీ సహకారంతో ముఖ్యంగా సామ్యవాద దేశాలు అందించే సహాయంతో, అభివృద్ధి చెందుతున్న దేశాలు తమలో తాము సహకరిస్తూ స్వయం సమృద్ధిని అన్ని రంగాలలో సాధించి, వృద్ధి ఫలితాలను ప్రజలందరికీ సమానంగా అందించగలిగిన నాడే క్రొత్త ఆర్థిక సంబంధాలు ఏర్పడినవని చెప్పవచ్చును.[11]

## ఆధ స్సూ చి క లు


1. బో సోడర్‌స్టెన్–ఇంటర్నేషనల్ ఎకనామిక్స్, పుటలు 14–15.
2. వి. ఆర్ పంచముఖి–యోజన, జనవరి 1, 1981సం. 24 పు 9.
3. ఎ. క్రుమ్‌కన్–మోడర్న్ ఎకనామిక్ థియరీస్ ఆఫ్ ఇంటర్నేషనల్ ఎకనామిక్ రిలేషన్స్–పుటలు 133–137.
4. "నార్త్–సౌత్ :ఎ ప్రోగ్రామ్ ఫార్ సర్వయివల్", రిపోర్ట్ ఆఫ్ ది ఇండిపెండెంట్ కమీషన్ ఆన్ ఇంటర్నేషనల్ డెవెలప్‌మెంట్ ఇష్యూస్, పాన్ బుక్స్, లండన్, 1980 పు. 304.
5. డా. బి. నటరాజన్–యోజన, జనవరి 26, 1980, పు 13.
6. – అదే – పు 13
7. – అదే – పు 5
8. ఆల్‌బరుట్ ఫిష్‌లో, కార్లోస్ ఎఫ్‌డయాడ్–అల్జాండో, రిచార్డ్ ఆర్. ఫాగిన్, రాజర్ డీ. హాన్సెన్–"రిచ్ ఎండ్ పూర్ నేషన్స్ ఇన్ ది వరల్డ్ ఎకానమి" పు 11.
9. మాల్‌కమ్ ఎస్. ఆదిశేషయ్య – యోజన, 26 జనవరి, 1980 పు 5.
10. ది కోకోయోక్ డిక్లరేషన్, వరల్డ్ ఎకనామిస్ట్స్ డిమాండ్.
11. ఆర్. సి. దత్–ఇండియా జి డి ఆర్–సం 2, జూన్, 1980. పు 11.

# శివాలాపము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

మ॥ అఘసంతాన మహాంధకార విధుర వ్యాపార దీపమ్ము కా
మఘనోద్యద్విషవల్లికా పటుతమ శ్రీ ఖడ్గరాజంబు దుః
ఖ ఘనాక్రామిత మానసాంబర చలద్గాఢానిలంబున్ మదా
ది ఘటాటోపనివార కేసరి భవద్దివ్యత్కృపా శ్రీ! శివా!!

శా॥ నీవే తల్చితివేని మూకునకు తండ్రీ! దివ్య చైత్రాగమ
శ్రీవేళా మధుకోశ పాతిత రసశ్రీస్నిగ్ధ మాధుర్య ధా
రా వక్షోదయ కల్ప మంజుల నవార్థ ప్రౌఢ సాహిత్య శ
య్యా వైభోగము కంఠ భూషణముఁగాదా? గాంగజూటా! శివా!!

శా॥ నీవే తల్చితివేని ఘోర దురితాంధీ భూత సంసార బం
ధా విర్భూత విమూఢ భావన కళాహంకార జీమూత కే
ళీ వైగుణ్య మహాంధకార నటనల్ నిర్ధూతమై ముక్తి వాం
ఛావిస్ఫారిత చిత్ప్రకాశ మెదలన్ సంధిల్లునయ్యా! శివా!!

శా॥ హుంకారంబులు క్షుద్ర మన్మథ ప్రభావోదగ్ర రేఖా ధను
ష్టంకారంబులకు న్నిరంతర మనస్సంఛన్న బోధేతర
క్రేంకారంబులకున్ పురాకృత తరంగీ భూత పాపౌఘ దు
ర్ఘాంకారంబులకుం ద్వదీయ పదకంజాతాగ్ర కాంతుల్! శివా!!

శా॥ లోకమ్మెట్టుల జరించుచున్నదియొ యాలోకించినావే! మహే
శా! కాఠిన్యము లంతరంగములలో స్వార్థక్రియల్ బుద్ధిలో!
నైకోద్రిక్త దురంతభావ ఘటనాంతర్భూత దాహచ్ఛటా
నీ కమ్మర్పగరావె! దివ్యతటినీ నిర్నిద్ర జూటా!! శివా!!

శా॥ నీ పాదమ్ముల యాన నిక్కము సుమీ! నీ నామమాధ్వీక ధా
రాపానోద్ధత ముక్తివాంఛ కలనా రాగాంకుర ప్రౌఢిమ
శ్రీపారంగత బుద్ధిఁ దక్క పరముంజింతింప దుర్మోహ సం
తాప ప్రాభవ దుఃఖముం జిదుపుమన్నా!! వ్యోమ కేశా!! శివా!!

శా॥ స్వః కాంతాకర పద్మ సంగ్రహణ నిష్ఠాభావముం గాని - స
ద్యః కళ్యాణ మిహైక భోగచయ భాగ్యానీకముంగాని - తే
జః కైవల్యదమూర్తి! కోరను సదా జన్మాగతం బౌమదే
నః కూలంకష వీచి నీధు తలపైనం గట్టవయ్యా! శివా!!

శా॥ స్పష్టా స్పష్టము జ్ఞానరేఖలవియున్ భాసించు వెన్కన్ కృధా
వష్టంభోజ్వల మోహ ముల్‌నిలుచు ఘోరాకారమై రెంటికిన్,
ముష్టాముష్టి కచాకచీ యెడదలో మోహాంధమున్ త్వన్మహా
దృష్టిం బాఱగఁద్రోలి కాంతిచయమీవే! యంధకారీ! శివా!!

శా॥ బీటల్ విచ్చిన పంట చేనుగతిఁ గన్పించున్ మహాగర్వ గ్రీ
ష్మాహోపంబున నిష్ఫలంబగునా! దేవా! నాదు పెంపెల్లత్వ
జ్జాటాజూటు విని:శుతామర ధునీ సంభార ధారా నిరా
ఘాటైకక్రమ సత్కృపం దడుప సంకల్పింపవయ్యా!! శివా!!

శా॥ వైచిత్ర్యంబిదియేమొ! కోరికలు దేవా! దావదాహచ్ఛటా
వీచీకేళి ఘటించు నాఱ్పగమటిన్ విశ్రాంతిఁ జల్లారి న
ల్లే చల్లారియు ధూమసంగత శిఖాలీనంబులై గుప్పునం
జాచు న్నాల్కలు! వీనినాఱ్పవె! దయాసారాంబుధారన్! శివా!!

శా॥ ఆక్రోశించుచునుంటి నిట్లుగనవయ్యా! పార్వతీనాథ! కా
మక్రోధంబుల నెంతమాపిన తలంబాదంగ పుచ్ఛాంత ముం
జక్రాకారముఁద్రిప్పు ఘోర విషభుక్ సామ్యమ్ములౌ తన్మహా
విక్రాంతిం దొలగింపవే! భుజగ సంవిశ్లేషకంఠా! శివా!!

శా॥ నేత్రంబుల్ విడుసమ్మదాశ్రులు హిమానీ శైత్యమై గుండెపై
చైత్రశ్రీ మధుధారవోలె కురియున్ స్వామీ! భవద్దర్శన
స్తోత్రంబుల్ ఘటియించు వేళ నెడదం దూగాడు వైరాగ్య పుం
జిత్రార్చిస్సులుఁ బుల్కరింతవొడలం జెన్నొందునయ్యా! శివా!!

శా॥ నీవు న్నిల్చిన చోటు వెండిమలయౌ! నీ నవ్వు కార్తీక రా
కా విశ్వామల కాంతియే యగును నీ కారుణ్యముల్ వర్ష ధా
రా విర్భూత పృషత్తుషారకలనాంతశ్శైత్యముల్ త్వత్క్రుధల్
దావాగ్నిచ్ఛటలై వెలుంగు! గిరిజాలావణ్యలోలా! శివా!!

శా॥ వైముఖ్యంబు ఘటిల్లు లౌక్యవిషయ వ్యాపారముల్ పల్క - తత్
శ్రీమద్భావము సుంత నిల్వదు తటిద్రేఖాప్రభాభాసమై
స్వామీ! వెన్క మహాంధకారము సృజింపం జిత్రమయ్యా కనుల్
తా, మూయంగను, విచ్చినం దిమిర సంతానమ్మెఁ దోచున్ శివా!!

శా॥ జ్ఞానుల్ త్వద్గత దివ్యభావ సుషమా సంప్రాప్త కళ్యాణ సం
ధానిత్యోత్సవ మబ్బియుండెదరు! నేనా? గాఢ జీమూత వే
ళా నిశ్శేష తిరస్కృతామృత కళాగ్లౌమూర్తినయ్యా! ప్రభా
పౌనఃపున్యనిఁగా నొనర్చి తలపై పండించుకోవా? శివా!!

(నా అముద్రిత "శివాలాపము" నుండి)

# వాల్ పోస్టర్లు

## (ప్రయోగాత్మక రూపకం)

తమిళ మూలం : శ్రీ న. ముత్తుస్వామి
తెలుగు సేత : శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
శ్రీ పి. సభాపతి.

భారతీయ సాంప్రదాయాన్నీ, ఆధునిక పాశ్చాత్య భావాల్నీ సమన్వయ పరుస్తూ, మనోహరమైన వివిధ ధ్వన్యర్థాలు స్ఫురింపజేస్తూ, అందరికీ అర్థమయే సర్వ సాధారణమైన భాషలోనడిచే అస్తిత్వవాద ప్రధానమైన ప్రయోగాత్మక రూపకం ఈ "వాల్ పోస్టర్లు". తమిళ భావుకుల దృష్టి నాకర్షించిన అత్యాధునిక రచన ఇది.

సూత్రధారి, ప్రేక్షకుల్లో కలిసిపోయి కూచుని ఉండే మరి కొన్ని పాత్రలూ కలిసి నడిపే ఈ నాటిక వెలుగు నీడలతో కూర్చిన ఒక విచిత్ర సృష్టి! ఉత్తమ,మధ్యమ, ప్రథమ పురుషల్లో "నేను", "నువ్వు", "వాళ్ళు" అంటూ ఒకే మూసలో నిస్సారంగా రోజులు దొర్లిస్తున్న, ఆత్మ నాశం పొందిన నేటి సగటు మనిషి చైతన్యానికి ప్రతీకలు ఇందులోని పాత్రలు.

తమిళంలో 30 పైచిలుకు చిన్న కథలూ, ఇలాగే వ్యంగ్య ప్రధానమైన మరి మూడు నాటికలూ వ్రాసిన న.ముత్తుస్వామి "ఎళుత్తు"అనే సాహిత్య పత్రిక ద్వారా మొదట వెలుగులోకి వచ్చారు. "తెరుక్కూత్తు" (వీధి నాటకం) ప్రాచీన తమిళ నాటక రంగావశేషమని భావించే ఈ రచయిత వ్రాసిన తక్కిన మూడు నాటికలూ : 1. నార్కాలిక్కారన్(కుర్చీలో కూచున్నవాడు), 2 కాలం కాలమాగ (తరతరాలుగా), 3. తగప్పనుం, తనయనుం (తండ్రీ–కొడుకూ). "క్రియ", 268, రాయపేట హైరోడ్, మద్రాసు-14, అనే ప్రచురణ సంస్థ ఈ నాటికలు ప్రచురించింది.

## 1

[చంకలో వాల్ పోస్టర్ల కట్టతో, చేతిలో జిగురు బకెట్‌తో ఒకతను ప్రేక్షకుల ముందు వచ్చి నిలబడతాడు. నేపథ్య సంగీతం వేదమంత్రంలాగ గంభీరంగా వినిపిస్తూంటుంది.]

"నోటీసులు అతికించ కూడదు
నోటీసులు అతికించ కూడదు
కాదని ఎవరైనా అతికించారా
ఖాయం వాళ్ళకి దండన !"

[జిగురు బకెట్‌తో నేలమీద పెట్టి, వాల్‌పోస్టర్ల కట్ట విప్పి, ఒక పోస్టర్ తీసి దానికి బాగా జిగురు రాసి అతికిస్తాడు. వాల్ పోస్టర్ల కట్టతోనూ, జిగురు బకెట్ తోనూ అతను వస్తూ ఉండడం చూసి, పక్కల్నించీ, ముందు నుంచీ అన్నివైపుల నుంచీ వచ్చి, చాలా మంది అతని చుట్టూ మూగుతారు. అలా వాళ్ళు రావడం- అతను వాల్ పోస్టర్ల కట్టతో వచ్చిన దగ్గిర్నించే ఆరంభమై జిగురు పూసి పోస్టర్ అంటించి వెళ్ళిపోయేవరకూ క్రమ క్రమంగా జరుగుతూ ఉంటుంది. అతను పోస్టర్ అంటించి కొంచెం దూరంలో నిలబడి అన్ని కోణాలనుంచీ ఆ పోస్టర్‌కేసి చూసి ఆ తర్వాత అక్కణ్ణించి వెళ్ళిపోతాడు. అతని చుట్టూ మూగిన వాళ్ళందరూ అచ్చం ఒకే మూసలో పోసినట్టు ఉంటారు. ఆకారాన్ని బట్టి వేర్వేరు వయస్సుల వాళ్ళుగా కనిపించినా, అందరి తీరూ ఒక రకంగానే ఉంటుంది. ఒకేతీరుగా ఉన్నా వయః పరిణతి దశల వల్ల కొంత తేడాగానూ కనిపిస్తూంటారు. వాల్ పోస్టర్‌లో ఇలా ఉంటుంది.]

ఈ సాయంత్రం ఆరుగంటలికి
న. ముత్తుసామి రాసిన "వాల్‌పోస్టర్లు"
వీధి నాటకం ప్రదర్శించబడుతుంది
స్థలం : మిట్ట వీధి. ప్రవేశ రుసుం : ఉంది
ఎల్లరూ రండి ! గుంపులు గుంపులుగా రండి !
ఉడుపులతో నగలతో రండి !
దిశమొలలతో తిరిగే ఊళ్ళో ఉడుపులుదాల్చిన వాళ్ళు
పిచ్చివాళ్ళు అని తెలుసుకుని
బుద్ధిమంతుల్లాగ రండి !

[అందరూ గుమిగూడి చదువుతూ ఉంటారు. చదివిన వాళ్ళ మనస్సుల్లో పోస్టర్లోని మాటలే తిరిగి తిరిగి ప్రతిధ్వనిస్తూంటాయి. ప్రతివాడూ పక్కవాడి గుండెకి చెవి ఆనించి రహస్యం విన్నట్టు ఆ ధ్వనులు వింటూ ఉంటాడు. చెవి ఒగ్గి విన్నవాడు ఆ తర్వాత అవతలి వాడికి తన గుండె ఇస్తూ ఉంటాడు. గుండె ఇచ్చినవాడు చెవి ఒగ్గి వింటూ ఉంటాడు. తర్వాత మళ్ళీ చెవి ఒగ్గి విన్నవాడు తన గుండె ఇస్తూ ఉంటాడు. ఇలా మార్చి మార్చి వింటూ ఉంటారు. ఈ మారడం పలు భంగిమల్లో పలు రీతుల్లో సాగుతూంటుంది. క్లబ్ డాన్స్ (నవీన నటనం) లాగ నడుస్తుంది. వాల్ పోస్టర్ లోని మాటలు మాటి మాటికీ కర్మకాండలో మంత్రాల్లాగ, నాట్యానికి నేపథ్య సంగీతం లాగ వినిపిస్తూ ఉంటాయి. చెవి ఒగ్గి వినేవాడికి గుండె ఇచ్చేవాడు తన మనస్సులోని మాటలు వాడికి వినిపిస్తున్నట్టు ఆ మాటలకి తగినట్టు అభినయం చేస్తూ ఉంటాడు.]

ఈ సాయంత్రం ఆరు గంటలికి న. ముత్తుసామి
రాసిన "వాల్ పోస్టర్లు" వీధి నాటకం
మిట్ట వీధిలో ప్రదర్శించబడుతుంది.
ఎల్లరూ రండి!
మిట్ట వీధికి రండి!
గుంపులు గుంపులుగా మిట్ట వీధికి రండి!
ఉడుపులతో నగలతో గుంపులు గుంపులుగా
బుద్ధిమంతుల్లాగ రండి!
దిశ మొలలతో తిరిగే ఊళ్లో బుద్ధిమంతుల్లాగ రండి!
ఉడుపులు దాల్చేవాడు పిచ్చివాడు
ఉడుపులు దాల్చేవాడు పిచ్చివాడు
ఉడుపులు దాల్చేవాడు దిశమొలలతో తిరిగే ఊళ్ళో
పిచ్చివాడని తెలుసుకుని
బుద్ధిమంతుల్లాగ రండి!
ఎల్లరూ బుద్ధిమంతుల్లాగ గుంపులు గుంపులుగా
మిట్ట వీధికి రండి!

[అలా అభినయం చేసి తరువాత విడిపోతారు. విడిపోయేటప్పుడు కూడా వాల్‌పోస్టర్‌లో మాటలే మనస్సులో తిరిగి తిరిగి ప్రతి ధ్వనిస్తున్నట్టు మనస్సులోని ఆ మాటల్ని అస్పష్టంగా గొణుక్కుంటూ విడిపోతారు. ప్రాచీన, ఆధునిక నాట్య విన్యాసాల ద్వారా అవి వాళ్ళ మనస్సులోని మాటలని అర్థమయ్యేట్టు చేస్తారు. చివరి మూడు లైన్లూ తిరిగి తిరిగి పునశ్చరణ చేస్తూ ఒక్కరొక్కరుగా, ఇద్దరిద్దరుగా, గుంపులు గుంపులుగా ఆ మాటల ఉచ్చారణ కనుగుణంగా అడుగులువేస్తూ వెళ్ళి పక్కసీట్లలో ప్రేక్షకుల్లాగకూచుంటారు.]

## 2

[వెనకటి సీనులో పోస్టరు అతికించిన వ్యక్తి ఇప్పుడు ప్రేక్షకుల ముందు నిలబడి ఉంటాడు. నాటకానికి ఇతను సూత్రధారి. వెనుకటి సీనుకీ, ఈ సీనుకీ మధ్య దీపాలు ఆరిపోవు. వెలుగుతూనే ఉంటాయి.]

సూత్రధారి : సోదరులారా! సోదరీ మణులారా!

ఒకతను : (మొదటి సీనులో తండాలు తండాలుగా వెళ్ళి పక్క సీట్లలో ప్రేక్షకుల్లాగ వెళ్ళికూచున్న వాళ్ళలో ఒకడు ఇతను. తనలాగే వచ్చికూచున్న ఇంకొకడితో) యారురా ఈన? మన్ని సోధర్లూ, సోధరీమణ్ణు అంటుంటాడే యారు ఈన?

అతను : (సూత్రధారితో) యారయ్యా నువ్వు?

సూత్రధారి : నేను యారా?

ఇంకో అతను : ఔను.... యారు నువ్వు?

సూత్రధారి : భేష్! బాగుంది (ప్రేక్షకుల నుద్దేశించి) ఏంవిటండీ ఈ చిత్రం? (అతనితో) నేను యారా?

మరొకతను : ఔను.... ఔరు నువ్వు?

సూత్రధారి : నేను అ(ప్)రుని కాను. నేను ఎనిమిదిని. ఎనిమిది దిక్కుల్ని నేను. అష్టదిగ్గజాల్ని నేను. అష్టదిక్పాలకుల్ని నేను. భూమిని అరచేతిలో పెట్టుకున్నవాణ్ణి! కనిపించని నల్లని దారం సాయంతో తెంమీద బొమ్మలాడించే బొమ్మలాటవాణ్ణి నేను. నా ఇష్టానుసారం బొమ్మలు ఆడి ఆడి, తర్వాత తమ ఇష్టానుసారం నన్ను ఆడించడం మొదలుపెట్టి, మధ్యలో దారం తెగిపోగా, అందరమూ బొమ్మలమై పోయి, మాలో ఒకణ్ణి మీ చెలిమి ఆశించి మా బొమ్మలు పంపించగా వచ్చినదూతను నేను. చలనం కలిగి ప్రాణంవచ్చి మనుషులుగా మారిన ఆ

బొమ్మల సంఘానికి పెద్దని నేను. (రవ్వంత ఆగి) నువ్వెవరు ?

ఇంకో అతను : (కోపంగా) మరేదగా మాట్టాడు ! సభ అనే గౌరం నేకండా ఏక వశన ప్రెయోగం సేత్తుండావే- యారు నువ్వు? మరేదగా మాట్టాడ్డం నేర్సుకో.... కబడ్దార్ !

సూత్రధారి : నేర్చుకోకపోతే ?

వాళ్ళందరూ : గౌరం ఇయ్యాల ! గౌరం ఇయ్యాల ! (గలభా చెలరేగుతుంది. వీళ్ళలాగ ముఖాలు తిర్చ బడ్డవాళ్ళు ప్రేక్షకుల్లో అక్కడోడూ, అక్కడోడూ కూచుని ఉంటారు. వాళ్లే ఈ గలభా లేవదీస్తూ ఉంటారు)

సూత్రధారి : (ప్రేక్షకుల వేపు చేతులు సాచి) సైలెన్స్ ! సైలెన్స్ ! నిశ్శబ్దంగా ఉండండి. ఏమీ కాలేదు. నిశ్శబ్దంగా ఉండండి. వీళ్ళంతా ఇక్కడ తెచ్చి- నాటబడ్డ బాపతు. ముందుగానే ఆలోచించి నాటబడ్డ గుంపు వీళ్ళు. నాటకం సాగనివ్వకుండా మధ్యలో అంతరాయం కలిగించడం కోసం ఏర్పాటు చేసిన అల్లరి మూకలా కనిపిస్తున్నారు వీళ్ళు !

ఒకతను : (ప్రేక్షకుల మధ్యలో ఉన్నవాడితను. లేచి ముందుకి వచ్చి) వాళ్ళు తెచ్చి నాటబడ్డ వాళ్ళయితే అలా నాటబడకుండా వచ్చిన మేమూ ఉన్నాం సభలో ! మేం కూడా నాటకం చూడ్డానికి వచ్చిన వాళ్ళలో ఉన్నాం !

ఇతనిలాంటి వాడు మరోడు : ఔను.... మేమూ ఉన్నాం- ఈ ప్రేక్షకుల్లో !

పక్క సీట్లలో వాళ్ళలో ఒకడు : మీ అంతటమీరే మొలుసు కొచ్చారా ?

వీళ్ళలో ఇంకోడు: అసల్నన్ను పికితే నాటితే పెరిగేదే పైరు·

వీళ్ళలో మరోడు : నాటకండా పెరిగేదంతా కలుపు.

వీళ్ళలో కొందరు : ఇక్కడ పైరు ఎదగాలంటే కలుపు మొక్కలు పీకెయ్యాల !

వీళ్ళలో మరికొందరు: పైరు పెరగడానికి కలుపు తియ్యాల!

(ప్రేక్షకుల్లో అలాంటి వాళ్ళంతా మళ్ళీ గలభా లేవదీస్తారు)

సూత్రధారి : సైలెన్స్ ! సైలెన్స్ ! (రెండు పక్షాలవారినీ ఉద్దేశించి) అయ్యా ! నాటకాన్ని మీ చేతుల్లోకి తీసేసుకోకండి ! సైలెన్స్-సైలెన్స్ !

ఇద్దరు : (ప్రక్క సీట్ల వాళ్ళలో ఒకడూ, ప్రేక్షకుల మధ్య నించి ఒకడూ లేచి ఏక కంఠంతో) ఇదేమరి నాటకంలో ప్రేక్షకులు పాలుపంచుకోడం అంటే !

సూత్రధారి : నాటకం ఇక్కడ నడవనివ్వండి ! అక్కడ నడిపించడం మొదలు పెట్టకండి ! కట్టుబాటుకి భంగం ఏర్పడుతుంది. రసాభాసం అయిపోతుంది. రంగస్థలం మీద నడిచేదే నాటకం అనిపించు కుంటుంది.

పక్క సీట్ల వాళ్ళలో ఒకడు : అక్కడా నడుస్తుంది- ఇక్కడా నడుస్తుంది.

ప్రేక్షకుల్లో ఒకడు : ప్రేక్షకుల వాటాకి వచ్చినంత వరకూ ఇక్కడ కూడా నడుస్తుంది.

సూత్రధారి : (పక్కకి తిరిగి) లైట్లార్పెయ్-లైట్లార్పెయ్ ! మొదలు పెట్టిన వేళా విశేషం మంచిది కాదు. లైట్లార్పెయ్ ! (లైట్లు ఆరిపోవు)

## 3

సూత్రధారి : (వెలుతురులో ఉంటూనే చీకట్లో ఉన్నవాడి లాగ భావించుకుంటూ మాట్లాడుతాడు)

(తనలో) చీకట్లో ఉన్నవాడు తన స్పృహలో తను ఉన్నవాడు. చూపు తప్ప తక్కిన ఇంద్రియాలన్నీ చక్కగా పనిచేస్తూ ఉండేవాడు. చీకట్లో తనని ఎవరూ చూసే వీలు లేనందువల్ల ఇష్టం వచ్చినట్టు పెకిలి చేష్టలు చేస్తూ వెక్కిరిస్తూ మాట్టాడే అవకాశం ఉన్నవాడు.(ప్రేక్షకుల్ని ఒకసారి వెక్కిరించి) (ప్రకాశంగా) ప్రేక్షక మహాశయులారా ! నాటకం ఆరంభమైన తీరు బాగాలేదు. ఎత్తుకునే ఎత్తుకోడంలోనే ప్రేక్షకులు నాటకంలో పాల్గొనడం ఎలాకుదురుతుంది? అసలు నాటకం దేన్ని గురించో తెలియనప్పుడు ఎలా

పాలు పంచుకోగలరు ? నిజానికి – లైట్లువెలిగాకే నేను మాట్లాడాలి. కాని మీరు నన్ను వదిలేత్తేగద ! నాటకం ఆరంభమైంది గదా అని పాలుపంచుకోడానికి వస్తే నేనేంవిటి చెయ్యడం ? అందుకని – చీకట్లో ఉండే మాట్లాడుతున్నాను. మీరూ చీకట్లోనే ఉండండి. విడివిడిగానే ఉండండి. అంగ బలంలేదే అని బక్కచచ్చి పడి ఉండండి. మనుషుల్నిచూస్తే ఎగిరెగిరి పడే సముద్రంలాగ పక్కన మనిషి కనబడ గానే ఎందుకలా విర్రగబడిపోతారు? మీ పక్కవాడు మీ మనిషి కాడు-జాగ్రత్త! కూలికి తెచ్చి ఆ మనిషిని మీ పక్కన కూచోపెట్టి ఉండచ్చు. నిజం అందరికీ తెలుసు- మాట్లాడకండి ! మీ ఇష్టం ఇక్కడ పనికి రాదు. ఊరేగింపులో కూలికి తెచ్చిన మనుషులు, నినాదాలు చెయ్యడానికి కూలి మనుషులు ! వేదిక మీద కూలి మనుషులు ! ఒకళ్ళ ఆలోచన ఒకళ్ళకి అర్థం అయ్యే వీలులేక పోడమే అన్నిటికీ మూల కారణం. పార్టీ వాడే కూలివాడుగా మారిపోవడం తప్పనిసరి అయ్యే డబ్బు ఇబ్బందులూ ఏర్పడవచ్చు. చెవుల్లేకపోయినా రహస్యాలు వినే కీచురాళ్ళు ఉంటాయి. మీ మాటలు వింటూ ఉంటాయి. ఒక్క మాట పొల్లు పోకుండా కంఠపాఠం చేస్తూ ఉంటాయి. కిళ్ళీ కొట్లొ వినోదం చూస్తున్నట్టు నుంచున్న ఖాతా దార్ల లో ఒకడు కూలి ఇచ్చి తెచ్చిన మనిషి ! కొట్లొ సోడా బుడ్లున్నాయి. దాపరికం లేకుండా పైకి కని పిస్తూనే ఉన్నాయి. ఖాతాదారుల్లో ఒకడుగా కలిసి పోయి మరోడుకూడా ఉంటాడు. వాడు ఎదిరి పక్షం వాడు కావచ్చు ! సమయం రాగానే రంగంలో దూకేందుకు సిద్ధంగా బుద్ధిమంతుడులాగ నుంచుని ఉంటాడు. అలాంటివాళ్ళు ఈ ప్రేక్షకుల్లోనూ ఉండొచ్చు ! బొడ్లో సోడా బుడ్లు దోపుకుని వచ్చి ఉండొచ్చు ! (పక్కకి తిరిగి) ఇప్పుడు వెయ్యి లైట్లు ! (లైట్లు కొత్తగా వెలగవు. వెనకటి లైట్లే వెలుగుతూ ఉంటాయి.)

# 4

సూత్రధారి : (ఇప్పుడు వెలుతురులో ఉన్నవాడి లాగే మాట్లాడుతాడు) ప్రేక్షకులందరికీ నమస్కారం !

పక్కన కూచున్న వాళ్ళలో ఒకడు : ముందు మా యెనకటి పెశ్నకి జవాబు సెప్పు !

ఇంకోడు : యెవరు నువ్వు ! సెప్పు !

వేరొకడు : నువు యెవరు – సెప్పు !

మరోడు : యెవర్నువ్వు ? నాటకానికీ, నీకూ యేంటి సంబందం ? సెప్పు !

సూత్రధారి : అబ్బబ్బబ్బ ! .... ఏంవిటీ గోల ? "ఎవరు నువ్వు ?" అని నన్ను నిలదీసి అడిగేందుకు ఏం సందర్భం ఇప్పుడు ?

పక్కన కూచున్న వాళ్ళలో ఒకడు : నాటకంతో మాకు వున్న సంబందంవే సందర్బం. యెవర్నువ్వు ? సెప్పు ?

సూత్రధారి : ఉన్నట్టుండి "ఎవరు నువ్వు ?" అని నిల దీస్తారే- ఇందులో ఏమైనా సబబుందా ? (ప్రేక్ష కుల వేపు చూసి) అయ్యా ! సబబూ సందర్భం లేకుండా ఉన్నట్టుండి ఎవరు నువ్వు అంటారేమి టయ్యా అని వీళ్ళని చివాట్లు వెయ్యండి ! (తనలో) డైలాగేదైనా దాటేశానా ? (పక్కకి తిరిగి) ఎవరు వీళ్ళు? మనం తెచ్చి నాటిన వాళ్ళేరి? మన పథకంలో ఈ బెజ్జం ఎలా వచ్చింది ?

లోపల్నించి ఒక గొంతు : పథకంలో బెజ్జం ఎక్కడా లేదు.

సూత్రధారి : (ఆ గొంతునుద్దేశించి) మరి ఇలా కారి పోతూందేం ?

లోపల్నించి గొంతు : బెజ్జమూలేదు – కారిపోడమూ లేదు. సూత్రధారిగా లక్షణంగా నాటకం నడిపించడం చేత కాలేదు నీకు. నీ చేతిలో బొమ్మల తాడు ప్రేక్షకులు చూసేశారు. నీ అజాగ్రత్త ఎల్ల అష్ట దిక్పాలకులూ ఊసులాడుకోడానికి ఒక చోట గుమిగూడారు. తిండి పెట్టడం చేతకాని నీ నిర్వాకం వల్లే ఎముక ముక్క

కోసం కొట్లాడుకునే కుక్కల్లాగ మేతకోసం పోటీ పడుతూ దిగ్గజాలు ఎనిమిదీ ఒకదానితో ఒకటి ఢీకొంటూ కుమ్ములాడు కుంటున్నాయి. ఇక్కడ దిక్కులు తెలీడం లేదు.

ఒకేతీరు ముఖం ఉన్నవాళ్ళు : (ఒకళ్ళతో ఒకళ్ళు) ఆc- ఈన సూత్రదారి ! ఈన సూత్రదారి !

సూత్రధారి : (ప్రత్యేకమైన గొంతుతో తననితను ప్రశ్నించు కుంటున్నట్టు) నేను ఎవరు ?

ఒకేతీరు ముఖం ఉన్నవాళ్ళు : నువ్ సూత్రదారివి....నువ్ సూత్రదారివి !నువ్ సూత్రదారివి !

సూత్రధారి : (ఆ గొంతుక లన్నిటి మధ్యా విలక్షణంగా వినిపించేట్టు పైన చెప్పిన ప్రత్యేకమైన గొంతుతోనే) నేను ఎవరు ? పేరు.... పుట్టిన ఊరు .... మాసం, తేదీ.... తల్లి,దండ్రులు....లింగం.... మద(త)ం.... మాత్సర్యం.... వీటన్నిటి మధ్యా చిక్కుకున్న వాణ్ణి నేను! కాదు. వీటన్నిటికీ ఆవలి వాణ్ణి ! అవలి వాడికి ఆవలి వాడికి ఆవలి వాణ్ణి అయిన నేను ఎవరు ? (గొంతు తగ్గించి) బలే మంచి ప్రశ్న! ప్రతిఒక్కరూ తమని తాము వేసుకోవలసిన ప్రశ్న !

ఒకతను : నేను ఎవరు ?

ఇంకోడు : నేను ఎవరు ?

మరోడు : నేను ఎవరు?

(అన్ని వేపులనుంచీ ఎందరో ఆ ప్రశ్న వేసుకోడం మొదలు పెడతారు)

సూత్రధారి : సైలెన్స్! సైలెన్స్!.... ఇక్కడకాదు. ఇంట్లో! ఇంటికి వెళ్ళిన తరువాత ఈ ప్రశ్న వేసుకోండి! అద్దం ముందు నుంచుని ఈ ప్రశ్న వేసుకోండి ! అద్దంలో బింబం మిమ్మల్ని తిరిగ ప్రశ్నించేట్టు ఈ ప్రశ్న వేసుకోండి ! మళ్ళీ మీరు అడగండి అది మళ్ళీ మిమ్మల్ని అడుగుతుంది. మళ్ళీ మీరు అడగండి ! (ప్రేక్షకుల్లో కలవరం తగ్గలేదు) ఇక్కడ కాదు-ఇక్కడకాదు. (పక్కకి తిరిగి) లైట్లు తీసెయ్ ! చీకట్లో వీళ్ళ ముఖాలు మాయం అయిపోనీ ! లైట్లు తీసెయ్ ! (లైట్లు ఆరిపోవు)

## 5

సూత్రధారి: (లైట్లు ఆరిపోయి నయ్యన్న భావనతో చీకట్లో లభ్యం అయ్యే సౌకర్యంతో ప్రేక్షకుల్ని వెక్కిరిస్తున్నట్టు అభినయిస్తూ మాట్లాడుతాడు)

చీకట్లో ముఖం పోగొట్టుకున్న అభాగ్యుల్లారా ! వెలుతురులో ముఖం ఉన్నవాళ్ళమనే భ్రాంతితో బ్రతుకుతున్న దురదృష్టవంతుల్లారా ! ఎదటివాళ్ళ ముఖం మీకు కనిపిస్తూంది గనక అలాగే మీక్కూడా వాళ్ళకి కనిపించే ముఖం ఒకటి ఉంది ఉంటుంది అనే ఊహలో మాత్రమే ముఖం ఉన్న అజ్ఞానుల్లారా ! ముఖం తడిమి చూసుకోండి ! ముఖంలో ఉండవలసిన అంగాలన్నీ ఉన్నాయి. అందుకే అది ముఖం అని మీ ఊహ ! అది ముఖం కాదు. ఒక నోరు ముఖం కాదు. ఒక ముక్కు ముఖం కాదు. రెండు కళ్ళు ముఖం కాదు. రెండు చెవులు ముఖం కాదు. రుచి, వాసన,చూపు, వినికిడులవల్ల ఊహించని విధంగా అవి మారిపోయి ఆ పెనగులాటలో ఒకచోట ఉండవలసి ది ఇంకోచోట మొలిచింది. చిన్నది పెద్ద దైంది. పెద్దది చిన్నదైంది. ఆ విధంగా లక్షణం దెబ్బతినడంతో ముఖం పాడైపోయింది. నిజానికి- ప్రాచీనమైన ఆలోచనల్లో ఉంది మీ ముఖం !

---

★ తమిళ దేశంలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయాల్లో ఏటేటా సుబ్బారాయుడి షష్ఠికి ఇప్పటికీ జరుగుతున్న ఉత్సవం సూరం సంహారం. ఒక పక్క స్వామి విగ్రహం, మరో పక్క సూరపద్ముడనే రాక్షసుడి మొండెం ఉంటాయి. మొండెం మెడమీది రాటకి వరుసగా పూజార్లు సింహం, పులి మొదలైన వాటి తలలు తగిలిస్తూ ఉంటారు. స్వామి వద్దనుంచి ఒక తాడుకి కట్టిన బాణ సంచా చురచురా కాలుతూ వచ్చి ఒక్కొక్క తలనే ఎగురగొడుతూ ఉంటుంది. పూజార్లు మరో తలతెచ్చి తగిలిస్తూ ఉంటారు.

సంప్రదాయంలో ఉంది మీ ముఖం ! పోగొట్టుకున్న ముఖాల్ని వెతికితెచ్చుకుని మొండేలకి అతికించుకుని వినాయకుడిలాగ తిరిగి మీరు మనుషులు కావడమే ఇవాళ ఇక్కడ జరగబోతూంది. (ప్రక్కకి తిరిగి) లైట్లు వెయ్ ! ముఖాల్ని పోగొట్టుకున్న మొండేలు ముఖాల్ని వెతుక్కుని అతికించుకోడానికి వీలుగా లైట్లు వెయ్! "సూర సంహారం"లో★ సూరపద్మన్ మొండెం మెడమీ రాటకి వరుసగా అయ్యవారు తగిలించే వేర్వేరు తలకాయల్లాగ ఇవాళ ఇక్కడ చిత్రంగా తలకాయలు మొలిచేందుకు వీలుగా లైట్లు వెయ్యి ! మొండెం ఒకటీ, తల ఇంకోటీగా తారుమారయ్యే తమాషా అందరూ చూడ్డానికి వీలుగా లైట్లు వెయ్యి! (కొత్తగా లైట్లు వెయ్యరు. ఇంతకు ముందున్న లైట్లే వెలుగుతూ ఉంటాయి.)

## 6

సూత్రధారి : (వెలుతురులో ఉన్నవాడిలాగ మాట్లాడుతాడు( సభా సదులారా !

పక్క సీట్లవాళ్ళలో ఒకడు : వీఁవయ్యోఁయ్ సూత్తర్దారీ ! నీ డయిలాగ్ కొంచెం ఆపుసెయ్ ! మా ముకాలు మాం యెతికి పట్టుకోవాల ! డయిలాగ్ ఆపేసెయ్ !

సూత్రధారి : డైలాగ్ ఆపేస్తే నాటకం లేదు. మీ ముఖాలు మీకు మీరే గుర్తించుకోడం కుదరదు.

ప.సీ.ఒ. : మా సక్కగా కుదురుద్ది. మా ముకాలు మాం గుర్తించుకోడం కుదురుద్ది. ఇదో సూడు అద్దం !

ప.సీ.ఒ. : నాకాడా అద్దంవుంది.

ప.సీ.ఒ. : నాకాడా అద్దంవుంది.

ప.సీ.ఒ. : నా కాడా అద్దంవుంది.

(పక్క సీట్లలో కూచున్నవాళ్ళు తమ దగ్గర ఉన్న చేతి పిడి అద్దాలు పైకెత్తి చూపిస్తారు. నిజానికవి అద్దాలు కావు. అద్దాల చట్రాలు)

సూత్రధారి : కుదరనే కుదరదు. మీ ముఖం మీరు చూసుకోడం ఎంత మాత్రం కుదరదు.

వాళ్ళు : కుదురుద్ది—కుదురుద్ది !

సూత్రధారి : అద్దంలో కనిపించేది మీ ముఖం కాదు. అది మీ ముఖం కానేకాదు. కుడి చెవి ఎడమ చెవి అవుతుంది. ఎడమ చెవి కుడి చెవి అవుతుంది. ఎడమ కన్ను కుడి కన్ను అవుతుంది. కుడి కన్ను ఎడమ కన్ను అవుతుంది.

వాళ్ళలో కొందరు : ముక్కు ఒక్కటే !

మరికొందరు : నోరు ఒక్కటే !

సూత్రధారి : పిచ్చినాయనల్లారా ! కుడి ముక్కు పుడక ఎడమ ముక్కు పుడక అవుతుంది. ఎడమ ముక్కు పుడక కుడి ముక్కు పుడక అవుతుంది. కుడి మీసం ఎడమ మీసం, ఎడమ మీసం కుడి మీసం అవుతయి. కుడి దంతం ఎడమ దంతం, ఎడమ దంతం కుడి దంతం అవుతయి. నీ ముఖాన్ని నువ్వెప్పుడూ చూసుకోలేదు. అలా చూసుకోవాలంటే నీకు అరచేతిలో ఉండాలి కన్ను !

వాళ్ళలో ఒకడు : అరి సేతులో కన్నెప్పుడూ మొల్దు. అరిసేతిలో అద్దమే యిముడుద్ది.

(అందరూ అద్దాల చట్రాలు పైకెత్తి చూపిస్తారు)

ఇంకోడు : అరిసేతిలో కన్ను మొలాలంటే మనం యింద్రులం కావాల !

ఇంకోడు : వెయ్యి కళ్ళున్న యింద్రులం !

ఇంకోడు : ఔను. వెయ్యి కళ్ళున్న యింద్రులం కావాల !

సూత్రధారి : ఛత్తేరి !.... ఛూ !.... (ఉమ్మేస్తాడు) అహల్య విషయంలో చెడిపోయినయి ఆ ఇంద్రుడి కళ్ళు. చెడిపోయిన ఆ కళ్ళు కళ్ళలాగ కనిపిస్తున్నయి గనుక మీ కళ్ళూ చెడపోయినయి. అహల్యలాగ చాలామంది చెడ్డారు. మీ ముఖం చెడిపోయి చాలా రోజులైంది. ఒక్క ఊహలో మాత్రమే మిగిలి ఉంది మీ ముఖం !

వాళ్ళలో కొందరు : కాదు. ఉంది.

ఇంకొందరు : కాదు. ఉంది.

సూత్రధారి : ఉంది – మీ భావనలో ఉంది.

వాళ్ళలో ఒకడు : కుడి ఎడమైనా, ఎడమ కుడి అయినా ముఖం ముఖమే !

ఇంకోడు : అద్దంలో కనిపించేది మన ముఖమే !

ఇంకోడు : అద్దం సూపించండి – అందరికీ అద్దం సూపించండి ! .... యీయన సెప్పేది సుద్ద అబద్దం అని తెలిసేట్టు అద్దం సూపించండి !

(పక్క సీట్లలో కూచున్న వాళ్ళు జట్లు జట్లుగా లేచి తమ అద్దాల చట్రాలను ప్రేక్షకుల ముందు రకరకాల విన్యాసాల్లో తిప్పుతూ, ఆ చట్రాల వెనక తమ ముఖాల్లో అతిలోక భావాలు ప్రకటిస్తూ, ప్రేక్షకుల్లో ఎవరికివారు తమ ముఖమే ఆ అద్దంలో కనిపిస్తుందనే భావన కలిగేట్టు ఆ చట్రాలు తిప్పుతూ ఉంటారు )

సూత్రధారి : (ప్రేక్షకుల్ని చూసి) ఎట్టా ఉంది ?

ప్రేక్షకుల్లో ఒకే రీతి ముఖంగల వాళ్ళలో ఒకడు : బయమేస్తాంది.

ఇంకోడు : బయమేస్తాంది.

(ప్రేక్షకుల్లో నాటిన ఒకేరీతి ముఖం గలవాళ్ళందరూ రకరకాల గొంతుకలతో అరుస్తున్నారు.)

సూత్రధారి : భయం వేస్తాందా ?

వాళ్ళు : ఔను . బయమేస్తాంది.

సూత్రధారి : మీ ముఖాలు నిలువుటద్దంలో చూసుకోండి– చేతి అద్దంలో కాదు. నిలువుటద్దంలో చూసుకుంటే ఇంకా బాగా కనిపిస్తయి. (పక్కకి తిరిగి) నిలువుటద్దం తీసుకురా ఇలా! తీసుకొచ్చి చూపించు వీళ్ళకి. తమ ముఖం మొత్తంగా చూసుకోనీ వీళ్ళని. తెచ్చి చూపించు. ఇంతమందీ మొత్తంగా చూసుకోనీ ! ఇక్కడికి తీసుకొచ్చి చూపించు !

(ఇద్దరు మనుషులు దీర్ఘచతురస్రాకారంగా ఉన్న పెద్ద చట్రాన్ని తెచ్చి ప్రేక్షకులముందు ఎత్తి పట్టుకుంటారు. విడివిడి అద్దాలు చూపిస్తూ వచ్చిన వాళ్ళందరూ ఇప్పుడు ఈ పెద్ద చట్రం వెనక చేరి ప్రేక్షకుల ప్రతి బింబాలు ఆ అద్దంలో కనిపిస్తున్నట్టుగా చిత్ర చిత్రమైన వికృత హాస్య చేష్టలు ప్రదర్శిస్తూ ఉంటారు.)

సూత్రధారి : చూసుకోండి – మీ ముఖాలు చూసుకోండి ! ఈ నిలువుటద్దంలో చూసుకోండి. మీరన్నట్టు కుడి ఎడమలు తారుమారైనా మీ ముఖాన్ని చూపించే అద్దంలో చూసుకోండి!

ప్రేక్షకుల్లో ఉన్న ఒకేతీరు ముఖం గలవాళ్ళు : (ఇంతకు ముందు గొడవగా అరుస్తున్న గొంతులు ఇప్పుడు "అయ్యో! భయమేస్తాంది. మాకు భయమేస్తాంది." అనే పెద్ద పెద్ద అరుపులుగా పరిణమిస్తయి)

సూత్రధారి : (ఆ అరుపుల మధ్య పక్కకి తిరిగి) లైట్లు ఆర్పెయ్ ! తమ ముఖాలు చూసుకని భయపడిపోతున్నారు– వీళ్ళు ! లైట్లార్పెయ్ ! రాత్రికి మ్యూత్రంతో చాపలు తడిపినా తడపగలరు. లైట్లార్పెయ్ ! బూచాణ్ణి చూసి భయపడ్డం. తనే మళ్ళీ బూచాడుగా తయారవడం జరుగుతూ ఉంటే భయం తీరేదెట్టా ? ఈ నరకం లోనించి విడుదల ఎట్టా ? లైట్లు తీసెయ్!

(దీపాలు ఆర్పరు. వెలుగుతూనే ఉంటయి. నిలువుటద్దం చట్రాన్ని తీసుకెళ్ళిపోతారు. చట్రానికి వెనక తట్టున వెక్కిరిస్తూ నించునిఉన్న వాళ్ళుచీకట్లోఉన్న వాళ్ళధోరణిలో ప్రేక్షకుల్ని చూసి వెక్కిరిస్తూ, వెర్రిమొర్రి చేష్టలు చేస్తూ, చీకట్లో తడుముకుంటున్న వాళ్ళలాగనటిస్తూ వెళ్ళి తమ సీట్లలో కూచుంటారు.)

## 7

[చీకట్లో ఉన్నవాడిలాగ మాట్లాడుతాడు సూత్రధారి. కిందటి సీను చివర తమ సీట్లలో వెళ్ళి కూచున్న వాళ్ళు ఇంకా చీకట్లోనే ఉన్నట్టు నటిస్తూ సూత్రధారి మాటలకు అభినయం పడుతూ ఉంటారు.]

సూత్రధారి : (ప్రేక్షకుల వంకచూస్తూ) చీకటి ఇంతకంటె కూడా భయంకరమైంది– అడవుల వెంట తిరిగే ఆదిమ మానవుడి నాటి ఆ చీకటి ! వెలుతురులో ప్రదర్శిస్తే భావనకి అవకాశం ఉండక తామూ పాల్గొంటామని తయారవుతారు ప్రేక్షకులు. కాని, వ్యతిరేకాల మధ్య చిక్కుకుని కొయ్యబారిపోతారు. ఒక వంక బూచాడంటే భయపడుతూనే మరోవంక తనే బూచాడుగా మారే దుస్థితి పోయి, ఆ నరక బాధనించి విముక్తి

కలగాలంటే మనిషికి భావన అవసరం. మనస్సులో ఆరాటాలను అంతరింపజేసి మనిషిగా మార్చే శక్తి కళాసృష్టికి ఉంది. మొదట — సంస్కృత నాటకాల్లోని సూత్రధారి లాగ వచ్చి నాటకాన్ని మీకు పరిచయం చేసి వెళ్ళిపోవాలని అనుకున్నాను. కాని మీరు ససేమిరా నాకు ఆ అవకాశం ఇవ్వలేదు. ఇప్పుడు మీ భయం నాకు లాభం. ఆర్భాటంగా లేచి నించుని గొంతెత్తి అరవడం కాదు నాటకంలో పాల్గొనడం అంటే ! అంత స్థూలమైన విషయంకాదు అది. చాలా సూక్ష్మమైంది. స్థూలంగానించి క్రమంగా సూక్ష్మానికి పయనించాలి : గడ్డపారలాగ ఖరాగా నిలబడితే చాలదు. దానివల్ల భయం పోదు. వేళ్లు నాటుకోవాలి-చిగిరించాలి! .. "వాల్ పోస్టర్ల"కి సంబంధించిన నాటకం ఇది. దీంట్లో అన్ని రంగులూ కనిపిస్తాయి. వాల్‌పోస్టర్లని గురించిన చరిత్ర తెలుసా మీకు ?

పక్కసీట్ల వాళ్ళలో ఒకడు : తెలీదు.... తెలీదు !

సూత్రధారి : (ప్రేక్షకుల వంక తిరిగి) నిద్దర్లో ఎవరు ఆ కలవరిస్తూంది ?

పక్కసీట్ల వాళ్ళలో ఇంకోడు : పెద్దచ్చు విక్రమాదిత్యుడి కథ తెలుసు మాకు.

సూత్రధారి : (ప్రేక్షకులవంక తిరిగి) గుహా నివాసుల కుడ్య చిత్రాలు తెలుసా ?

ప.సీ.ఒ. : నీకు తెలుసా పెద్దచ్చు విక్రమాదిత్యుడి కథ ?

సూత్రధారి : (ప్రేక్షకుల్ని చూసి) కథ వింటూ కునికిపాట్లు పడే అలవాటు ఇంకా పోలేదా ?.... సరే పెద్దచ్చు విక్రమాదిత్యుడి కథ మీకు తెలుసు గద !

ప.సీ.ఒ. : (కథ వింటున్న ధోరణిలో) ఊఁ!

సూత్రధారి : (ప్రేక్షకుల్ని చూసి) సరే-అది చాలు! మీ ఉపయోగం కోసం తయారైందే పెద్దచ్చు విక్రమాదిత్యుడి కథ.

ప.సీ.ఇంకోడు. : ఊఁ !

సూత్రధారి : (ప్రేక్షకుల్ని చూసి) దాని మారు రూపమే ఈ "వాల్ పోస్టరు".

ప.సీ.కొందరు. : ఊఁ !

సూత్రధారి : చదవడానికి సౌకర్యంగా.

ప.సీ.కొ : ఊఁ !

సూత్రధారి : అక్షరాలు జారిపోయే వీలులేకుండా.

ప.సీ.కొ. : ఊఁ !

సూత్రధారి : "రామునితో కపివరుం" డల్లా "రామునితోక పీకివరుండు" అయిపోకండా !

ప.సీ.కొ. : ఊఁ !

సూత్రధారి : నదురుగా చదివేందుకు సౌకర్యంగా ఉండే రూపం వాల్ పోస్టరు. తీరని కోరికలు తీర్చడంకోసం విచ్చేసే విక్రమాదిత్యుడి బలపరాక్రమాదుల్ని వివరిస్తాయి ఈ వాల్‌పోస్టర్లు. (పక్కకి తిరిగి) ఎవరు లైటు వేసింది? (లైట్లు వెనకటినించే వెలుగుతూ ఉంటాయి.)

నిద్ర తేలిపోదూ? తనంతట తనే బూచాడుగా మారే తన దుర్విధిని చూసి జడుసుకుని నిద్రన్నా, చీకటి అన్నా, మేల్కోడం అన్నా, వెలుతురు అన్నా భయపడి పోతున్న వీళ్ళని మెల్లగా జోకొట్టి నిద్ర పుచ్చబోయే సమయానికి సరిగ్గా లైటు వేశారు-ఎవరది?

(ఒకతను విసవిసా రంగంమీదికి వస్తాడు)

వచ్చినతను : "లైట్లు వెయ్", "లైట్లు తీసెయ్" అంటూ ఉండడంలో ఏమిటి మీ ఉద్దేశం ?

సూత్రధారి : "లైట్లువెయ్యి", "లైట్లు తీసెయ్"-అంతే నా ఉద్దేశం! ఎవరైనా నిన్ను లైట్లు వెయ్యమన్నారా లోపల?

వచ్చినతను : నా అంతట నేనే వేశాను మేలుకుని ఉండడానికి కునికి పాట్లు పడుతూ ఉండడానికి మధ్య తేడా యే లేకండా పోయినప్పుడు లైట్లు వేస్తే ఏం? తీసేస్తే ఏం? మెలుకూగా ఉన్నాడా, నిద్దర పోతున్నాడా అన్న తేడా తెలీడమే లేదు. అందుకని నేనే లైట్లు వేశాను.

సూత్రధారి : సరే-ఫరవాలేదు. ఔను. రెండూ ఒక్కటే ! లైట్లు వెలుగుతూనే ఉండనీ! కళ్ళు ఎవట ఉంటూనే

చిత్రంగా కనిపించకుండా పోవడం సంభవమే! కట్టెదుట ఉన్న విషయాలెన్నో దృష్టి గోచరం కావడం లేదు. అయితే ఒకటి! వాల్ పోస్టర్ మాత్రం దృష్టిలో పడక తప్పదు. అక్కడే ఉంది రహస్యం! ఈ రహస్యం తెలిసినవాడు భట్టి మంత్రి అంతటి వాడు. అపర చాణుక్యుడే వాడు.

వచ్చినతను : ఇలా చెప్పుకుంటూపోతే తెల్లవారుతుంది-పొద్దుపొడుస్తుంది, పొద్దు పొడుస్తుంది - తెల్లవారుతుంది. దీనికిక అంతం అంటూ ఉండదు.

సూత్రధారి : మనంతెచ్చినాటిన ప్రేక్షకులు సరిగ్గా చెయ్యడం లేదు. లేకపోతే ఇలా జరగడానికి ఎలాంటి అవకాశం లేదు. అయినా ఫరవాలేదు. ఇప్పుడేం కొంపమునిగిపోలేదు. నువ్వు ఆ ప్రేక్షకుల్లో ఒకడుగా కలిసిపో! మనం డైలాగులు వెంటనే మొదలు పెట్టేద్దాం. ఎవరైనా నోరెత్తడానికి ముందే నువు అక్కడ సిద్ధంగా ఉండాలి!

వచ్చినతను : అలాగే! (వెళతాడు)

సూత్ర : లైట్లు తీసెయ్యమని చెప్పబోతున్నాను. చీకట్లో తడుముకుంటూ వెళ్ళు!

వచ్చినతను : అలాగే!

సూత్ర : (పక్కకి తిరిగి) లైట్లు తీసెయ్! లైట్లు తీసెయ్! (లైట్లు ఆరిపోవు వెలుగుతూనే ఉంటాయి. ప్రేక్షకుల లోకి వెళ్ళిన వ్యక్తి కాస్తదూరంవెళ్ళి "చచ్చానుబాబోయ్!" అని అరుస్తాడు.)

సూత్ర : (చీకట్లో ఉన్నవాడిలాగ) ఏం జరిగిందిరా దగుల్బాజీ? ఏంవిటా అఘోరింపు? (అప్పుడు లైట్లు వెయ్యబడ్డట్టుగా పక్కకితిరిగి) ఏరా లైట్లు వేశావ్? సందర్భంకాని సందర్భంలో ఎందుకురా వేశావ్ లైట్లు? వీణ్ణి తన్నింది మగాడో, ఆడదో తెలీకండా ఉన్న సమయంలో నువు ఎందుకు వేసినట్టులైట్లు? ఎవర్ని అవమానించాలని నీ ఉద్దేశం? లైట్లు తీసెయ్, (చీకట్లో ఉన్నవాడిలాగ) చేరుకోవలసిన చోటు చేరుకున్నావా? లేకపోతే ఇక్కడికి వచ్చెయ్! చీకట్లో ఎవళ్ళ కంటా పడకండా వచ్చెయ్! నీకు ఒప్పగించిన పని చెయ్యడానికి ముందుగానే అక్కడ మరొకణ్ని ఏర్పాటు చేశాంలే! (తిరిగి వచ్చిన ఆ వ్యక్తిని తడిమి చూసి పక్కకి పంపించి వేస్తాడు) ఇప్పుడు వెయ్యి లైట్లు! (లైట్లు వెయ్యరు. వెనకటి లైట్లే వెలుగుతూ ఉంటాయి.)

## 8

[ప్రేక్షకుడిలాగ ముఖం తొడుగు ధరించిన ఒకతను వచ్చి,

"నువ్వు జిందాబాద్!
నేను ముర్దాబాద్!"

అని వ్రాసివున్న వాల్ పోస్టర్ అంటించి వెళ్ళిపోతాడు]

సూత్ర : మహామహా ఘనత వహించిన ప్రేక్షక మహాశయులారా! ఇంతకు ముందు ఎన్నెన్నో నాటకాలు మీరు చూసి ఉంటారు. మహాకవులూ, మేధావులూ రాసిన నాటకాలు మీరు చూసి ఉంటారు. ఇవాళ మీరు చూస్తున్న ఈ నాటకం న. ముత్తుస్వామి రాసింది. మన జీవితాల్లో అధిక భాగం ఆక్రమించుకున్నాయి వాల్ పోస్టర్లు! వాల్ పోస్టర్లే లేకపోతే మనకి మనుగడే లేదు. పడుగు పేకల్లాగ మన జీవితాలతో అల్లుకుపోయినయి వాల్ పోస్టర్లు.

(ఇప్పుడు ఒకే తీరు ముఖంగల వాళ్ళు ఇద్దరు వచ్చి వాల్ పోస్టర్ దగ్గరకి వెళ్ళి నించుంటారు).

వాళ్ళలో ఒకడు : నేను ముర్దాబాదంట - నేను!

రెండో వాడు : నువ్వు జిందాబాదంట-నువ్వు!....కొట్రా.., పేడ కొట్రా.... ఇంకా చూస్తావేం!
(ఇద్దరూ వాల్ పోస్టర్ మీద పేడ కొడతారు. సూత్రధారి వీళ్ళని చూస్తూ ఉంటాడు. వీళ్ళు సూత్రధారి వైపు నిరసనగా ఒకసారి చూసి వెళ్ళిపోతారు.)

సూత్ర : (ప్రేక్షకుల్ని చూసి) "నేను-వాల్ పోస్టర్" అనేది ఒకరకం. "నువ్వు-వాల్ పోసర్" అనేది యింకో రకం!

తెరలోగొంతు : దేశాన్ని ఉద్ధరించ వచ్చిన
నేను - వాల్‌పోస్టర్‌లు
మంచివాళ్ళ కందరికీ
నేను - వాల్‌పోస్టర్‌లు

(ఇద్దరువ్యక్తులు వాల్‌పోస్టర్ల కట్టా! జిగురు బకెట్టూ తీసుకుని నినాదాలు చేసుకుంటూ ఎడమ వైపునించి కుడి వైపుకి నడచి వెడతారు. ఒకేతీరుగల ముఖం వాళ్ళు ఆ ఇద్దరూ!)

సూత్రధారి : "నేను-వాల్‌పోస్టర్" అనేదిఒకరకం. "నువ్వు-వాల్‌పోస్టర్" అనేది ఇంకో రకం.

**తెరలో గొంతు** : తాతముత్తాతల నాటినించీ వచ్చిన
నువ్వు - వాల్ పోస్టర్‌లు
మీ కోసం ఉద్దేశించిన
నువ్వు - వాల్ పోస్టర్లు

(ఇద్దరు వ్యక్తులు వాల్‌పోస్టర్లకట్టా, జిగురుబకెట్టూ తీసుకుని, నినాదాలు చేసుకుంటూ కుడివైపునించి వచ్చి ఎడమ వైపుకి నడిచి వెడతారు. ఒకే తీరు ముఖంగలవాళ్ళు ఆ ఇద్దరూ!)

సూత్రధారి : "నేను-వాల్‌పోస్టర్లు", "నువ్వు-వాల్‌పోస్టర్లు"
అంటూ తమని తాము ఉత్తమ, మధ్యమ పురుషల్లో
చెప్పుకుంటూ ఎదురు బొదురుగా
ఒకదాన్నొకటి చూసుకుంటూ
ఒకదానికొకటి ఉత్తమ మధ్యమ పురుషలవుతూ
అద్దంలో కనిపించే బింబాల్లాగ
కుడి ఎడమలు తారుమారై తప్ప
నేరుగా ఒకదాన్నొకటి చూసుకోలేక
ఇంకో రకం దృష్టి అందుబాటులోలేక
అలాగే చూసుకుంటూ చూసుకుంటూ
చూపులు అంతరించేలా
చూసిన దాన్నే మళ్ళీ మళ్ళీ చూస్తూ
సందేహంలోపడి
దూరం అయితే దూరం అవుతూ
దగ్గిరకి వస్తే దగ్గిరవుతూ
ఏ పాచికా పారకపోగా ,
బూచిని చూపించి
భయం కోసమే భయపెడుతూ
ఒక బింబం ఇంకో బింబాన్ని వెక్కిరిస్తూ
ఒకేరకం వ్యక్తిత్వంతో
"వదుల్తానేమో చూడు నిన్ను?" అంటూ
విరోధిస్తున్నాయి వాల్‌పోస్టర్లు.
జీవితానికీ, వాల్‌పోస్టర్లకీ తేడా లేదు.
ఆస్వాదనలో రుచి భేదం లేదు
కల్పనల్లో బూరటిల్లిన విక్రమార్కుడు
అడవిలో అర్నెల్లూ, ఊళ్లో అర్నెల్లూ గడిపే
విక్రమార్కుడు
అడవికీ ఊరికీ
తేడా పాటించని విక్రమార్కుడు-
ఆ పెద్దమ్మ విక్రమార్కుడి కథ తాలూకు
సుదీర్ఘ సంప్రదాయప్పు కొనసాగింపే
ఈ వాల్ పోస్టర్లు!
మన ఆశల్నీ ! కలల్నీ ప్రతిఫలించే
ఈ వాల్‌పోస్టర్లు!!

తెరలోగొంతు : దేశాన్ని ఉద్ధరించ వచ్చిన "నేను - వాల్‌పోస్టర్లు" తాత ముత్తాతలనాటినుంచీ వచ్చిన "నువ్వు వాల్‌పోస్టర్లు" మంచి వాళ్ళందరికీ "నేను - వాల్‌పోస్టర్లు" మీ కోసం ఉద్దేశించిన "నువ్వు - వాల్‌పోస్టర్లు"

(సూత్రధారి మెల్లగా జారుకోవాలని చూస్తాడు)

పక్కసీట్లవాళ్ళలో ఒకడు : ఏంవయ్యోవ్- సూత్రదారీ! ఓ ఛనంసేపు ఉండు!
(సూత్రధారి వెనుదిరుగుతాడు. పక్కసీట్ల వాళ్ళలో ఒకడు వెళ్ళి "నువ్వు - జిందాబాద్" "నేను ముర్దాబాద్" అని అతికించి ఉన్న వాల్‌పోస్టర్‌ని చింపాలని చూస్తాడు)

సూత్రధారి : (ప్రేక్షకుల నుద్దేశించి) మహామహా ఘనత వహించిన ప్రేక్షక మహాశయులారా! నాటకం అల్లరిపాలు చెయ్యకండి. నాటకం మొదలయింది. ఇంక నా పని పూర్తి అయింది. నాటకం ఇహ స్వయంగానే నడుస్తుంది.

వాల్‌పోస్టర్ చింప జూస్తున్నవాడు : (వెనుదిరిగి వస్తూ) లేదు.....నీ పని యింకా పూర్తికాలేదు.

సూత్రధారి : లేదు-పూర్తి అయిపోయింది. నాటకం ఆరంభమైంది....ఇంక నాకేం పనిలేదు.

వాల్‌పోస్టర్ చింప జూస్తున్న వాడు : లేదు....ఇంకా నీ అవసరం ఉంది.

సూత్రధారి : లేదు....ఇహ నాకేం పనిలేదు. నటులది ఇక మీద బాధ్యత అంతా! ఇహ నాకేం పనిలేదు.

వాల్‌పోస్టర్ చింపజూచే వాడు : లేదు....నీ అవసరం ఉంది ఇంకా!

సూత్రధారి : ఏంవిటిది? వీధి నాటకాల సూత్రధారి నను కుంటున్నారా నేను? మహారాజులూ, మంత్రిపర్యులు, ఆస్థాన విద్వాంసులూ మొదలైన ప్రముఖ పౌరులు చూసి ఆనందించే శిష్టుల నాటకాల్లో సూత్రధారిని నేను. పామరులు తెగ మెచ్చుకుంటూ చప్పట్లు కొట్టే చౌకబారు వీధి భాగోతాల సూత్రధారిని కాను నేను!

పక్కసీట్ల వాళ్ళలో ఒకడు : సాలించు నీపెగల్బాలు! యీది బాగోతాల సూత్తరదారి అంటే అంత సులకనా? నీ దుష్టిలో?

పక్కసీట్ల వాళ్లలో ఇంకోడు : సూత్తర దారీ,యిదూస కుడూ-రెండూ తినే అయికద నడుపు తాడు యీది బాగోతాల సూత్తరదారి.

ప. సీ. ఇంకోడు : ఆ సూత్తరదారి అంటే ఏందను కున్నావ్?

ప. సీ. ఇంకోడు : పేచ్చకుల పెతినిది ఆ సూత్తరదారి!

ప. సీ. ఇంకోడు : పేచ్చకుల మనస్సాచ్చి ఆ సూత్తరదారి!

ప. సీ. ఇంకోడు : పెళ్నలు యేసేవోడూ ఆడే - జవాబులు సెప్పేవోడూ ఆడే ! అన్నీ ఆడే!

సూత్రధారి : ఎవరండీ ఈ మహామేధావులు? ఇప్పుడు కొత్తగా దిగుమతిఅవుతున్నారే ఆ బాపతు కాదుగద? వీళ్ళు సంప్రదాయాన్ని నిరసించేవాళ్ళా? సంప్రదాయం కావాలనేవాళ్ళా? వాల్‌పోస్టర్ల సంప్రదాయానికి చెందిన వాళ్ళు మాత్రం కారు ఈ మేధావులు!

వాల్‌పోస్టర్ చింపజూచేవాడు : అంతమాట అనకండి!

సూత్రధారి : మరి గడ్డపార చేరూనుతుందా? మొగ్గతొడుగుతుందా?

వాల్‌పోస్టర్ చింపజూచేవాడు : అంతమాట అనకండి!

సూత్రధారి : ముందు నువ్వెవరు చెప్పు! వాళ్ళ తంపున వకాల్తా తీసుకున్నట్లు మాట్లాడు తున్నావు - ఎవరు నువ్వు?

వాల్‌పోస్టర్ చింపజూచేవ్యక్తి : నన్నే ఎరుగరా? నేనేనండీ- "నేను వాల్‌పోస్టర్"ని!

సూత్రధారి :"నేను-వాల్‌పోస్టర్" నా?

వా. చిం. వ్య. : ఔనౌను – "నేను-వాల్‌పోస్టర్" ని!

సూత్రధారి : ఓహో! నువ్వు వాల్‌పోస్టర్ వా?

వా చిం. వ్య. : కాదు కాదు."నేను - వాల్‌పోస్టర్" ని.

సూత్రధారి : అదే అంటున్నా - "నువ్వు వాల్‌పోస్టర్‌వి" అని.

వా. చిం. వ్య. : అబ్బబ్బా - అదికాదు - "నేను - వాల్‌పోస్టర్"ని. "నువ్వు వాల్‌పోస్టర్" ని కాను. నేను- "నేను వాల్‌పోస్టర్" ని !

సూత్రధారి : నేను వాల్‌పోస్టర్‌ని కాను – నువ్వే వాల్‌పోస్టర్‌వి!

వా. చిం. వ్య. : నేను.... "నేను-వాల్‌పోస్టర్" ని.

సూత్రధారి : తెలిసింది-తెలిసింది. నువ్వు వాల్‌పోస్టర్‌వి.

వా. చిం. వ్య.: కాదు-కాదు. నేను....'నేను-వాల్‌పోస్టర్'ని నేను "నువ్వు-వాల్‌పోస్టర్"ని కాను.

సూత్రధారి : నేను-"నేను-వాల్‌పోస్టర్!నువ్వు-"నువ్వు-వాల్‌పోస్టర్"-ఏంవిటిదంతా?తల్లా,తోకా తెలీడంలేదు.

వా. చిం. వ్య : గాభరా పడకండి! నేను "నేను - వాల్‌పోస్టర్‌ని. నేను 'నువ్వు- వాల్‌పోస్టర్' ని కాను. నేను. 'నేను వాల్‌పోస్టర్'ని.

సూ|్త్రధారి : ఏంవీ బోధపడ్డంలేదు నన్ను గందరగోళం చేసేశావ్. ఓ పెద్ద పద్మవ్యూహంలో ఇరుక్కునేట్టు చేశావ్. దారి తెలీక లోపల్లోపలే గుండ్రంగా తిరిగే పరిస్థితి కల్పించావ్. తల తిరిగిపోతూంది. గుంజ పాతి ఆ గుంజకి కట్టి పడేసి మేతకోసం దాని చుట్టూ ప్రదక్షిణం చేసే దుస్థితి కల్పించావ్....

వా.చిం.వ్య : అది నిజం కాదు.

సూత్రధారి : తెలిసినట్టే ఉంటుంది. అంతలో మళ్ళీ అంతా అయోమయం అయిపోతుంది.

వా.చిం.వ్య : అది నిజం కాదు.

సూత్రధారి : "తోడి చోప" కాస్తా "ఐసరబజ్జా" అయిపోతూంది.

వా.చిం.వ్య : అది నిజం కాదు.

సూత్రధారి : "ఐసరబజ్జా" గాడి పెళ్ళాం వీపు మీద తేలిన దెబ్బలు అయిపోతూంది.

వా.చిం.వ్య : అయితే నీకు తెలిసిపోయింది.

సూత్రధారి : లేదు.... తెలీలేదు !

వా.చిం.వ్య : నేను "నేను- వాల్ పోస్టర్"ని.

సూత్రధారి : నువ్వు "నువ్వు-వాల్ పోస్టర్"వి.

వా.చిం.వ్య : ఏం ?.... వేళాకోళంగా ఉందా ?

సూత్రధారి : లేదు. వేళాకోళం చెయ్యడం లేదు. నువ్వు వాల్‌పోస్టర్‌వి. నువ్వు- "నువ్వు - వాల్‌పోస్టర్"వి. "నువ్వు-వాల్ పోస్టర్"వి!

వా.చిం.వ్య : నన్ను వేళాకోళం చేస్తావురా ? (కొరడాతో రెండంటిస్తాడు)

సూత్రధారి : చచ్చాను బాబోయ్....... నేను వేళాకోళం చెయ్యడం లేదు నాయనోయ్.... నేను వేళాకోళం చెయ్యడం లేదు.

పక్కసీట్ల వాళ్ళలో ఒకడు : సెభాష్ ! నువ్వు ఆరితేరిన సూత్రధారివి.

ఇంకోడు : సెభాష్ ! సెభాష్ !

సూత్రధారి : ఏంవిటిది ? అంతా తల్లకిందులయిపోతూంది. ఇది కాదు పొల్లానడం అంటే ! నేను వాణ్ణి తంతే అప్పుడు మీరు "సెభాష్ !" అనాలి' అదీ ప్రేక్షకులు పొల్గొనడం అంటే !

వా.చిం.వ్య : ఏంవిటి ? నువ్వు.... నన్ను.... కొట్టడమా ? (కొరడాతో మళ్ళీ రెండంటిస్తాడు)

సూత్రధారి : అయ్య బాబోయ్ ! చచ్చాన్రోయ్ (బొబ్బలు పెడతాడు)

పక్కసీట్లలో ప్రేక్షకులు : ఖేష్ ! ఖేష్ ! (హర్షధ్వానాలు చేస్తారు)

(లైట్లు ఆరిపోతయి).

## 9

[లైట్లు వెలిగినయి. ఒకే తీరు ముఖం గలవాళ్ళలో ఒకడు వచ్చి "నువ్వు జిందాబాద్-నేను ముర్దాబాద్" అనే వాల్ పోస్టర్ అంటిస్తూ ఉంటాడు. సూత్రధారి చూస్తూ నుంచుంటాడు. వాడు అంటించి వెళ్ళిపోగానే ఇంకోడు వస్తాడు. ఒకే తీరు ముఖం గల ఈ వ్యక్తినికూడా గమనిస్తూ ఉంటాడు సూత్రధారి. వీడు వచ్చి అంతకు ముందు అంటించిన "నువ్వు జిందాబాద్ - నేను ముర్దాబాద్" అనే వాల్‌పోస్టర్ చింపబోతాడు. ఈ ఇద్దరూ తప్ప ఒకే తీరు ముఖంగల వ్యక్తులింకెవరూ ఉండరు రంగం మీద].

సూత్రధారి : ఆగు !

చింపబోయే వ్యక్తి : (కోపంతో) ఎవరు నువ్వు ?

సూత్రధారి : పేడకొట్టకండా ఎందుకు చింపుతున్నావ్ వాల్ పోస్టర్‌ని ?

చిం.వ్య : (ముఖంలో మార్పుతో) చేతికి పేడంటుతుంది.

సూత్రధారి : చేతికి పేడకాకుండా వాల్ పోస్టర్‌ని నువు ఖండించలేవు.

చిం.వ్య : చేతికి పేడంటకండా ఖండించవచ్చు. అలా ఖండించేందుకు నినాదాలున్నయ్ !

సూత్రధారి : అయితే చించెయ్ ! ఖండిస్తూ చించెయ్!

చిం.వ్య. "వాల్‌పోస్టర్లు - వెధవ వాల్‌పోస్టర్లు" (అంటూ చింపుతాడు )

సూత్రధారి : నిదానం ! నిదానం ! .... అసలు వాల్‌పోస్టర్లనే ఖండించెయ్యకు ! ఈ వాల్ పోస్టర్‌ని ఖండించు !

చిం. వ్య : నువ్వు.... జిందాబాద్ ! నేను.... ముర్దాబాద్! (వెటకారంగా చదువుతూ చింపుతాడు)

సూత్రధారి : భేష్ !

చిం. వ్య : (చేతిలో చింపిన ముక్కతో) ఎవరు నువ్వు ? నువు.... "నేను - వాల్‌పోస్టర్"వా ? (కరచాలనం కోసం చెయ్యి చాపుతూ) నేనూ వాల్‌పోస్టర్‌ని నువ్వూ వాల్‌పోస్టర్‌వి. నేనూ "నేను-వాల్ పోస్టర్"ని నువ్వూ "నేను-వాల్‌పోస్టర్" వే ! మనం "నేను-వాల్‌పోస్టర్"లం మనం స్నేహితులం !

సూత్రదారి : (కరచాలనానికి చెయ్యి చాపకుండా) క్షమించండి! ఇక్కడ నాకో చిన్న సందేహం. తీరా చెయ్యి ముందుకి చాస్తేమళ్ళీ వెనక్కి తీసుకోకూడదు గద! (చింపబోయేవ్యక్తికూడాచెయ్యివెనక్కి తీసుకుంటాడు )

చిం.వ్య: ఏంవిటి నీ సందేహం? నేను "నేను-వాల్‌పోస్టర్"ని నువ్వూ "నేను-వాల్‌పోస్టర్"వే !

సూత్రధారి : బాబోయ్ ! మళ్ళీ ఆ ఒప్పులకుప్ప మొదలుపెట్టకు– నా తల తిరిగిపోతూంది. పరిగెత్తుతూ భూప్రదక్షిణం చేసి రావచ్చు. తన చుట్టూ తను తిరగడం చాలా కష్టం ! సులభమైన వన్నీ ఎంతో చిక్కు ప్రశ్నలే అయి ఉంటయి. నాకు తలా,తోకా, అర్థం కావడం లేదు. నేను ఎట్టా నువ్వు అవుతాను ? నువ్వు ఎట్టా నేను అవుతావు? నువ్వూ, నేనూ ఒకరికొకరం నువ్వూ, నేనూ ! నువ్వు నీకు "నేను" నేను నాకు "నేను", నేను నీకు "నువ్వు". నువ్వు నాకు "నువ్వు".

చిం.వ్య : నేను నాకు "నేను". నువ్వు నీకు "నేను". నేను నీకు "నువ్వు". నువ్వు నాకు "నువ్వు".

సూత్రధారి : ఏంవిటీ.విటీ ? నేను నాకు "నేను" (ఉభయులూ పరస్పరం తట్టి చూపిస్తూ చెప్పుకుంటారు)

చిం.వ్య : నువ్వు నీకు "నేను".

సూత్రధారి : నువ్వు నాకు "నువ్వు"

చిం.వ్య : నేను నాకు "నేను"

సూత్రధారి : నేను నీకు నువ్వు"

చిం.వ్య : నువ్వు నాకు "నువ్వు"

సూత్రధారి : నువ్వు నీకు "నేను"

చిం.వ్య : నేను నీకు "నువ్వు"

సూత్రధారి : పోయింది. పోయింది. అంతా గందరగోళమై పోయింది. సమాంతర రేఖలు కలిసే సుదూర క్షితిజ రేఖపై పు పెట్టే అంతులేని పరుగులా గుంది ఇదంతా. నన్ను గందరగోళంలో పడెయ్యకు !

చిం. వ్య ! నువ్వే నన్ను గందరగోళం చేస్తున్నావు. నీలో స్పష్టతలేదు. వివరంగా చెప్పేందుకు తగిన మాటలు రావు నీకు. నీకు పునాదిలేదు. నీకు నువ్వే ఎదిరిపక్షం !

(లైటు ఆరిపోతాయి)

## 10

[లైట్లు వెలుగుతయి. ఒకే తీరు ముఖంగలవాళ్ళలో ఒకడువచ్చి "నువ్వు జిందాబాద్-నేను ముర్దాబాద్" అనే వాల్‌పోస్టర్ అంటిస్తూ ఉంటాడు. తీరిగ్గానించుని వేడుక చూస్తూ ఉంటాడు సూత్రధారి.]

సూత్రధారి : మీరు అంటించుకుంటూ పోతారు. మీ వెనకాల మరోడు వచ్చి చింపేసుకుంటూపోతాడు- ఏంవిటి లాభం దీనివల్ల ?

అంటించే వ్యక్తి: చింపేసింది చింపేయగా మిగిలింది లాభం.

సూత్రధారి : అసలు ఏమీ మిగలకపోతే ?

అం.వ్య : మిగలకండా ఎళ్లా పోతుంది ?

సూత్రధారి : ఎలా మిగులుతుంది?

అం.వ్య : మిగలకండా ఎలా పోతుందీ అని ?

సూత్రధారి : అంటించేవాడు అంటించిందంతా చింపేసే

వాడు చింపేసుకుంటూపోతే ఇంక ఏం మిగులుతుంది ?

అం.వ్య : మిగులుతుంది.

సూత్రధారి : అదే-ఎలా ?

అం.వ్య: ఒకటితో ఒకటిపూర్తిగా పోయినప్పుడే ఏమీమిగలదు. పదిలో కొన్ని పోయినా కొన్ని మిగులుతయి. నీకు అనుభవం ఉన్నట్టులేదు. అంటించేవ్యక్తి అంటించే వ్యక్తి మాత్రమే కాదు. చింపేసే వ్యక్తి కూడా. నేను ఇక్కడ అంటిస్తాను. అక్కడ చింపేస్తాను.... వస్తావా నాతో? ....చింపెయ్యడానికి వెళుతున్నాను. వస్తావా ?

సూత్రధారి : రాను. నాకు వేరే పనుంది.

అం.వ్య : అంత విరిచి పోగులు పెట్టే పని ఏంవిటుంది నీకు ?

సూత్రధారి : కాదు. నాకు పని ఉంది.

అం. వ్య : "విరిచి పోగులు పెట్టడం" అనే నుడికారం ఎప్పుడైనా విన్నావా ? దీని అర్థం తెలుసానీకు ?

సూత్రధారి : తెలీదు.

అం. వ్య : నాకూ తెలీదు.

సూత్రధారి : మరి ఎందుకు వాడావు ఆ నుడికారం ?

అం. వ్య : జెండా కర్రవిరిచి ముక్కలు చెయ్యడం అనేమో బహుశః దీని అర్థం ! అంటే ధ్వజ స్తంభం విరగ్గొట్టే పని!.... నువ్వు మేధావిననే అభిప్రాయం ఉందా నీకు ?

సూత్రధారి : లేదు. ఎందుకలా అడుగుతున్నావ్ ?

అం. వ్య. : అహం- అలాంటిభావం ఏదైనా ఉందేమో నీకు అని ! ఆ అభిప్రాయం ఉన్నవాళ్ళు కూడా ఉన్నారులే ! వాల్‌పోస్టర్లంటే నిర్లక్ష్యం ప్రదర్శించే మేధావులు వాళ్ళు ! తమ మేధా శక్తితో ప్రపంచాన్ని తల్లకిందులు చేసేశామని వాళ్ళ ఊహ. నిజానికి వాళ్ళు ఎందుకూ కొరగారు. వార్తలు ప్రచారం చేసే సాధనం ఈ వాల్‌పోస్టర్. దీనితో సాటిరాగలది ఏదీ లేదు.... ఇప్పుడు చెప్పు - నువ్వు మేధావిననే అభిప్రాయం ఉందా నీకు ?

సూత్రధారి : లేదు. ఎంతమాత్రం లేదు.

అం. వ్య : ఇది చాలా గాఢమైన విషయం. అంటించడం, చింపడం రెండూ ఒకే నాణేనికి రెండు పక్కలు. ఒక పక్కమాత్రమే ఉండేనాణెం ఎక్కడైనా ఉంటుందా

సూత్రధారి : ఉండదు. ఒక పక్కనే వ్రాసి ఉండే వాల్‌పోస్టర్ మాత్రం ఉంటుంది.

అం. వ్య : అందుకే దీని విషయంలో తగూ లేదు. తంటా లేదు ఏదైనా తగూ ఉన్నా దాని అవసరం ఉన్నంత వరకే అది ఉంటుంది అదే వాడుక అయిపోదు. ఒకవేళ వాడుక అయిపోయినట్టు కనిపిస్తే దాని అవసరం అంతగా ఉండని అర్థం.... ఏం-వస్తావా నాతో ?

సూత్రధారి : రాను. ఇక్కడ నాకు పని ఉంది.

అం.వ్య : దీన్ని చింపెయ్యాలని చూస్తున్నావేవిటి ?

సూత్రధారి : అన్నన్న.... అదేంకాదు.

అం. వ్య. నీ మీద నాకు నమ్మకమే ? నువు ఒక వేళ చింపెయ్యాలనుకున్నా నేనేం ఖాతర్ చెయ్యను.

సూత్రధారి : అదేం కాదు.

అం. వ్య. : నీ మీద నాకు నమ్మకమేలే ! నువు చించినా నాకు బాధలేదు.

సూత్రధారి : అదేం కాదు.

అం. వ్య: నువ్వంటే నాకు నమ్మకమే నీలాంటి వాణ్ణి నేను ఎక్కడా చూడలేదు. నీ మీద నాకు నమ్మకమే ! కంటికి కనిపించకుండా చాటుమాటుగా వచ్చి చింపేసినా నేనేం బాధపడను. ఈ రీత్యా ఒక మనిషికి పని కల్పించాను కదా అన్న సంతోషం నాకుంటుంది. పోయి నీ పనిచూసుకో ! (అతడు వెళ్ళి పోతాడు. ఆ వెంటనే ఒకే తీరు ముఖం గలవాళ్ళు కొందరు వస్తారు ఒకడు జిగురు బకెట్, ఇంకోడు పోస్టర్ల కట్టా, మరోడు నిచ్చెనా తెస్తారు. నిచ్చెన గోడకి చేరవేస్తారు. "నువ్వు జిందాబాద్-నేను ముర్దాబాద్" అనే వాల్ పోస్టర్‌ని చింపేస్తారు)

సూత్ర : ఒక్క వాల్‌పోస్టర్ చింపడానికి ఇంత మందా ?

ఒకడు : అవును.

ఇంకొకడు ॥ ఇంతమందా అనిఆశ్చర్యపడిపోతున్నావుగదూ!

ఇంకోడు : నీకు ఆశ్చర్యం కలిగించాలన్నే మా ఉద్దేశ్యం! నిన్ను ఆశ్చర్య పరచి నీకు కనువిప్పు కలిగించాలి. వాల్ పోస్టర్‌లో మాటలు తటాలున నీ కళ్ళల్లో ప్రవేశించి దృష్టి మార్గంద్వారా నీ మెదడు చేరుకోవాలి! మెదడలో పలు విధాల మార్పులు పొంది, అదంతా నీకు కంఠపాఠం అయిపోవాలి! "ఒకడు వచ్చి అంటించిపోయాడు, మరికొందరు వచ్చి చింపేసిపోయారు." అనే సాధారణమైన విషయం కాదిది.

ఇంకోడు : దీనిలో చాలా రహస్యాలున్నాయి.

ఇంకోడు : ఈ నిచ్చెన ఎందుకో నీకు తెలుసా!

సూత్ర : చింపేసేవాడు అంత సులభంగా చింపేసినట్టు ఉండ కూడదు గద! అందుకేమో!

ఒకడు : సులభంగా చింపేసినట్టు అనిపించకుండా ఉండడమే కాదు. వాడు నిచ్చెన వేసుకుని పైకెక్కి చింపెయ్యాలి! శ్రమపడి చింపెయ్యాలి! అంటించినప్పుడు కనిపించే శక్తి చింపేసేటప్పుడు కూడా కనిపించాలి. అంతేకాదు. మన సంప్రదాయంలో నిచ్చెనకి ఉన్న పరపతి చెక్కుచెదరడంలేదు. నిచ్చెనకి పైకిఎక్కడంతోనే సంబంధం! వాల్ పోస్టర్ పరపతికి, నిచ్చెన పరపతినీ అనుకోని విధంగా దానంతట అదే విజయం లభిస్తుందని గుర్తించినందువల్లే తెచ్చాం ఈ నిచ్చెన ఇక్కడికి! (జిగురుపూసి ఒక వాల్ పోస్టర్ ఒకడి చేతి కందిస్తారు. వాడు నిచ్చెన ఎక్కి దాన్ని అంటిస్తాడు. వాల్ పోస్టర్‌లో "నేనుజిందాబాద్!" అని వుంటుంది.)

సూత్రధారి : (వాల్‌పోస్టర్ కేసిచూసి) "నేనుజిందాబాద్!" (వాల్ పోస్టర్ అంటించినవాళ్ళు నిచ్చెనా, జిగురు బక్కెట్టూ, వాల్ పోస్టర్ల కట్టా తీసుకుని, సూత్రధారి వైపు చూస్తూ, "నేను జిందాబాద్! – నేను జిందాబాద్!" అనిఅరుచుకుంటూవెళ్ళి పోతారు. ఇప్పుడు–ఒకే తీరు ముఖంగల వ్యక్తులు నలువైపులనుంచీ రావడం మొదలు పెడతారు. వాల్‌పోస్టర్ వంకచూస్తూ, "నేను జిందాబాద్! నేను జిందాబాద్" అని పెద్ద పెట్టున అరుస్తూ తమని తాము దీవించుకుంటూ ఉంటారు. సూత్రధారి కూడా "నేను జిందాబాద్!" అంటూ తనని తాను దీవించుకుంటాడు.)

సూత్రధారి : (వాళ్ళని చూస్తూ) ఆహా ..."నేను జిందాబాద్! -నేను జిందాబాద్!" ఈ స్వార్థంలో కూడా ఇతరుల మంచి ఇమిడి ఉంది-గమనించారా! (వాల్ పోస్టర్ని చూస్తూ) "నేను జిందాబాద్" అని ఇది తనని తను దీవించు కుంటూంది. ప్రతి ఒక్కరి హితాన్నీ కోరుతూ అది 'నేను జిందాబాద్!' అని తనని తను దీవించుకుంటూ ఉండి ఉండచ్చు! (తెరలో "నువ్వు జిందాబాద్!" అనే నినాదాలు వినిపిస్తయి. అంతా ఆ ధ్వని వస్తున్న వైపు తిరిగి చూస్తారు.)

సూత్రధారి : నిజానికి వీళ్ళే మన మంచిని కోరేది! మనకు మనమే మేలు చేసుకోవాలని వాళ్ళు అంటున్నారు. వాస్తవానికి తమని తామే దీవించు కుంటున్నారు వాళ్ళు! వీళ్ళేమో సూటిగా మనల్నే దీవిస్తున్నారు. 'వీళ్ళు జిందాబాద్!'

అక్కడున్న వాళ్ళు: జిందాబాద్ ! .... జిందాబాద్!

(నలుగు రైదుగురు ఒకే తీరు ముఖంగల వాళ్ళు జిగురు బకెట్టు, వాల్‌పోస్టర్ల కట్టా, నిచ్చెనా తీసుకుని వస్తారు. ఆ రావడం "నువ్వు జిందాబాద్!" అని అరుస్తూ వస్తారు. అక్కడ ఉన్న వాళ్ళలో ఒక్కొక్కణ్ణే 'నువ్వు జిందాబాద్," "నువ్వు జి దాబాద్" అంటూదీవిస్తారు. వీళ్ళు మళ్ళా వాళ్ళని 'నువ్వు జిందాబాద్' అని దీవిస్తారు.)

సూత్రధారి : ఇలా దీవించడంలో కూడా స్వార్థం వుంది. తనని మళ్ళీ దీవించడంకోసమే వాళ్ళని దీవించడం! తను బాగుపడటం కోసమే చేసే దీవెన ఇది. తన బాగు కోరి అది గోడకి అంటుకుపోయింది. ఇతరులు

తన బాగు కోరడం కోసం ఇది గోడకి అంటుకు పోతూంది.

(ఒకడు వాల్‌పోస్టర్‌కి జిగురు పూసి అందిస్తాడు ఇంకోడు నిచ్చెన ఎక్కి 'నేను జిందాబాద్!', అనే వాల్‌పోస్టర్ పక్కనే "నువ్వు జిందాబాద్" అనే వాల్‌పోస్టర్ అంటిస్తాడు. తరువాత వెనక్కి తిరిగి గుంపుగా చేరిన వాళ్ళనుద్దేశించి "నువ్వుజిందాబాద్"అంటాడు· ఆ గుంపు మళ్ళీ అతణ్ణి "నువ్వు జిందాబాద్" అని దీవిస్తుంది)

అతడు : (నిచ్చెన మీద నుంచునే) సెభాష్....సంగీతంలా వినిపిస్తోంది మీ నినాదం!

తక్కినవాళ్ళు : (కొందరు కొందరుగా) నువ్వు జిందాబాద్ నువ్వు జిందాబాద్.

అతడు : (నిచ్చెన మీద నుంచునే) నువ్వు జిందాబాద్!

కొందరు: (అతణ్ణి ఉద్దేశించి) నువ్వు జిందాబాద్!

మరికొందరు: (అతణ్ణిఉద్దేశించి) నువ్వు జిందాబాద్!

అతడు: నేను జిందాబాద్!

సూత్రధారి: (ఆశ్చర్యంగా) ఏంవిటివి?

కొందరు: (నిచ్చెన మీద ఉన్న అతణ్ణి చూపిస్తూ) ఆయన జిందాబాద్!

తక్కినవాళ్ళు : ఆయన జిందాబాద్!

సూత్రధారి : ఏంవిటిది?

అతను : "నేను" నీకు "నువ్వు" .... "నేను"నాకు "నేను" ....నేను జిందాబాద్ !

తక్కినవాళ్ళు : నువ్వు జిందాబాద్!

సూత్రధారి : అదృష్టవంతుడు!

ాళ్ళు : (మందలిస్తూ) "అదృష్టవంతులు" అను !

సూత్రధారి : అదృష్టవంతులు ! మీ వల్ల ఈయన అదృష్ట వంతులు. ఈయన వ్యక్తిత్వం పెరుగుతూంది. మీ ఆదరంవల్ల పెరుగుతూంది. ఊహకికూడా అందకుండా పెరిగే వ్యక్తిత్వం అది! అభినందనల వల్ల పెరిగే వ్యక్తిత్వం. పెరిగే స్వభావంగల వ్యక్తిత్వం. విత్తనం లాంటి వ్యక్తిత్వం!

అతను : నేను జిందాబాద్!

కొందరు : నువ్వు జిందాబాద్!

మరికొందరు : నువ్వు జిందాబాద్!

ఇంకొందరు : నువ్వు జిందాబాద్!

వాళ్ళలో ఒకడు : ఉత్తమ, మధ్యమ పురుషల్లోనే కాకండా ప్రథమ పురుషలోకూడా ఉండరూ దీవించండి!

ఇంకోడు : (దగ్గరికి వెళ్ళి నిచ్చెన వేపు చూపిస్తూ) ఆయన జిందాబాద్ !

కొందరు : ఆయన జిందాబాద్!....ఆయన జిందాబాద్!

సూత్రధారి : ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలనేవి ఒక దానికొకటి ఉత్తమ, మధ్యమ, ప్రథమపురుషలయ్యే స్వభావం కలవి.కనుక వాటిఅవకాశాలు సమానంగా ఉంటయి. సమాంతర రేఖలు కలుసుకునే తావు ఉందనే నమ్మకం కుదురుతూంది. ఆ అవకాశం కను చూపు మేరలో ఉంది. ఎప్పుడూఉంది. దూరానికి దగ్గరగా కనిపిస్తూ, దగ్గరికి వెళితే దూరం అవుతూ మనతో దాగిలిమూతలు ఆడుతున్నా అవి కలుస్తా యనే నమ్మకం ఉంది. కట్టెమటనేఉంది. నమ్మకం లోనే ఉంది లోకం!

ఒకడు : (బిగ్గరగా) ఆయన జిందాబాద్!

చాలామంది : ఆయన జిందాబాద్! ఆయన జిందాబాద్!

ఒకడు : ఎవరిముఖం వాళ్లు నిశ్చయంగా చూసుకోవచ్చు!

సూత్రధారి : నిజంగా ఇక్కడ మీ పాత్రపోషణ అద్భుతం!

అతడు : ఎవరైనా తనముఖం తనుచూసుకోవచ్చు. అది అరూపం అయేటంతగా నీరసించడంవల్ల అది పైకి కనిపించనిమాట నిజం! చాలామందిలో ఆ బింబం సరూపం అయ్యేస్థాయికి వ్యక్తిత్వం ఎదగలేదు.

ఒకడు : (నిచ్చెన వేపు చూపిస్తూ) అలాఎదిగిన వ్యక్తిత్వం ఆయునకి ఉంది.

సూత్రధారి : మీవల్ల వచ్చిందే అది.

ఇంకోడు : (పక్కకి తిరిగి) ఎవరక్కడ? తీసుకురా ఇక్కడికి. (నిచ్చెనకేసి చూపిస్తూ) ఈయన రూపం తీసుకురా! ఆ వాల్‌పోస్టర్ తీసుకురా!

(ఇంతకు ముందు తాము తెచ్చుకున్న ఉపకరణాల్లోనుంచి ఒక ముఖం తొడుగునీ, వాల్‌పోస్టర్ల చుట్టనీ ఒకతను తీసుకు వస్తాడు)

ఒకడు : (ముఖం తొడుగు అందుకుని) అంటించేందుకు జిగురు పుయ్యకు. (అతను జిగురు పూస్తాడు)

ఇంకోడు : (ముఖంతొడుగు సూత్రధారికి చూపిస్తూ) ఈయన తన ముఖం తనే చూసుకోగల వ్యక్తిత్వం ఉన్నవాడు. (ముఖంతొడుగు నిచ్చెనమీది వ్యక్తికి తగిలిస్తాడు. ఆ ముఖంతొడుగు ఒకే తీరు ముఖ రచన గల వాళ్ళ ముఖంలాగే ఉన్నా అంతకంటె పెద్ద సైజులో ఉంటుంది.)

మరోడు : (ముఖం తొడుగు ఆయనకి తగిలించి) ఈయన జిందాబాద్!

దూరంగా ఉన్నవాళ్ళు : (ఒకరి నొకరు చూసుకుంటూ నిచ్చెన వేపుచూపిస్తూ) ఆయన జిందాబాద్! ఆయన జిందాబాద్!

అతను : (ముఖం తొడుగు తలమీద నుంచి తొలగించి తన ముఖానికి పక్కగా పట్టుకొని) నేను జిందాబాద్!

చాలామంది : (అతనివంక చూస్తూ) నువ్వు జిందా బాద్! నువ్వు జిందాబాద్! (వాల్‌పోస్టర్లకి జిగురు పూసేవాడు వాల్‌పోస్టర్ అంటిస్తాడు. దానిలో ఒకే తీరు ముఖం తొడుగు తాలూకు చిత్రం ఉంటుంది)

అతను : (ముఖం తొడుగుని రకరకాలుగా తిప్పిచూపిస్తాడు. తన ముఖాన్నీ, ఆ తొడుగునీ పక్కపక్కగా పెట్టి ప్రేక్షకులకి చూపిస్తాడు. తన గుండెలమీద వేలాడదీసుకుని తలవంచి తన ముఖం తనే చూసుకుంటున్నట్టు ఆ తొడుగుని చూస్తాడు. తరువాత – "నేను జిందాబాద్!" అంటూ ఆ తొడుగుని మళ్ళీ తలకి తగిలించుకుంటాడు)

సూత్రధారి : (ప్రేక్షకులతో) అద్దంలో కనిపించేది కాదు ముఖం.

ఒకడు : వాల్‌పోస్టర్‌లో కనిపించేదే ముఖం!

సూత్రధారి : (రంగస్థలం మీద వున్న వాళ్ళనీ, ప్రేక్షకుల్నీ మార్చి మార్చి చూస్తూ) అలా అయితే ఎనిమిది దిక్కులకీ వెళ్ళి అంటించండి వాల్‌పోస్టర్లు! చిన్నపిల్లలు ఆడుకోడానికి గోడలు చూపించండి. వాళ్ళ చేతికి బొగ్గుముక్కలు అందించండి! పెద్దచ్చు విక్రమాదిత్యుడి కథలో పుటలేగోడలు. గోడల్లేని ఇళ్ళుండవ్ ఆకృతిలేని మనుషులూ వుండరు. ఈ మంత్రం ఒక్కటి చాలు-గుణాల్ని నిరూపించే కార్టూన్ తలకాయల్ని ఎన్నిటినో మొలిపించడానికి ఈమంత్రం ఒక్కటిచాలు. దేశం అంతటా కార్టూన్ తలకాయలు మొలిపించేందుకు వెళ్ళిరండి! విచిత్రమైన దేశం మనది! పోయిరండి!
(నిచ్చెనమీద ఉన్నతని దగ్గరకి వెళ్ళి) నువ్వు జిందాబాద్! జీవించడంకోసం జన్మించినవాడివి నువ్వు! నువ్వు జిందాబాద్!

అతను : నేను జిందాబాద్!

కొందరు : నువ్వు జిందాబాద్!

మరికొందరు ; ఆయన జిందాబాద్!

(అతన్ని కొందరు బుజాలమీద ఎక్కించుకుంటారు. ముఖంతొడుగు తీసి చేత్తో పైకెత్తి చూపిస్తూ "నేను జిందాబాద్!.... నేను జిందాబాద్!" అని అతడు నినాదాలు చేస్తాడు. తక్కినవాళ్ళు "నువ్వు జిందాబాద్!" "ఆయన జిందాబాద్!" "ఈయన జిందాబాద్!" అని అరుస్తూనే అందరూ ప్రేక్షకుల మధ్యకి వస్తారు. అతను "నేను జిందాబాద్" అనీ ఇతరులు "నువ్వు జిందాబాద్!" అనీ అరుస్తూ ప్రేక్షకుల్లో కలిసిపోతారు)

సూత్రధారి : (రంగస్థలంమీద ఒక్కడే నిలబడి, పెద్ద గొంతుతో) ప్రేక్షక మహాశయులారా! రేపుకూడా ఈ వీధినాటకం ప్రదర్శించబడుతుంది. అందరూ రండి! మీ పాత్రమీరు నిర్వహించడంకోసం అందరూ తప్పకుండా రండి! అంతా మీపాత్రమీదే ఆధారపడి ఉంటుంది. అందుచేత తప్పకుండా రండి! బుద్ధిమంతుల్లాగ రండి!
(రంగస్థలంమీద మాత్రమే లైట్లు ఆరిపోతాయి)

శ్రీ కొడవంటి లీలామోహనరావు

# అనుభూతి కవిత్వం

అనుభూతి ప్రధానంగా కవిత్వం ఉండాలన్నది ఒక వాదం. కవిత్వానికి అర్థం ముఖ్యమా, అనుభూతి ముఖ్యమా అంటే రెండవదే అంటారువీరు. అనుభూతి అంటూ లేకుండా కవిత్వం ఉంటుందా అనొచ్చు. ఉంటుంది. కొందరి కవిత్వానిక సిద్ధాంతం భూమిక అయితే, మరికొందరి కవిత్వానికి అనుభూతి భూమిక అవుతుంది.

తాను చూసింది, తెలుసుకున్నదీ, అనుభవించింది ఇతరులకి చెబుదామనే తపన మనిషికి వుంటుంది. అదే అతన్ని కళాకారునిగా తీర్చిదిద్దుతుంది. ఆ తపనే లేకుంటే కవి కలం ముట్టడు. అంచేత కవి ఏదోచెబుదామనే కవిత్వం రాస్తాడు. నా ఆనందం కోసం నేను రాస్తున్నానని ఎవరైనా అంటే అది శుద్ధ అబద్ధం.

ఆర్టిస్టు రాజదర్బారులోని విదూషకుడులాంటివాడు అన్నాడో రచయిత. రాజుని సైతం విమర్శించే స్వేచ్ఛ ఉంది విదూషకుడికి. కవికీ అంతే. అతనిపరిధిచుట్టూ ఉన్న ప్రపంచం అంతాను. అందులో ఆహ్లాదం ఉంది. ఆక్రందన ఉంది. అవి తన నిత్య జీవితంలో అనుభవాలు. అవే తన కవిత్వానికి భూమిక. "అమృతం కురిసిన రాత్రి"లో బాలగంగాధర తిలక్

> ఆకాశం మీద అప్సరసలు
> ఒయ్యారంగా పరుగు లెత్తు తున్నారు
> వారి పాదాల తారా మంజీరాలు
> ఘల్లు ఘల్లని మ్రోగుతున్నాయి
> వారి ధమిల్లాల పారిజాతాలు
> గుత్తు గుత్తులై వేలాడుతున్నాయి

అన్నప్పుడు అతను వాస్తవ ప్రపంచాన్ని ఇమిటేట్ చేయడం లేదు. జీవితం పట్ల ప్రేమనూ. ధైర్యాన్ని వహించిన కవి అనుభూతే మనకు కన్పిస్తుంది. అది మంత్రశక్తి లాగా మనల్ని ఆవహిస్తుంది.

కవి తన మనసు మనకు చెప్పుకోడానికే కవిత్వం రాస్తాడని ఒప్పుకున్నాక, ఏమి చెప్తున్నాడని మనం గమనిస్తే-ఒక విషయం కావచ్చు, ఒక అనుభూతి కావచ్చు. "భిక్షువర్షీయసి" లో శ్రీశ్రీ ఈ విధంగా రాస్తాడు:

> దారి పక్క, చెట్టుక్రింద
> ఆరిన కుంపటి విధాన
> కూర్చున్నది ముసిల్దొకతె
> మూలుగుతూ, ముసురుతున్న
> ఈగలతో వేగలేక.

బాధాకరమైన ఒక దృశ్యాన్ని కళ్ళకు కట్టిస్తాడు. దిక్కు దివాణంలేని ఒక్క ప్రాణిని వర్ణిస్తాడు. ఇందులో ఆలోచన ఉంది. ఆవేదన ఉంది. విషయం ఉంది.

> ఆ అవ్వే మరణిస్తే
> ఆ పాపం ఎవ్వరిదని
> వెర్రిగాలి ప్రశ్నిస్తూ
> వెళిపోయింది.

అని తన కవితకు భూమిక, ప్రేరణ ఏమైనదీ స్ఫురింపజేస్తాడు మనకు ఒక అవగాహన ఏర్పడుతుంది. కాని మనస్సును కుదిపివేసే అనుభూతి ఉండదు. అది పాఠకునికి సరఫరా కాదు.

ఈ రెండు రకాల కవిత్వాన్ని విలువ కట్టేటప్పుడు అవి ఏప్రయోజనాల్ని సాధిస్తున్నాయో గమనించాలి. సమాజంలో ఉన్న వాస్తవ పరిస్థితిని ప్రతిబింబిస్తుంది అభ్యుదయ కవిత్వం. మనం నిత్యం గమనించే అసమానత్వం, దోపిడీ, దౌర్జన్యం అందులో చోటు చేసుకుంటాయి. ఈ కవిత్వం వాస్తవాన్ని ఇమిటేట్ చేస్తుంది. సమకాలీన సమస్యలకు మనసు పొందే స్పందన అనుభూతి కవిత్వం. ఒకటి బాహ్య

దృష్టి. రెండవది అంతరదృష్టి. ఒకటి జనాన్ని ఎడ్యుకేట్ చేస్తే, మరొకటి ఇమోషనల్‌గా దగ్గరకు చేరుస్తుంది.

ఒక సిద్ధాంతం భూమికగా, 'సాహిత్యం ప్రయోజనం కోసం" అనే నినాదంతో అభ్యుదయసాహిత్యంవిలసిల్లింది. సాహిత్యం ముందుకు సాగిపోతూనే ఉంది. శాస్త్ర విజ్ఞానంలో సాధిస్తున్న పురోగతి, రాజకీయాల్లోని మార్పులు' కొత్త సాంఘిక సమస్యలు, కమ్యూనిజం పట్ల డిజిల్యూజన్‌మెంటు, కమ్యూనిజంలోని విభేదాలు—ఇలా అనేక కారణాల మూలంగా సాహిత్యంలో కొత్త మార్పులు గోచరిస్తూనే ఉన్నాయి. సర్రియలిజం, దైరూప్యత, అనుభూతి ఇలా నూతన మార్గాలు తొక్కుతూనే వుంది. అభ్యుదయ కవిత్వానికి తరువాతి దశే అనుభూతి కవిత్వం. అభ్యుదయ కవిత్వానికి కేంద్రము సమాజంలోని మనిషి. అనుభూతి కవిత్వానికి కేంద్రము రచయితే. అభ్యుదయ కవిత్వంలో వెనకటి సాంప్రదాయ పోకడలు కన్పడినట్లుగానే, అనుభూతి కవిత్వంలో కూడా వెనకటిభావ కవిత్వపు పోకడలు అక్కడక్కడ గోచరించడం జరుగుతుంది. భావకవిత్వం, అనుభూతి కవిత్వం— రెంటిలోనూ కవికి తన మనసే తనకు ప్రమాణం. రెంటిలోనూ కవి తనలోకి తను చూసుకుంటాడు. భావకవి ప్రకృతినీ, ప్రకృతిలో భాగమైన అందాన్నీ ఆరాధించాడు. 'నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు, అని తనచుట్టూ గిరిగీసుకున్నాడు. ఆ విధంగా అతను సమాజం నుండి వేరు పడ్డాడు. అనుభూతి కవిత్వం సంగతి వేరు. సమాజానికి, కవికి ముడి. అతని సెన్సెస్ అన్నీ సమాజంలోని అన్ని విషయాలనూ గ్రహిస్తాయి. స్పందిస్తాయి. ఆ అనుభూతినే కవి అందిస్తాడు.

> ఒక పువ్వు
> నీ సిగకు
> నగయైను
> మించినది.

అని విశ్వేశ్వరరావు పరవశించినా

> ఆమె కన్నులలో అనంతాంబరంపు
> నీలి నీడలు కలవు.

అని కృష్ణశాస్త్రి గానం చేసినా

> ఆమె నవనీత హృదయ, నా యంతరంగ
> శాంతి దేవత

అని వేదుల వారన్నా మనకు సౌందర్యారాధన కన్పిస్తుంది.

> పాడవే కోకిలా
> పాడవే యింపుగా
> ప్రాణముల్ హాయిచే
> పరవశ మ్మొందగా

అని బసవరాజు అప్పారావు ఆలపించినా

> తెలుపు మిన్నులలోన ఒక నీలి తెరమబ్బు
> సంజలో తారిందిదిలే!
> జాలుగా మారిందిలే!

అని విశ్వనాథవారు వర్ణించినా

> నరమానవుని పనులు
> శిరమెగ్గి పడికాయి
> కరమెత్తి దీవించి
> కడలికే నడిచింది

అని బాపిరాజు గానం చేసినా మనకు ప్రకృతి ఆరాధన కన్పిస్తుంది.

> సీను సిటుకనగానే
> సెదరిపోతది మనసు
> కాకమ్మ సేతైన
> కబురంపు డారాజు

అని నండూరి సుబ్బారావు అన్నా

> ఎవరులేని గవాక్ష సంవృత తలాన
> నను బిలిచి ఒంటమేసె సుందరి యొకర్తు
> తెల్ల సురపొన్న పువుల సంకెళ్ళ తోడ

అని రాయప్రోలువారు అన్నా మనకు ప్రణయంలోని ఔన్నత్యం గోచరిస్తుంది. ఇవన్నీ భావకవిత్వం లక్షణాలు.

అభ్యుదయ కవిత్వం వాస్తవం దర్శిస్తుంది. ఆలోచన రగిలిస్తుంది. "మరో ప్రపంచం" వాంఛిస్తుంది. దాని కర్తవ్యం వేరు. భావ కవిత్వం తోవ వేరు. అనుభూతి కవిత్వం పద్ధతివేరు. అనుభూతిని సునిశితంగా వ్యక్తపరచే వేగుంట మోహన ప్రసాద్ "అనుభూతి"గేయంలో రాస్తాడు.

పురందర దాసు కీర్తనేదో
ఒక మధ్యాహ్నం
జయటెక్కడో కాస్తున్న ఎండలోకి
చూస్తూ నాదస్వరంలో విన్నప్పుడు
ఆమేఘాలు కదలాడినయ్
గాలి పిచ్చిగా పర్వెట్టింది.
గగన నీలం వల్చబడింది చైతన్యంలో విస్తృతమై
నా మేనంతా ఏవో పులకలు
కనులు తడి
ఆపుకోలేని అనంత జ్ఞాపకాల వెలుతురు
ఎప్పుడో చచ్చిపోయిన అమ్మగుర్తుకి;

ఆ సంగీతం వింటుంటే తనలో మేల్కొంటున్న ఎన్నో భావాలు-తనలో పొంగిపొరలే ఆనందం, వాత్సల్యం, చైతన్యం. అమ్మ గుర్తుకొచ్చింది. ఆమెచూపే వాత్సల్యం గుర్తుకొచ్చింది. బాల్య స్మృతులు గుర్తు కొచ్చాయి. ఆ మధ్యాహ్నం వాతావరణమే మారిపోయింది. ఆ నాదం తన హృదయం నిండి, ఇల్లంతా నిండి, ఈ జగత్తంతా వ్యాపిస్తోంది. జడం నుంచి చైతన్యానికి, దానితో పాటూ తాను.

పురందర దాసుతో పాటూ నేనూ
అక్కడ చంద్రుని చుట్టూరా నేను
చుక్కల్లో తప్పటడుగులు వేస్తూ నేను.

ఈ విధంగా కవి ఆ నాదంతో తాదాత్మ్యం చెందాడు.

అనుభూతిని మనకు కావలసిన రీతిలో మలచుకోవడం జరగదు. అది ఏ ఫ్రేములోనూ ఇమడదు. అనుభవం ఎంత స్వాభావికంగాకలుగుతుందో అంతస్వాభావికంగానూ వ్యక్తపరచాలి. దాన్ని ఏదో ఒక రకమైన కట్టుబాట్లలో వ్యక్త పరచడం కృతకం అవుతుంది. అంచేత దానికివచన కవితే శరణ్యం. మనసూ,మనసూమాట్లాడుకునేభాషఒక్కటే. అది అతి సరళమైంది.అందులోనే అనుభూతి సరఫరాకావాలి. "జైలు" గేయంలో కె.శివారెడ్డి రాస్తాడు:

కిటికీ కంట్లోంచి చూస్తే
చేతు లెత్తి నిల్చున్న అస్థిపంజరాల్లా
ఆకు రాల్చిన చెట్లు.
గది నిండా
ఊపి రాడని గాలి
దారులు వెతుక్కుంటుంది పిచ్చుకలా-
స్పృహనంతా
నిర్జీవ వస్తువుల మీద పారబోసుకుని పాలలా
కలం అరచేత్తో ఎత్తి కాయితంలో నింపాలని తపన.

మనసు ఎలా వుంటే లోకం అలా కన్పడుతుంది. మనసులోని బాధచెప్పాలని కవి విలవిల్లాడి పోతాడు. కాని అశక్తత. అందుకే అంటాడు:

గది గుండంతా శిలామయమే
శబ్ద నదులన్నీ శిలామయాలే
చూపుల్లేని చేతులన్నీ శిలామయాలే-
వర్షించని స్తనాలన్నీ శిలామయాలే-
సీసాలో బంధించ బడ్డ ఈగలా నాస్పృహ!

"అపహరించ బడిన చరిత" లో

తల్లీ
రోడ్డు మీద కిళ్ళీ ఉమిసిన మరకల్ని చూస్తే
నువ్వే గుర్తొస్తావు నాకు

అని "ఇవా"అన్నప్పుడు అతనిబాధ మనకు అర్థంఅవుతుంది. ఇలా అనుభూతి,కవిత్వంలో చోటు చేసు కున్నప్పుడు, కవి అనుభూతి,అందరి అనుభూతీ అవుతుంది. అదే, అనుభూతి కవిత్వానికి పరమావధి.

ఈ తేడా మనం గుర్తించి నప్పుడు అనుభూతికవిత్వం ఒక బలవత్తర మైన ప్రక్రియగా రూపిస్తుంది. అర్థమూ, అన్వయాలకు అతీతంగా, ఎక్కడో మన నాడులనుస్పందింప జేస్తుంది. ఈ కవిత్వంలో "పాండోరాస్‌బాక్స్" లోని సవ్వడి మనకు విన్పిస్తుంది. పెట్టె తెరవండి అనుభూతి మీదవుతుంది.

# రాగరుచి మౌక్తికం

దగ్గుత్తికను యినుమడింప జేస్తూ
భ్రమల ఎండమావుల అయస్కాంతంతో ఆకర్షిస్తూ-నిన్ను
ఊహా జనిత అవాస్తవిక లోకాల్లో
విహరింప జేయడానికి,
రక్తికట్టించడానికికాదు--

నా ప్రజల మనసుల్లో
క్రుంకిన
ప్రొద్దులు పొడిచి
బ్రతుకులు వెలిగించడానికి
ఉదయాలను ఆహ్వానిస్తూ
ఈ స్వాగత గీతి రచిస్తున్నాను!

నీరవ నిరాశా నిశా నిశ్శబ్ద పూరిత
గుండెపూరాలు ఘూర్ణిల్ల
సాంద్ర ఆశాచంద్ర రీత
సుధాఘృణి స్వనాలు ధ్వనిస్తున్నాను!

నన్ను నేను కొల్లగొట్టుకొని,
దీన హీన జనావళికి ఈ వేళ
రాగరుచి మౌక్తికములు
పంపుతున్నాను!.

ఇక.... ....

నా ప్రజలు ఆనందాన్విత జలపాతాలై
క్రేళ్లురుకుతారు!
మమతా, మానవతా జిగిబొదులై పారి
జీవన క్షేత్రాల్లో సమతా నవోషస్సులు
పండించు కుంటారు!

# ఈ యేడు పండిన పంట ఆలోచన

నా పేద తల్లి దండ్రులు
నాకు ఒసగిన
ఎకరం మాగాణిలో—

ముందటేడు
ఉత్తి రెల్లు
ఆకతాయితనం పండింది....

నిరుడు
పితప పంట—
దుడుకుతనం పండింది....

అంతకంటే పండడానికి
నేను మాత్రం పాటు పండిదేముందని తరచి చూసిం
దేముందని

తిని త్రేన్చడం,
వలచిన వ్యాపకాలకు మరిగి
ఊరేగడం తప్ప....

యీ యేడు....?
కష్టాలకు ఖర్చులకు ఓర్చి,
ధ్యాస పెంచి, ఒడలు వంచి

ఎంతగానో సాగు చేస్తే,
ఎన్నో ఎరువులు వేస్తే
ఇదిగో—
నవ నవంగా
అసలు సిసలైన పంట—
ఆలోచన పండుతోంది;
ఎఱ్ఱ ఎఱ్ఱగా
అగ్రొంచుతోంది—

ఇక.........

నా కష్టాలు గట్టెక్కుతాయి!
నా కలలు ఫలిస్తాయి!

— శ్రీ ఖమ్రుద్దీన్

# నేపథ్యము

### శ్రీ జూకంటి జగన్నాథం

గడియారం గుండె
కొట్టుకుంటుంది.
రాజుల్లా
కాలుమీద కాలేసుక్కూర్చున్న
పన్నెండు అంకెల చుట్టూ
రెండు బక్క ప్రాణులు
రెక్కలరుగ
చాకిరి చేస్తున్నాయి.
ప్రతి పన్నెండు గంటలకొకసారి
కాస్సేపు
సమావేశం అవుతాయి.
జీవితం పొడుగునా
పరచివున్న చాకిరీకి
కలవర పడుతాయి
కంట తడిపెడతాయి.
మళ్ళీ
తమకు తామే గుండె ధైర్యం చేసుకొని
ముందుకు సాగుతాయి.
గుండెల్లో
కరుడు కట్టిన విషాదం
కరిగి ఖోరున అలారమై మ్రోగి
నిన్నూ, నన్నూ వెన్ను తట్టి
పనిలోకి పురమాయించుతాయి.
చూపుడు వ్రేలితో
తూర్పువైపు దారిచూపుతాయి.

శ్రీ శివలెంక ప్రకాశరావు

# వేంకట పార్వతీశ్వరుల కవితా సౌరభం

(శత జయంతి ఉత్సవ సందర్భంగా వ్రాసిన ప్రత్యేక వ్యాసం)

"గానమాతనిది, చొక్యం బైన శ్రుతి నాది
సరసమోహన కల స్వనము మాది
రాగ మాతనది, తోరం బైన కళ నాది
శాంత సుందర విలాసంబు మాది
స్వరమాతనిది, విభాసురమైన లయనాది
సురభిరామోదవి స్ఫురణ మాది
భావమాతనిది, జీవంబైన-ధ్వని నాది
నవ నవానంద వైభవము మాది

చోద్యముగఁ బాడు నాతండు చూపులోనె
పట్టియాడెదనేఁ గనుపాపలోనే
యేపుగా రూపుగాఁ దోచునింతలోనె
చూపులోఁ చాపయై కవితా పురాణి !(1)

అని ఎలుగెత్తి చాటిన ఈ కవిద్వయమే బాలాంత్రపు వేంకటరావు (1880- 1912), ఓలేటి పార్వతీశం (1882-1955) గారలు. ఆ రోజుల్లో ఆచంట సాంఖ్యాయన శర్మగారు నడిపేఁ కల్పలతా పత్రికా ముఖంగా వీరు జంటకవులయారు. అప్పటినుంచీ సాగిన వీరి కవితా కల్పవల్లి"ని కొనలు సాగించి, ఆచంద్రతారార్క కీర్తిని కటగించిన సంస్థ "ఆంధ్రప్రచారిణి"(1911) ఈ జంట కవులు"ప్రమదావనం" "మాతృ మందిరం"వంటి పెక్కు నవలలూ, "కావ్యకుసుమావళి", "బృందావనం" "ఏకాంతసేవ" వంటి పద్యకావ్యాలూ, "తారాశశాంక"ది నాటకాలూ, "శ్రీరామాయణం"వంటి అనువాదాలు ఎన్నో రచించినారు.

## కల్పవల్లీ సౌరభం :

వీరి "కవితా కల్పవల్లి" "అమృత సురభిళమృదుల తాంతములతో", 'మధుపక్వ ఫల గుళుచ్ఛములతో", "రస మాధురీమూర్తి''గా(2)పరిఢ విల్లింది. వీరి కవితామతల్లి ''శాశ్వతేచ్ఛా క్రియాజ్ఞాన సౌధవీధి", ''భూర్భువస్స్వస్స మ్రాకాంతమూర్తి", ఆమె, "ఆద్య", "కాలాపరిచ్ఛేద్య", "దివ్యశాంత సనాతనాదేవి. (3) విశ్వవ్యాప్తమైన ఆ వరాశక్తి సన్నిధియే వీరికి పరమావధి.

"సమపీఠాద్వయం" నుండి వెలువడే నాదంవలె, ఒకే జాతి "పుష్పద్వయం" నుండి పరివ్యాప్తమయే నెత్తావి వలె, "సమరూపదీపద్వయం" నుండి వెలుగొందే తేజంవలె, "సమవేగ లహరీద్వయం" నుండి కలగలసి పొంగి పొరలే నీటి వలె "ఏకమై", ''సమభావగతి''తో కవిత్వం చెప్పిన 'కవిద్వయం' వీరు. "ఫలరసం" "పంచదార"ల రసాయన సమ్మేళనం వీరి కవిత.

వేంకట పార్వతీశ్వరులు సహజకవులు. సంస్కృతాంగ్ల వంగభాషలను గురు ముఖంగా అధ్యయనం చేయకుండానే ఆయాభాషా సౌరభాలను ఆంధ్రంలో గుబాళింపజేసినప్రతిభా

---

1. కావ్య. కుసు- ద్వి. భా. (1924)-పు-6-7
2, 3- అదే పుట 174

వంతులు వీరు. ప్రాచ్య పాశ్చాత్య భావవాహినుల మేలు కలయికగా పెంపొందిన వీరి కవిత్వాశయాలు పాశ్చాత్య వాసనా భరితాలు. అయితే వాటన్నింటికీ రక్తగతంగా వీరికి ఉన్న ప్రాచ్యాంత రానుభవం జీవనాడి.

వీరి భాష సరళంగా, హృద్యంగా, అనవద్యంగా, రసజ్ఞమనోహరంగా, లలిత పదగుంభనంగా, నిర్మల భావ సుధాభరితంగాచిప్పారుతుంది.

"వ్రాయుము నిర్మల భావవి
ధేయమ్ముగ బుధజనాతి ధేయముగ జగ
ద్గేయమ్ముగ లలిత సుధా
ప్రాయమ్ముగఁ బాఠకశ్రవణ పేయమ్ముగన్[4]

అని ఈ 'కవిరాజు హంసలు' తమ 'కలమును' ఉద్బోధించినారు.

ఈ 'కవికులా లంకారులు' అనుసరించిన ఛందో వ్యాకరణాది విషయాలు పూర్వాంధ్ర కవులకు కొంత భిన్నత్వాన్ని కలిగి ఉండి భావకవుల స్వేచ్ఛాప్రవృత్తిని ప్రకటిస్తాయి. అయినా వీరి కవిత ధ్వని గర్భితంగా, రసభావ స్ఫోరకంగా ఉంటుంది."శైలి,రీతినిర్మాణా"ది విషయాలలో నన్నెచోడ, తిక్కన, నాచనసోమనాది పూర్వాంధ్ర కవులను తలపింప చేసినా, వీరి కావ్యపద్ధతి మాత్రం ఆంధ్రలోకానికి క్రొంగొత్తరుచుల్ని వెలార్చింది.[5] ఎన్నో వినూత్న భావద్వారాలను తెరిచింది-"పసిపిల్లవాని మొదలు పండుటి వఱకు నచ్చునట్లు" తెలుగు పలుకుబడిని "ఇంత మధురముగా, మృదువుగా, తేట తెల్లముగా, తీరు తియ్యముగా తీర్చి దిద్దిన [6] ఆధునికాంధ్రకవులు చాల అరుదు.

నవ్య కవితా వధూటి తన రూపురేఖలు సరిగ్గా తీర్చి దిద్దుకొనక పూర్వమే 1903 ప్రాంతం నుండి వీరు వివిధ విషయాలపై కవితా వ్యవసాయం ప్రారంభించారు. అందుకే వేంకట పార్వతీశ్వర కవులను కొందరు విమర్శకులు "ఆధునిక యుగ కర్తలు"గా సంభావించినారు [7] "నవ్యాంధ్ర కవితాసతికి.... తేటగీతముల మంజరుల కాన్కలిచ్చిన "సూత్రధారులు"గా ప్రశంసించినారు (8)

## కావ్య కుసుమావళి :

ఇది 1924లో రెండు భాగాలుగా వెలువడింది. అష్టోత్తర శత కవితా సమాహారం ఇది. మొదటి భాగంలో 43, మిగిలినవి రెండో భాగంలో ఉన్నవి. మొదటి ఇరవై నాలుగులో 20 శీర్షికలు "హారావళి" (9)అనే పేరున ప్రప్రథమంగా ముద్రించినారు. అయితే దీనిని మధునా పంతుల వారు నవలల పట్టికలో చేర్చటం జరిగింది [10]. "వివిధ విషయములం గూర్చి వ్రాయబడిన యిట్టి పద్యమాలికలుగల గ్రంథములు మన యాంధ్రభాషయందంతగా లేవు." కాబట్టి ఆ కొరతను తీర్చు ఉద్దేశంతో 'నూతన మార్గముల'లో వ్రాసిన "పద్యమాలికల"ను "హారావళి"గా ప్రకటిస్తున్నట్లు "ఉపోద్ఘాతం"లో తెలుపుకున్నారు వారు.

"కావ్య కుసుమావళి"లో మొట్టమొదటి శీర్షిక "అక్షర గీతం". తమ కవిత "అక్షర"మైనదనీ, భాషకు మూలమైన అక్షరమే తమకు ఆరాధ్యమనీ, అక్షరంవలె తమగీతాలుకూడా ఆ చంద్రతారార్కం నిలవాలనీ ఈ జంట కవుల భావం.

"అనిశమును మాకుఁ దోడ్పడు మక్షరంబ" అని

4. కలము- అదే-1 భా (1924)-పు.52.
5. "ఆమోదము"- నడకుదుటి వీరరాజు- అదే
6. ఆంధ్ర రచయితలు - మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి (1973)- పు. 313
7. అదే. పీఠిక టి. రాజగోపాలరావు(1924.)
8. 'తెనుగు కైతల క్రొత్త తెన్నులు' (వ్యా) ఆంధ్ర శేషగిరిరావు – పు 81.
9. ఆంధ్ర ప్రచారిణీ ముద్రాక్షరశాల-నిడదవోలు- మొదటి కూర్పు - 1913.
10. చూ. ఆంధ్ర రచయితలు (1973) – పు. 306.

కవితల పంటలు పండించే అక్షర రూపంలో ఉన్న శబ్దశక్తి చరణాలను శరణు కోరినారు వీరు.

వీరు తెలుగు కవితామ తల్లికి పూర్వవైభవాన్ని అకాంక్షించినారు అయితే వీరు తెలుగుభాష అన్యదేశ్యాలను గ్రహించి పెంపొందడానికి వ్యతిరేకించలేదు. అప్పుడప్పుడే తలెత్తుతున్న పద కవిత ఈ కవులకు అంతగా సరిపడలేదు. అందుకే 108 కవితలలో ఒకే ఒక్క ముత్యాలసరం "దుందుభిధ్వానం"(11) లో ఉపయోగించినారు ఏది ఎట్లా ఉన్నా హృదయమును రసమయముగఁజేయు పలుకు పొందికయే కవిత్వ"మని వీరి నిర్వచనం 12) "నెలబాలుని నవ్వులకు," "మెఱుంగుఁదీవ పువ్వులకు", "వన్నెల"నూ, "తావుల"నూ కూర్చగల నేర్పరులే "భావజ్ఞుల"నీ, "వంజల దోచు రాగాన్నీ" "జానల తేనెలమోవిరాగాన్నీ" "విశ్వ గాన రసమంజరి రంజిలు రాగ మాలికా పుంజం"గా గ్రహించగల సమర్థవంతులే "భావరహస్య కోవిదుల"నీ వీరి అభిప్రాయం. (13) అట్టి పాఠకులే తమ కావ్యాలను చదవాలని వేంకట పార్వతీశ్వరుల అభిలాష.

1916 లో వీరురచించిన "భావగీతములు" (14) అనే శీర్షికను బట్టి పరిశీలిస్తే భావప్రధానంగా రచింపబడినకొన్ని ముక్తకాలే భావకవిత్వమని ఈ జంటకవులు అభిప్రాయ పడినట్లు అనిపిస్తుంది. అయితే వీరి కావ్యకుసుమావళిలో భావ కవితా సంబంధమైన కథాకావ్యాలు, ప్రేమకావ్యాలు,ప్రకృతి కావ్యాలు, ఆధ్యాత్మిక కావ్యాలు, దేశభక్తి కావ్యాలు, రాజ భక్తి కావ్యాలు, స్తుతి కావ్యాలు, బాలగీతాలు, రూపకాలు ఇత్యాదులన్నీ ఉన్నాయి. స్మృతిగీతాలు మాత్రం అసలే లేవు.

వీరి "కపోతమనే" కథాకావ్యం సతీసహగమన దురాచారాన్నీ, జలజ మాలిక" అనేది బాల్య వివాహాలనూ శ్రోత్రియ కుటుంబాలలో ఉన్న మూఢ విశ్వాసాలనూ ఖండిస్తాయి. "శ్రావణశుక్రవారం" అనే కథ వేశ్యాలోలత్వాన్ని నిరసిస్తుంది.

వెంకట పార్వతీశ్వర కవులకు స్త్రీయందుగల పూజ్య భావం సర్వత్రా గోచరిస్తుంది. "గృహలక్ష్మి" "ధర్మపత్ని" అనే కవితలలో ఆ తత్వమే కనబడుతుంది.

"ఇహపర సుఖంబు లిడునది యింతి కాదే!" అనే వీరి ఆలోచనా ధోరణియే అర్ధాంగికి "ప్రేమోప హారము"ను సమర్పింపజేసింది.

ఈ దృశ్యజగత్తులో ఉన్న వస్తుజాలం తమ సహజత్వాన్ని కోల్పోకపోవడం "ప్రేమకొఱకే"నని వీరి దృఢ విశ్వాసం. లోకంలో సంభవించే కష్టసుఖాలూ, జనన మరణాలూ - అన్నీ 'ప్రేమకొఱకే" అని వీరి నమ్మకం. ప్రేమకు ఒక హద్దంటూ ఉండదనీ,పవిత్రమైన ప్రేమకు అంతరాలూ, అంతస్థులూ అడ్డురావనీ వీరి అభిప్రాయం, అదే "ప్రేమాంజలి" కథలో చెప్పారు.

"ప్రకృతి"ని ఒక "ప్రబంధం"గాను, దాని "కర్త"ను భగవంతుని గాను ఈ కవులు సంభావించినారు.

> 'ప్రజల జీవితములను కావ్యమ్ములందు
> వలలు సర్గల వంటివీ వత్సరములు' [15]

అని 'సంవత్సరాది' అనే కవితలో చెప్పిన భావం అత్యద్భుతంగా గోచరిస్తుంది. "వసంతాంకం", "వసంత లక్ష్మి', 'ప్రభాతవాతం'', "వేగుచుక్క" "చందమామ" వంటివన్నీ ప్రకృతి పరమైనవే.

వెంకట పార్వతీశ్వరుల భావమాలికలో సాధారణంగా అంతస్సూత్రంగా అనుగమించేది "ఆధ్యాత్మికత."

> "భూత పంచకమని మెడి పోగులెల్లఁ
> దడవి పురిపెట్టి కూర్చిన త్రాడు వంటి

11. "చేమ పువ్వులఁ బంచవారకుఁ
    జేఁదీసి గ్రహించు నార్యులఁ
    వాదములలో భేద భావము
    లేమి లేనే లేదు లేదని
    చాటవే దుందుభి చాటవే"- పు.123 భా-2.
12. "విహంగ విమానము" అదే.
13. "భావాభిజ్ఞత" 2 భా-పు 272. 14. 1 భా- పు. 47.
15. 1భా-పు 201.

దగును జీపంబు ; క్రమముగా నట్టె చాఁగి
బిగిసి బిగ్గర సాగితాఁ దెపను దుడకు
కానదృష్టంబు నష్టమునే గణనఁ జేసి
కొని యదృష్టంబునే దైవమనిరి బుధులు-"[16]

ఇటువంటి తత్త్వ సంబంధమైన కవితతే "జీవగీతం" "సంశయం" "గాలిపటం" "అనంతవాహిని" "కావ్య సముద్రం" "భవాబ్ధి" వంటివి.

దైవభక్తితో బాటుగా వీరి దేశభక్తి ప్రపూతమైన కవితలు జాతీయ భావం ఉట్టిపడ తుంది.

"మాతృదేశంబు మఱవకుమా ! కుమార !
మాతృ భాషను మఱవకుమా ! కుమార !" (17)

అనీ దేశ జనని 'సన్నిధి'యే తమకు 'పెన్నిధి' అనీ, "స్వర్గలోక" సన్నిభమనీ, ఆమెయే తమకు సర్వస్వమనీ అంటారు వీరు. నా.నాటికీ పెరిగి శిలలు వేస్తున్న అస్పృశ్యతను నిరసించి, సర్వ మానవ సౌభ్రాతృత్వమే మన లక్ష్యంగా ఉండాలని ఉద్బోధించారు.

వీరిలో స్వేచ్ఛా ప్రవృత్తికన్న ప్రభు భక్తి వరాయణత్వం ఎక్కువ. బ్రిటిషువారి పాలనను ప్రశంసించడంలోను, మేరీ జార్జుల పట్టాభిషేకోత్సవ సందర్భంలోఁ "ఉపాయన పద్య హారావళి" కూర్చడంలోను, కర్జుని 'రాజభక్తి'ని పొగడడంలోను ఈ తత్వమే ప్రకటిత మవుతుంది. "వేమన యోగి", "రవీంద్రుడు", 'రత్న హారాదు"లు వీరి స్తుతి వరమైన కావ్యాలు.

తిక్కనగారి తరవాత తెలుగు సాహిత్యంలో కెమ్మోవి నవ్వు, చెక్కిలి చెంత నవ్వు, ముక్కు ముంగరల నవ్వు, "మునిపంట నవ్వు" ఇత్యాదిగా పెక్కు విధాలైన నవ్వులను పేర్కొన్న కవులు వీరే !

## భావ సంకీర్తనము

గద్య శైలిని తలపించే 102 సీసపద్యాల కూర్పు ఇది. జీవుని మనోవేదన రసవంతమూ, భక్తి భావ బంధురమూ అయిన సంకీర్తనంగా పరిణమించి విశ్వ వీణలో ఐక్యం కావాలనే ఆదర్శం దీనికి మూలసూత్రం. జీవుడు నిమిత్త మాత్రుడు, భగవదధీనుడు, ఆయన కరుణా కటాక్ష వీక్షణాలకై తాపత్రయ పడుతూ కాల ప్రవాహంతో బాటు సంచరిస్తాడు. ఆయన చరణాలను శరణు కోరి వివిధ యోగాలలో దర్శించి జీవన్ముక్తుడవుతాడు. ఈ జీవనై జాన్నే ఈ జంట కవులు "భావ సంకీర్తనఁ"లో ధ్వనింపచేసినారు. విశుద్ధమానసంలో కలిగిన "భావసుమమును" ఆ పరాత్పరుడికి "మీదు కట్టి' తమ "పవిత్ర హృదయాబ్జము"ల తగిన వెల ఇచ్చి ఖలుచు కొమ్మని భగవంతుని భక్తి పూర్వకంగా అర్థించినారు.

మానవ దేహాన్ని ఒక "క్రొవ్విరి"తో ఉపమిస్తూ
"కొమ్మయే మాయమ్మ
క్రొవ్విరియే నేను
వృంతమే నాకుఁ బ్రవృత్తి పదము
అకరువే నాయాత్మకాధార పీఠంబు
కేవలమ్ముగ రజమే విభూతి
చుట్టు దళమ్ములే శోభనాంగకములు
తళుకులే నాలోనఁ గల బలమ్ము
సిద్ధమధు రసమ్మె జీవప్రసారమ్ము
నాకు వాసనయె జన్మంపు హక్కు...." (18)

ఇత్యాదిగా చెప్పిన అధ్యాత్మిక భావం అనన్య సామాన్యం.

భగవంతుని "ప్రేమసామ్రాజ్యం"లో మానవుడొక "పౌరుడ"నీ, ఆయన ఇచ్చినదానినే అతడు తిరిగి సమర్పించు కొంటాడనీ, పరాత్పరుని లీలలు ఎవరికి తెలియవనీ వీరు అభిప్రాయ పడినారు.

## బృందావనము

ఈ కావ్యం పిఠాపురం యువరాజగు శ్రీరావు వేంకట

---

16. "యదృశ్యంతన్న శ్యమ్-" 1 భా-పు 70.
17. జాతీయ గీతం -2 భా-పు. 60.
18. కావ్య - కుసు. 3 భా-ద్వి. సం.-పు. 82.

మహాపతి గంగాధర రామారావు బహద్దరు వారి వివాహ సందర్భంలో సమర్పించబడింది. (1935) పోతన "ఈశ్వరుని" రామునిగా భావించి భాగవతం చెప్పినట్లు తాము "రామభూమీవరు"ని జగత్ప్రభువుగా భావించి ఈ కావ్యం రచించినట్లు వెంకట పార్వతీశ్వరులు "అవతారిక"లో ప్రకటించారు. తమకు "సంగీతమున కంటె గవితయందెమమత గలదని" విన్న వించుకున్నారు.

ఇది భక్తి సంబంధమైనకావ్యం. "అంకురారోపణం" "అమృతసేచనం" ఇత్యాది ఎనిమిదిభాగాలలో పూర్వ సంప్రదాయను బద్ధంగా నడచింది ఇది "శ్రీలాలితనవ గుణ మణి జాలా...." అంటూ కృతి భర్తృస్తోత్రంతో ప్రారంభమైన ఈకావ్యం "మంగళమహాశ్రీ"తో ముగిసింది. కేదారచక్ర వర్తికూతు రయిన 'బృంద' శ్రీకృష్ణుని వరించి, చిట్ట చివరకు అతని మనో నాయకునిగా చేసుకొనడమే ఇందలి ఇతివృత్తం. "కుమారసంభవం"లో పార్వతీపరిణయాన్ని తలపిస్తుంది ఈ కథ. ఆమె వివాహాన్ని పురస్కరించుకొని చేసిన వర్ణనలన్నీ కృతి భర్త పరిణయానికి సమన్వయించడమే కవుల ధ్యేయం,

## ఏకాంత సేవ

వీరి కావ్యాలలో బహుళ ప్రచారం పొందింది, విశిష్ట రచనగా కొనియాడబడింది ఇదే (1922)

ఇది మధురభక్తి పారమ్యమైన ఒక ఆధునిక కావ్యం. ప్రకృతీ పురుషుల ప్రణయగాథ ఇది. ప్రకృతి వన లక్ష్మి. పురుషుడు త్రిమూర్త్యాత్మక స్వరూపుడయిన సూర్యుడు. అహస్కరుడు అపరదిక్కాంతను చేరడంతో రాత్రంతా విరహంతో వేసారిన ప్రకృతికాంత ప్రాతః కాల సూచనలు దృగ్గోచరం కావడంతో సర్వసన్నద్ధంగా ప్రియుని చేరడానికి బయలుదేరింది. ఇంతలో అతడే ఎదురు వచ్చాడు. ఆమె ప్రేమ ఫలించింది, ఈకథాకథనంలో ఎక్కడా వాచ్యంచెయ్యకుండ ప్రగాఢమైన ఒక ప్రణయేచ్ఛగా, ఒక భక్తురాలు తనఆరాధ్యదైవాన్ని భర్తగా సంభావించి ఒకర్చే మధుర భక్తి సంబంధమైన ఆరాధనా తత్వంగా మలచి ధ్వనిగర్భితంగా కావ్య రచన గావించారు వీరు. ఈ కవులిద్దరైనా ఏక రూపులై ప్రకృతి సంబంధమైన వనలక్ష్మిలో పరకాయ ప్రవేశం చేసి, ఆమె విరహాన్ని తమదిగా చేసుకొని, కాంతునికై చేసిన ఆ కాంత "ఏకాంత సేవలో" అవతరించిన పురుషోత్తమునకు తమను తాము సమర్పించుకొని ధన్యులయినారు.

"శ్రీ విలాసంబుతో - జిద్విలాసమున,
కర్థతాత్పర్య సమాశ్లేషమయ్యె" ఇత్యాది మొదటి పద్యం "నాంది" లక్షణ ప్రయుక్తమై ఈ శ్రవ్యకావ్యాన్ని దృశ్య కావ్యంగా చేసింది.

"వరనందనోద్యాన వనలక్ష్మి నేను
తరుణ శృంగార మాధవుడవు నీవు
దివ్యమూర్తివి నీవు - దీప్తిని నేను
సర్వమంగళ నేను - శంభుండవీవు
నీకు దక్కితి నాకు నీవు దక్కితివి
ఏల దాగెదవింక హృదయాధినాథ (పు 18-19)

ఈ అద్వైత ప్రణయమే ఆ ప్రేయసీ ప్రియుల కలిపినది.

ఈ విధంగా వేంకట పార్వతీశ్వరుల కవిత ఒక ప్రత్యేక ముద్రతో తరువాతి కవులకు మార్గదర్శకంగా చూపింది.

# కలగూరగంప

## క్యూబిస్టుల కులపతి
## పాబ్లో పికాసో

ఇరవయ్యో శతాబ్ది మహోత్కృష్ట కళాకారుడు పాబ్లో పికాసో శతజయంతి ఇటీవల ప్రపంచమంతటా జరుపుకున్నారు. ఆయన ఆధునిక చిత్రకళకు పితామహుడు. క్యూబిస్టుల కులపతి. జగద్విఖ్యాత కళాతపస్వి.

పికాసో స్పెయిన్ దేశంలో మలగాలో 1881 అక్టోబరు 23 తేదీన జన్మించాడు. తండ్రి డ్రాయింగు టీచరు. పికాసో తన ఎనిమిదవ యేటనే వర్ణ చిత్రరచన ఆరంభించాడు. అతని చిత్రాల "వన్‌మాన్స్ ఎగ్జిబిషన్" అతను పద్నాలుగేళ్ళ బాలుడుగా ఉన్నప్పుడే జరిగింది.

1903లో పికాసో కళాకారులందరికీ అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ యాత్రాస్థలమైన ప్యారిస్‌వెళ్ళాడు. ప్యారిస్ నగరం ఆయన కళను పెంచి పోషించింది. అక్కడే స్థిరపడ్డాడు. నవ్యకళా రూపాలతో ప్రయోగాలు చేస్తూ అమేయమైన సృజనాత్మక కృషికి గడంగినాడు.

ప్యారిస్‌లో ఆయనకళాజీవితంలోప్రధానంగా రంగుల వాడకాన్నిబట్టి మూడు దశలున్నాయని కళా విమర్శకులు చెబుతారు. తొలినాటిది బ్లూ పీరియడ్ - అంటే నీలందశ. రెండవది పింక్ అనగా పాటల వర్ణం దశ. మూడవది నీగ్రో దశ.

1902 నుంచి 1905 వరకూ నీలం దశ రకరకాల నీల వర్ణఛాయల్లో ఆయన చిత్ర రచన చేసిన ఈ దశలో "జీవితం" అనే చిత్రం గొప్పది. ఈ దశలో ఖిన్నుడై ఆకలినీ, దారిద్ర్యాన్నీ సూచించే బిచ్చగాళ్ళను, వికలాంగులను మానవ అస్తిత్వంలోని వ్యాకులమునూ, విషాదాన్నీ ప్రధానంగా చిత్రించాడు.

1905 నుంచీ పికాసో పాటల వర్ణపుపలుచాయలలో చిత్రాలు వేశాడు. ఈ దశలో "అలంకరణ" చిత్రం ఎన్నదగింది. క్రమేణా చిత్రకారుడుగా ఖ్యాతి, పెద్దలు, రచయితలు, కళాఖండాల విక్రేతల ప్రాపకం సంపాదించాడు.

1907లో నీగ్రో దశ మొదలైంది. అంటే అతని చిత్ర రచనపై స్పానిష్, నీగ్రో శిల్పం ప్రభావం పడింది. ఈ దశలోనే కళాప్రపంచంలో ఆయన ఒక గొప్ప విప్లవం తీసుకొచ్చాడు అంతవరకూ పాశ్చాత్య చిత్రకారులు కళారంగంలో సాంప్రదాయికమైన సహజ వాదమును అనుసరిస్తూ ఉండేవారు. పికాసో ఆదిమమైన ఆఫ్రికన్ చెక్కడాల ఘనితనంచే ప్రభావితుడై ఒక అపూర్వ సంచలనం కలిగించాడు.

ఆధునిక చిత్రకళకు పికాసో ప్రధానంగా చేకూర్చిన విశిష్టత కళలో క్యూబిజం విధానాన్ని వ్యాప్తం చేయడం. వాస్తవానికి క్యూబిజాన్ని ప్రారంభించినవాడు పాల్ సెజాన్ (1839 - 1906). కాని ఆ విధానాన్ని కళారంగంలో ఒక కొత్తరీతిగా, ప్రపంచ వ్యాప్తంగా మేధావుల ఉద్యమంగా పెంపొందించిన వారు జార్జి బ్రాక్ (1882 - 1963), పికాసో. కంటికి కనిపించే వస్తువులను రేఖా గణిత సంబంధమైన ప్రక్రియల ద్వారా చిత్రించి చూపడం. ఈ విధమైన చిత్రణ వల్ల రూప వక్రీకరణ జరుగుతుంది. చూచేవారికి కొంత ప్రతి బంధకమూ ఏర్పడుతుంది. క్యూబిజాకు పికాసో ఇచ్చిన నిర్వచనం ఇది. "నేను ఒక కప్పును వేయాలనుకున్నప్పుడు దానిని గుండ్రంగానే చూపుతాను. కాని వర్ణ చిత్రంలో మొత్తంపై కన్పించే లయ - అంటే నిర్మాణ లక్షణం నన్ను గుండ్రదనాన్ని చతురస్రంగా చూపమని వత్తిడి చేస్తుంది" అన్నాడు. ఇది ఆయన 80వ యేట అన్న మాట. అంటే తాను క్యూబిజం అవలంబించిన యాభైఏండ్ల తర్వాత చెప్పిన నిర్వచనం. పైగా తాను జీవించే యుగ లక్షణాన్ని చిత్రించడానికి ఈ విధానం పికాసోకు ఎంతగానో ఉపకరించింది. పరిశ్రమలు వ్యాప్తిజెంది ఎన్నో రకాల యంత్రాలు రావడంతో మానవుడు మరుగుజ్జు అయిపోయి, వ్యక్తిత్వం కోల్పోయాడు. ఆ స్థితిని ఈ పద్ధతి వర్ణనాత్మకంగా ధ్వని ప్రాయంగా చిత్రించింది. ఏమైనా క్యూబిజం దృష్టిక్రమం సూత్రాలను తారుమారు చేసి, ఒక కొత్తపెర్‌స్పెక్టివ్‌ను స్థాపించింది. పికాసో కాలంతోపాటు పెరుగుతూ పోయాడు. లోకయథార్థం, పరిసరాలు వేగంగా మారిపో

తున్నాయి. ఈ పరిణామాన్ని కళలో చూపడానికి ఒక కొత్త చిత్ర భాష, అందులో విశిష్టమైన నుడికారాలు,జాతీయములు కావాలి.వాటిని ఎప్పటికప్పుడు సంతరించుకున్నాడు.

సగం ఎద్దు, సగం మనిషిగా కన్పించే గ్రీకు పురాణాలలోని మినోటార్ (గ్రీకుల పౌరాణికరాక్షసుడు)పికాసోను జీవితంలో చివరి వరకూ ఆకర్షించాడు. పికాసో ఆ రాక్షసుణ్ణి క్రౌర్యానికీ అంధకారానికీ ప్రతీకగా గ్రహించాడు. మానవునిలోని పాశవిక ప్రవృత్తికి అది చిహ్నం. దానిని "గెర్నికా" చిత్రంలో వాడుకున్నాడు. ఇది బ్రహ్మాండమైన పరిమాణం గల భిత్తి చిత్రం. దీనిని పికాసో 1937 లో వేశాడు. స్పెయిన్‌లో అంతర్యుద్ధం జరుగుతూ ఉన్న కాలంలో ఆదేశంలోని గెర్నికా అనే పట్టణంపై జర్మన్ ఫాసిస్టులు బాంబులు వేయగా ఆ మారణ హోమంలో అసువులు బాసిన నిస్సహాయులైన ప్రజల స్థితికి ఆగ్రహోదగ్రుడై పికాసో ఈ చిత్రం వేశాడు. యుద్ధ ఘాతుకాలకు వ్యతిరేకంగా కళాకారులు రచించిన ప్రబోధాత్మక కృతులలో ఇది సర్వశ్రేష్ఠమైనదని కళాభిజ్ఞులంతా అంగీకరించారు. ఈ చిత్రం కొన్ని దశాబ్దాలపాటు న్యూయార్కులోని మోడర్న్ ఆర్టు మ్యూజియంలో ప్రవాసంలో ఉండి, ఇటీవలనే మాడ్రిడ్‌లోని ప్రాడో చేరుకుంది. స్పానిష్ అంతర్యుద్ధం తరువాత ద్వితీయ ప్రపంచ సంగ్రామం, ఆ తర్వాత కొరియా, వియత్నామ్ వంటి సర్వనాశక మారణహోమాలు సంభవించాయి. పికాసో 1951లో "కొరియాలో జన సంహారం" 1952 లో "యుద్ధము-శాంతి" చిత్రాలు వేశాడు. కాని "గెర్నికా" ముందు అవి నిలువలేవు. కాబట్టే ఒక విమర్శకుడు దీనిని "వార్ అండ్ పీస్", "ఫేర్ వెల్ టు ఆర్మ్స్" నవలలతోనూ "వేస్ట్ ల్యాండ్" కావ్యంతోనూ పోల్చాడు. అంతటి కళామూల్యం కల రచన ఇది. యుద్ధ బీభత్సాన్ని, దాని వల్ల కలిగే వినాశాన్ని అద్భుతంగా వ్యక్తం చేసింది చిత్రం.

సమ కాలిక సామాజిక చైతన్యాన్ని ఈ విధంగా బహుధా ప్రదర్శించిన పికాసో మానవాళి మూల గుణాలకేసి విలోకించి తన మానవతా దృష్టినీ, ఆశావాదాన్నీ వెల్లడించాడు. ప్రాథమికమైన మానవత్వపు విలువలను పునరుద్ఘాటించి, సమాజ శ్రేయస్సుపట్ల ఆదుర్దా కనపరచాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో అణ్వస్త్రాల వల్ల జరిగే సర్వవినాశనాన్ని చూచాక, యుద్ధాన్ని జరగ నివ్వకుండా, నిరాయుధీకరణ జరగవలెనంటూ, శాంతిని కాపాడవలెనంటూ ప్రపంచంలో సర్వత్రా సార్వ జనీన వాంఛ వ్యక్తమైంది. ఈ వాంఛకు రూపకల్పన చేస్తూ 1947 లో తెల్లపావురం చిత్రాన్ని పికాసో రచించాడు. అది శాంతి ఉద్యమానికి సంకేతమై శాంతి కపోతమని పేర్వడసింది. పోలెండు, ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాలలో జరిగిన శాంతి మహాసభలలో పాల్గొన్నాడు. బహిరంగ సభలలో మాట్లాడటం ఇష్టం లేకపోయినా, ఇంగ్లండు శాంతి కాంగ్రెసులో "మృత్యువుకు ప్రతిగా జీవనాన్నీ, యుద్ధానికి బదులు శాంతినీ నేను సమర్థిస్తాను" అన్నాడు.

పికాసో స్వీకరించని వస్తువు లేదు. ప్రయోగించని శైలిలేదు. ఆయన అలవోకగా చేసిన రచన తరువాత ఒక శైలిగా వ్యాప్తిచెందేది. నగ్న మానవులను, ప్రకృతిని వ్యభిచారిణులను, మాతృమూర్తులను, ప్రేయసీ ప్రియులను



విశ్వవిఖ్యాత చిత్రకారుడు
పాబ్లో పికాసో

భిక్షువులను, ఇట్లా ఎందరినో చిత్రించాడు. కల్పనావాదం, వాస్తవవాదం, ఎక్స్ప్రెషనిజం, ఇంప్రెషనిజం, క్యూబిజం, సర్రియలిజం, ఇట్లా అన్ని రకాల "ఇజాల"లో తల దూర్చాడు. "సృజనాత్మకత అంటే వరుసగా అనేక నిర్మూలనలు" అని చిత్ర రచనలో వైవిధ్యంపట్ల తన వైఖరి చెప్పాడు. 1916 లో శాస్త్రీయ రీతికి మరలి, మానవ శరీరపు సహజ సౌందర్యానికి ముగ్ధుడై పదేండ్లపాటు నగ్న చిత్రాలు రచించాడు. 1925 లో అధివాస్తవికత వైపుకు మరలి స్వప్నాల, విపరీత కల్పనల అంతరిక జగత్తును ప్రతీకల ద్వారా వ్యక్తం చేశాడు. క్యూబిజం తరువాత విశ్లేషణాత్మక క్యూబిజం, సంయోగాత్మక క్యూబిజం దశలు వచ్చాయి. దాదాపు అన్ని మీడియంలలో – అంటే నీటి రంగులలో, తైలవర్ణాలలో, పాస్టెల్స్‌లో, పెన్సిల్ సిరా డ్రాయింగులలో, అప్లైడ్ ఆర్ట్స్‌లో తన కృతులు వెలువరించాడు. అచ్చులుపోసి లిథోగ్రాఫ్‌లు తీశాడు. శిల్పాలు చెక్కాడు. పింగాణీలలో కొత్త ఫేషన్లు తీర్చాడు. మొజాయిక్‌లు కూర్చాడు. భిత్తి చిత్ర నిర్మాణం చేశాడు. కళను ఎట్లా ఒక లీలా విలాసంగా పరిగణించాడో, తన జీవితాన్ని పంచుకునే స్త్రీల విషయంలోనూ ఎప్పటికప్పుడు వారిని మార్చుతూపోయాడని చెబుతారు. అయితే కళ విషయంలో జీవితాంతం వైయక్తికతను నిలబెట్టుకున్నాడు. చివరి నిమిషం దాకా నవ్యరీతులు కనుగొనవలెనన్న అభిలాష అట్లే ఉంది. చర్విత చర్వణం లేదు. ఒక బంధనంలో చిక్కుబడి ఉండడం లేదు. ఆయన అధికంగా కాంక్షించింది స్వేచ్ఛ. ఆలోచనలో, క్రియలో, అనుభవంలో స్వేచ్ఛ! సృజనాత్మకతలో స్వేచ్ఛా విహారం.

కొన్ని వేల కాన్వాసులు చిత్రించాడు. తన 85వ ఏట కూడా రాత్రి భోజనం చేసి నడిరేయి దాటే వరకూ చిత్రాలు వేస్తూ ఉండేవాడట 88 ఏండ్ల వయస్సులో 135 వర్ణచిత్రాలు, 45 డ్రాయింగులు వేశాడని చెబుతారు. 75 ఏండ్ల కాలంలో 20 వేల కళా ఖండాలు సృష్టించాడని అంచెనా. వర్ణచిత్రాలు, డ్రాయింగులు, ప్రింట్లు, శిల్పాలు, కూర్పులు, కొలెజెస్, పాటరీ-శైలిలో, సాంకేతిక విధానంలో మనిషిని ఉక్కిరి బిక్కిరి చేసే వైవిధ్యం! "నాకన్న చిత్ర రచన బలీయమైనది. అది తన ఇష్టం వచ్చిన పనిని నా చేత చేయిస్తుంది" అన్న కళా తపస్వి. అతని చిత్రం సగటు ధర లక్ష రూపాయలకుపైగా ఉండేది. కొన్ని ఇంకా ఎక్కువే!

పికాసో జీవితపు చివరి దశలో "నేను ఇంతకాలమూ ప్రజలనూ, కళా ఖండాలు సేకరించేవారినీ, కళా విమర్శకులనూ ఫూల్స్‌గా చేశాను" అని ఒక ప్రకటన చేసి లోకాన్ని దిగ్భ్రాంతం చేశాడు. కాని దీని అర్థం అతనిలో ప్రతిభలేక పోయినా లోకం అతనికి ఉరికే నీరాజనం లెత్తిందని కాదు. ఎవరూ అందరినీ అన్ని కాలాలపాటూ ఫూల్స్‌ను చేయలేరన్న సూక్తికి పికాసో అపవాద మేమీకాడు. గ్రహించుకోలేక లోకంపై ఒక చమత్కారం విసిరినాడు. కాని నిజానికి తన చిత్రణలో పరిచిత వస్తువులను అపరిచితాలు చేశాడు కదా! వాటిని గుర్తించి అర్థం చేసుకోవడం కష్టం. చాలా మందికి అర్థం కాక, అర్థం కాలేదంటే అవతలివారు నవ్వుతారేమో, అన్న సంకోచంతో ప్రశంసలు కురిపించినవారు లేకపోలేదు. అతనిది హృదయానికి అందే కళకాదు. గణిత సమస్యలవలె బుద్ధిబలంతో అర్థం చేసుకోవాలి. ఇట్లా కళా ప్రపంచాన్ని కొంత తికమక పెట్టాడు. ఊహలో కల్పనలో ఎంతటి దక్షుడంటే మరొకరి ఊహకు అందకుండా పోయే కళాకారుడు!

93 ఏళ్ళు జీవించి, జీవించి ఉండగానే పురాణ పురుషుడుగా లోకంచే కీర్తింపబడి 1973 లో పికాసో కాల ధర్మం చెందాడు.

హోమర్, డాంటే, షేక్స్పియర్, మైకెలేంజెలో లియొనార్డోదావించి, బిథోవెన్, గెథేవంటి మహామహులవలె, ఆధునికపాశ్చాత్య మహాపురుషులలో పికాసో చిత్రకారుడుగా స్మరింపదగ్గవాడు.

శ్రీ డి. రామలింగం.

# వేదులవారి దీపావళి

ఇరవయ్యో శతాబ్దపు తొలి దశాబ్దాలు భారత దేశాన్ని రాజకీయంగా చైతన్యవంతం చేసినట్లే, కవిత్వ రంగంలోనూ నూతనోత్తేజాన్ని కలిగించాయి. అంతవరకూ పురాణేతిహాసాల నుంచి వస్తువును స్వీకరించి రచనలు చేస్తూ వచ్చిన కవులు నూతన మార్గాలను అన్వేషించటం మొదలు పెట్టారు. ప్రబంధాదులలోని వర్ణనలన్నీ ఒకే మూసలో పోసినట్లుండి విసుగు పుట్టిస్తున్నాయనీ, ఆధునికకాలానికీ,సమాజానికీ తగినవిధంగా కవిత్వ రచనచేయాలనీ,వారు అభిప్రాయ పడ్డారు దీనికి తోడు పారతంత్ర్యంలో మ్రగ్గుతున్న భారతీయులలో స్వాతంత్ర్య వాంఛ ఉద్ధృతమై, ఆసేతు సీత నగపర్యంతం దేశాన్ని కుదిపి వేసింది. వీటన్నిటి ఫలితంగా దేశంలోని ఇతర భాషా సాహిత్యాలలో వలెనేతెలుగులోనూ నవ్యకవిత్వానికి నాంది పలకటం జరిగింది దీనికి ఆద్యులు గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు గార్లు.

భారతదేశం మూడు శతాబ్దాలు పైబడి ఆంగ్లేయుల పరిపాలనలో వుండటంవల్ల ఆంగ్లం రాజభాష కావటం తెలుగు కవులు ఆంగ్ల సాహిత్య ప్రభావానికి లోనుకావటం జరిగింది. ఆంగ్ల సాహిత్యంలో 19వ శతాబ్దిలో ప్రారంభమైనకాల్పనికోద్యమం ఒక శతాబ్దం ఆలస్యంగా తెలుగు కవులను ఆకర్షించింది. ప్రకృతిప్రీతి, గత వైభవ పునరుద్ధరణం, ప్రణయతత్త్వం, ఆత్మాశ్రయిత్వం, అద్భుతత్వం, సాహసప్రియత్వం ఆంగ్ల కాల్పనికోద్యమం ప్రధానలక్షణాలు. వర్డ్స్ వర్త్, కాలరిడ్జి, షెల్లి, కీట్స్ ప్రభృతుల నాయకత్వంలో కాల్పనికోద్యమం మూడు పువ్వులూ ఆరు కాయలుగా విలసిల్లింది. ఆ ఉద్యమం నుంచి ప్రకృతి ప్రీతి, ప్రణయ తత్త్వం, ఆత్మాశ్రయత్వాలను స్వీకరించి, వాటికి దేశభక్తి సంఘ సంస్కరణ వంటి లక్షణాలను మేళవింప జేసికొని కవిత్వ రంగంలో ఒక నూతనోద్యమం ప్రారంభమైంది. కాలక్రమాన ఈ ఉద్యమానికి భావకవిత్వోద్యమమనీ, కవులకు భావకవులనీ పేర్లు స్థిరపడ్డాయి.

నిజానికి 1940 ప్రాంతాలలో చురుకుగా రచనా వ్యాసంగం సాగిస్తున్న కవులందరూ కొద్దిగానో గొప్పగానో ఈ ఉద్యమ ప్రభావానికి లోనైనవారే. విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, కాటూరివెంకటేశ్వరరావు, జాషువా, నండూరి సుబ్బారావు, బాపిరాజు ప్రభృతు లందరూ అప్పట్లో భావకవులే. ఆ తరువాత వచ్చిన అభ్యుదయ కవిత్వోద్యమానికి నాంది పలికిన శ్రీశ్రీ తొలిరచనలలో భావకవిత్వచ్ఛాయలు స్పష్టంగా కనబడుతై. ఐతే భావకవిత్వోద్యమ వ్యాప్తికి కవులెందరో దోహదం చేసినా, భావకవిత్వానికి ప్రాణ ప్రతిష్ఠచేసి దానికొక విశిష్ట స్థానాన్ని కల్పించినవారు కొద్దిమంది మాత్రమే. వారిలో అగ్రశ్రేణిలో నిల్చినవారు గౌతమీకోకిల వేదులసత్యనారాయణశాస్త్రిగారు.

సత్యనారాయణశాస్త్రిగారి కవితా సంపుటి "దీపావళి" అటు పండితులనూ ఇటు పామరులనూ కూడా రంజింప జేసింది. భావకవిత్వరథసారథులలో ముఖ్యులైన కృష్ణశాస్త్రి ప్రభృతులు ఆంగ్లభాషలోనిష్ణాతులు కావడం చేత ఆంగ్ల కవుల ప్రభావం వారిపై చెరగని ముద్రవేసింది. ఆంగ్ల కాల్పనికోద్యమ నిర్మాతలైన షెల్లీ, కీట్సుల భావాలు వారికి తెలియకుండానే వారి కవితలో చోటు చేసుకున్నాయి. ఐతే సంస్కృతం, హిందీ, బెంగాలీ వంటి భారతీయ భాషలలో పండితులైన సత్యనారాయణశాస్త్రిగారు, ఆంగ్ల భాషా వాసన అంతగా లేనివారు కావటంచేత వారి కవిత సిసలైన తెలుగు కవితగా రూపొందింది, తెలుగువారి హృదయాలకు మరింత చేరువైంది.

చెప్పిన దానినే తిరిగితిరిగి చెప్పటం తగదనీ, గతించి పోయిన దాని కోసం వెత చెందటం విజ్ఞతకాదనీ శాస్త్రిగారు ఎంతో సూటిగా సున్నితంగా చెబుతారు.

"తొడిమ వీడిన పూవు త్రోవచూడదు తీవ
ధూళిరాలిన పండుతో పోదు పాదపము
గాలిగలసిన పాటకై పక్షి వెత పడదు
తరగ విరిగిన మహోదధి తీసిపోవదు" - అంటూ

ప్రాతనంతా పైకి తోడుతూ నెమరు వెయ్యటం పశుత్వ లక్షణం అని మందలిస్తారు.

శాస్త్రిగారి కవిత్వంలో ప్రధానంగా కనుపించే లక్షణం వారికిగల ప్రగాఢమైన దేశభక్తి, తనను తానొక పుష్పంగా ఊహించుకుంటూ ఆ పుష్పం ఆశయాన్ని "కాంక్ష" అన్న ఖండికలో వారెలా వివరిస్తారో చూడండి.

"నాకుఁ దలంపులేదు లలనా జనతా కబరీ భరైక భూ
షాకలనన్, సతీమృదు భుజాంతరతల్పకు చోపగూహ బి
బ్బోకమునన్, వధూసితకపోల గళచ్ఛవి వణావతంసహే
వాకమునన్, విలాసినుల పాపట చెందిర కావిపూతలన్
కాసుకనై ధరాధికపుల కాళ్ళకడం చొరలాడి వాడి పో
లేను, ధరాపరాగ పటలీ మలినమ్ముగు ద్వారతోరణా
స్థానము నందు రింబడగఁజాలను, దోసిటిపేరి ఘోరకా
రానరకమ్ము నందు సురుగాల్పగలేను నిమేషరక్తికై
నీచపు దాస్యవృత్తి మననేరని భారత మాతృదేశసే
వాచరణమ్ము నందసువులర్పణ జేసినవారి గార్ధిప
శ్రీ చెలువారు చోటఁ, దదసృగుచులన్ వికసించి, వాసనల్
వీచుచు, రాలిపోవగవలెందు దుదాత్తసమాధి మృత్తికన్"

ఇంత విలక్షణమైన భావ తీవ్రతగల రచన కావటం వల్లనే "కాంక్ష" ఆ రోజుల్లో సహృదయుల నెంతగానో ఆకట్టుకుంది. ఈ శీర్షికలోని పద్యాలన్నీ అప్పట్లో కవితాభిరుచిగల సహృదయుల నాలుకలమీద ఆడుతూండే వనటంలో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు.

మతాన్నీ, దైవాన్నీ గురించి కూడా శాస్త్రిగారికి నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. భగవంతునిపై ఆయనకు అచంచలమైన అభిప్రాయాలున్నాయి. భగవంతునిపై ఆయనకు అచంచలమైన విశ్వాసం వుండటానికి ఉదాహరణగా చూపించదగ్గ పద్యాలెన్నో దీపావళిలో వున్నాయి. ఐతే దేవాలయాల్లో మనం ప్రతిష్ఠిస్తున్న రాతిబొమ్మలూ వాటి పేరుమీద మతోన్మాదంతో జరుగుతున్న మారణహోమం ఆయనకు ఆమోదయోగ్యం కావు. మత ప్రచారానికి కంకణం కట్టుకున్న స్వాములు "కలిమి కలవానిబానిస కొడుకులు" అన్న వేమన భావాలనే శాస్త్రిగారెలా వ్యక్తం చేస్తారో చూడండి.

"పేదల రక్తమాంసములఁ బెంపు వహించి దయా
సుధారసా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ముకై మతో
న్మాదము పెంచుదేవునికి మారుగనిల్చినరాతిబొమ్మలం
దూదర వోవుపాడు బ్రతుకొక్క నిమేషము సైప
నా యెదన్"

"దరిద్రులైన ధనవంతులు" వంటి ప్రయోగాలు శాస్త్రిగారి ఉక్తివైచిత్రికి నిదర్శనాలు.

భావకవులందరి వలెనే శాస్త్రిగారూ ఒక ప్రేయసిని ఊహించుకున్నారు. ఆ ఊహా ప్రేయసి ఆయనకు "స్వప్న లోకరాజ్ఞి"గా "కవి భావనా విలాసినీ నిత్య సైరంధ్రి"గా భాసించింది.

వస్తువు భావం, రచన కవిత్వానికి మూడు అంగాలను కుంటే వస్తురచనలకన్న భావానికి ప్రాధాన్యం ఇవ్వటం ఇతర భావకవులవలె శాస్త్రిగారి రచనలలోనూ కనబడుతుంది.

"సుధాకరా" అన్న ఖండికలో

"నీవొక అప్సరః ప్రణయినీ కబరీచ్యుత పారిజాతమూ
లావి సరంబవో, మఱి ఇలా తరుసుంటు సుధాతుషార వ
ర్షా విమలావకుంఠనము జార్చుచు బోవు శరద్విభావరీ
దేవి లలాటికా మణివొ, దీపికవో సురరాజ్యలక్ష్మికిన్"

అంటూ చందుర్ణి వర్ణించిన తీరు శాస్త్రిగారి భావనా శక్తికి నికషోపలంగా వుంది.

భావకవిత్వంలోని శాఖలలో ముఖ్యమైన మరొకటి స్మృతి కావ్యరచన. ఆంగ్ల భాషలో ఎలిజీ అని పిలబడుతున్న స్మృతికావ్యాలను భావకవులెందరో రచించారు. అయితే స్థూలంగా పరిశీలిస్తే శాస్త్రిగారు ఈ ప్రక్రియ జోలికి పోలేదేమోననిపిస్తుంది. కానివారి "ఆషాఢమేఘము" చదివితే ఒక విధంగా అది స్మృతి కావ్యమేననిపించక మానదు. స్మృతి అనేది ఒక వ్యక్తికి సంబంధించింది కాని ఒక సంఘటనకు సంబంధించిగాని ఉండవచ్చు. నిజానికి వారి "ఆషాఢమేఘము" కాళిదాసు మేఘసందేశాన్ని మనకు గుర్తు చేస్తుంది. ఆ కారణంచేత ఈ ఖండిక మేఘసందేశానికి అంటే కావ్యానికి స్మృతి కావ్యం అనవచ్చు.

శాస్త్రిగారు తాము దర్శించిన మేఘాన్ని గూర్చి ఒక విచిత్రమైన భావనచేస్తారు. విరహార్తుడెవరైనా తనహృదయేశ్వరి సన్నిధికేగజాలిన వార్తావహానికోసమై ఏ గిరి నితంబ తటమ్మునో ఒక్కి వాపోవుచున్నావా అని మేఘాన్ని

ప్రశ్నిస్తారు. మేఘం అచలేంద్రుడు ఔదల ధరించిన మేలి హారంగు నీలిపాగావలె ఉన్నదనటం మేఘాన్ని "ప్రవాస దుఃఖిత మనః ప్రవణోత్సవమా!" అని సమాసంలో సంబో దించడం ఈ ఖండిక కవితా సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తున్నాయి.

అలనాటి ఉజ్జయినీ, అలకా నగరీ ప్రయాణ సమ్మో దము, ప్రేమభరముగ్ధుడు నాటిగిరి ప్రవాసి, లేకపోయినా నావి మర్యాద ప్రవాసి బాంధవుడవై భానూదయ చిత్రి తేంద్ర ధనురుజ్జ్వల మూర్తివి నీవు కనుపిస్తావని మేఘంతో అనడం ప్రకృతి శాశ్వతత్వాన్ని అందంగా చెప్పడమే అవు తుంది.

ఈ విధంగా దీపావళిలోని ప్రతి ఖండికా సహృదయ హృదయరంజకంగా సాగి పాఠకులను ఆనంద లోకాల్లో విహరింప చేస్తుంది. సుప్రసిద్ధ సాహిత్యాచార్యులు శ్రీ దివా కర్ల వెంకటావధానిగారన్నట్లు సత్యనారాయణ శాస్త్రిగారి రసపత్తుండకావ్యాలు భావగంభీరములు. ప్రసాదగుణ భాసు రములు, ధారా శుద్ధి దంతురములు అయిఉండి ఒక వంక వారి పాండితీ పాటవాన్ని, వేరొక వంక వారి ప్రతిభా వైభ వాన్ని, ఇంకొకవంక వారి పదప్రయోగ ప్రౌఢిమను చాటుతూ ఆంధ్ర రసికవతంసుల అసదృశప్రశంసలను అందుకుంటున్నవి. [ఆకాశవాణి సౌజన్యంతో]

# మన ఆర్థిక వ్యవస్థ చిర కాలపు సమస్యలు

మన ఆర్థిక వ్యవస్థ చాలా కాలంగా అనేక సమస్యల ప్రభావానికి లోనగుచున్నది. ఆకాశాన్నంటే ధరలు, పెరిగి పోతున్న నిరుద్యోగిత, గ్రామీణ ప్రజలు నిరంతరంగా పట్టణ ప్రాంతాలకు వలసపోవడం, తరిగి పోతున్న వాస్తవ వేతనాలు, తద్వారా పడిపోతున్న జీవన ప్రమాణం, నామ మాత్రమయిన వృద్ధిరేటు మొదలైనసమస్యలు ఈ వ్యవస్థను నిరంతరంగా పీడిస్తాయా అనే ఆందోళన ఏర్పడుతున్నది.

1950-1960 దశాబ్ద కాలం మొత్తంలో ధరల పెరుగు దల రేటు 6.1 శాతం ఉండగా, ఇది 1960-1970 దశాబ్దంలో 81.5 శాతానికి పెరిగింది. కాగా 1970-1980 దశాబ్ద కాలంలో ఈ ధరల పెరుగుదల రేటు 124 శాతమునకు రికార్డు అయింది.(1) ఈ ద్రవ్యోల్బణ పరిస్థితి మూలాన సామాన్య మానవుని ఆర్థిక పరిస్థితి క్షీణించి పోవుచున్నది.

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీలలో నమోదు చేసుకున్న నిరుద్యోగుల సంఖ్య ఏప్రిల్ 980 నాటికి 1,48,43000 కు చేరింది. (2) క్రమంగా ఉద్యోగి తావకాశాల పెరుగు దల రేటు తగ్గిపోయింది. సంఘటిత పరిశ్రమలలో ఉద్యోగి తావకాశాలు 19 0 దశాబ్దంలో సంవత్సరానికి 3.8 శాతము చొప్పున (కాంపౌండు రేటు) పెరగ్గా 70 వదశాబ్దంలో అది 3 శాతమునకు తగ్గినది.

వ్యవసాయ యాంత్రికీకరణ ఫలితంగా గ్రామీణ పరిశ్రమలు క్షీణిస్తున్నందువల్ల, అత్యధిక జనాభా పెరుగుదల రేటువల్ల వ్యవసాయ కార్మికుల - నిరుద్యోగుల సంఖ్య నానాటికి పెరిగిపోవుచున్నది. 1960 లో మొత్తం జనాభాలో ·ు శాతం కార్మికులు ఉండగా 1971 నాటికి వీరి సంఖ్య జనాభాలో 31 శాతానికి చేరుకున్నది. అదే సమయంలో వ్యవసాయదారుల సంఖ్య 60 శాతము నుండి 52 శాతము నకు తగ్గినది. 1950 దశాబ్దంలో తలసరి ఆదాయం 19.9 శాతం పెరగ్గా 1960 వ దశాబ్దంలో ఈ పెరుగుదల రేటు 13.2 కాగా 1970 వ దశాబ్దంలో ఇది 9.8 శాతమునకు పడి పోయింది. ఇదే దశాబ్దములలో తలసరి ఆదాయం సగటున సంవత్సరానికి క్రమంగా 1.34, 1.24, 0.94 శాతం చొప్పున పెరిగింది (3) మన ఆర్థిక వ్యవస్థ ఈ పరిస్థితులకు గురి కావటానికి గల కారణాలను గూర్చి ఈ వ్యాసంలో ఒక సామాన్య పరిశీలన చేయుటం జరిగింది.

ఒక దేశ ఆర్థికాభివృద్ధిలో, ఆ దేశంలో అందుబాటులో వున్న వ్యవస్థాపనా మూలధనం అత్యంత కీలకమైన పాత్ర వహిస్తుంది. అంతేగాక లభ్యమయిన ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఉప యోగించుట చాలా ముఖ్యమయిన అంశం. దురదృష్టవ శాత్తు మన దేశంలో బొగ్గు, స్టీలు, సిమెంటు, రవాణా, విద్యుచ్ఛక్తి మొదలగు వ్యవస్థాపనా వనరుల ఉత్పాదక శక్తిని వీలయినంత ఎక్కువగా ఉపయో

గించలేక పోతున్నాము. గత సంవత్సరము ఉప యోగించిన ఉత్పాదక శక్తి 40 శాతం మాత్రమే. (4) వ్యవసాయ పారిశ్రామిక రంగాల ఉత్పత్తులు తగ్గిపోవ డానికి ఇది ప్రధానమయిన కారణము. పైవేటు ఉద్యమ దారుల అధిక లాభార్జనా పద్ధతులు దానికి తోడైనాయి.

పైవేటు గుత్త పెట్టుబడిదారులు తమ లాభంరేటును పెంచుకోవడానికి ఉత్పత్తి పరిమాణాన్ని పరిమితిలో ఉంచు తున్నారు. అదనపు ఉత్పత్తి చేయుట వలన ధరలు తగ్గి లాభము రేటు తగ్గుతుందేమోనన్న భయం వీరిది. అంతే గాక దేశంలోని పైవేటు ఉత్పత్తిదారులు ఆర్థికవ్యవస్థలో గుత్తాధిపత్యము బలపరచుకోవడానికి తమ విలువను ఉప యోగిస్తున్నారు. ఒకరి మూలధనం మరొకరు హరించా లని, ఏక స్వామ్యపు మార్కెట్టును స్థాపించుకోవాలని పోటీ పడుతుంటారేకాని అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని కను క్కోవడానికిగాని, నవ కల్పనకుకాని,అదనపు నికర పెట్టు బడులను సమకూర్చడానికి చేయు ప్రయత్నము చాలా స్వల్పము. ఒక వేళ ధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని పరి శోధించి నవకల్పనలను చేసేవారు ఏ కొద్దిమంది వున్నా వారు అణిచి వేయబడుతున్నారు. దీనికి ఉదాహరణ: బి. హెచ్ ఇ.ఎల్ – సీమెన్స్ ఒప్పందము.

ఇక నిత్యావసరవస్తువుల పంపిణీలో చట్టావ్యాపారము సాగించి అధిక లాభాలను పొందడానికి ప్రయత్నిస్తున్న వారి సంఖ్య పెరిగిపోతున్నది. వ్యవసాయరంగంలో మిగులు ఉత్పత్తులు సాగించి నప్పటికిని, విదేశీ మారకపు ద్రవ్యపు నిలువలు పెరిగి పోతున్నప్పటికిని కోట్లాది ప్రజలు, కొనుగోలు శక్తి కొరతవలన కుపోషణతో బాధపడుచున్నారు. ఆకలిచావుల వార్తలు అనేకం వింటున్నాం. పెట్టుబడి దారి వ్యవస్థలో ప్రజలు తాము ఉత్పత్తి చేసిన వస్తువులు తామే కొనుగోలు చేయలేకపోతారు. అసంఘటిత కార్మికుల బేరమాడే శక్తి అతి తక్కువ వుండుటవలన వారికి కావల సిన ఆహారము, బట్టలు, నివాసము కనీస స్థాయిలో కూడా పొందలేకపోతున్నారు. మన దేశం నూలు బట్టలు ఉత్పత్తి చేయు ముఖ్య దేశాలలో ఒకటి అయినప్పటికిని చిరిగిన బట్టలు ధరించిన అనేక మంది మన మహా నగర వీధులలో కనిపిస్తారు.

కొద్దిమంది పారిశ్రామికవేత్తల స్వాధీనములు అపార మయిన ఆర్థిక శక్తి కేంద్రీకృతం కావడం ఇందులకు ఒక కారణం. వ్యవసాయరంగంలో కూడా 10 శాతము భూస్వా ములు దాదాపు 60 శాతము భూమిని స్వాధీనము చేసికొని యుండగా, అనేకమంది సన్నకారు మరియు ఉపాంత రైతులు 9 శాతము వ్యవసాయ యోగ్యమయిన భూమిని కలిగియున్నారు. (5) ఒక వంక పైకారణాల మూలాన కార్మికుల చిన్నరైతుల కొనుగోలు శక్తి క్రమేణ తగ్గిపోవు చుండగా మరొక వంక భాటకం, వడ్డీ రూపంలో పీడింపబడు చుండటం వలన వీరి ఆర్థిక పరిస్థితి ఇంకను క్షీణించు చున్నది.

పేద వర్గాలవారి కొనుగోలు శక్తి పెంచవలసిన అవ సారాన్ని గుర్తించి ప్రభుత్వం నాలవ ప్రణాళిక ఆరంభం నుండే సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ, సమగ్ర గిరి జనాభివృద్ధి సంస్థ సమగ్ర గ్రామీణాభివృద్ధి సంస్థల ఆధ్వ ర్యంలో కొన్ని పథకాలను చేపట్టినను వాటిని అమలు పర్చ డంలో అనేక లోపాలు–ఇబ్బందులు వుండుటవలన ఆశించిన ఫలితాలు పొందలేక పోతున్నారు. ఈ అభివృద్ధి పథకాలు అమలు పరచటంలో ప్రజల సహకారము లోపించకుండా చూడాలి. ప్రభుత్వ పంపిణీ విధానపు లోపం వల్ల కనీసావ సర వస్తువులు స్వేచ్ఛా మార్కెట్టులో లభించుట కష్ట సాధ్య మయింది. మోహన్ ధారియా కమిటి సిఫారసు చేసిన పన్నెండు రకాల వినియోగ వస్తువులు పూర్తిగా ప్రభుత్వ ఆధ్వర్యంలో సమర్థవంతంగా పంపిణీ చేయువలసియున్నది. ప్రణాళికా వ్యయం పేరిట పెరుగుతూన్న లోటు బడ్జెట్టును తగ్గిస్తూ ధరల పెరుగుదలను అరికట్టవలసియున్నది. కొన్ని విదేశీ వినియోగ వస్తువులకు ఇస్తున్న సబ్సిడీని తగ్గిస్తూ వాస్తవిక వనరులను పెంచవలయును. మధ్యతరహా సాంకే తిక పరిజ్ఞానం నవ కల్పన చేయుట ద్వారా ఆర్థిక శక్తి వికేంద్రీకరణ చేస్తూ ఉద్యోగితావకాశాలను పెంచవలసిన అవసరం ఎంతైనా వుంది. సిమెంటు, బొగ్గు, విద్యుఛ్ఛక్తి స్టీలు రవాణా మొదలగురంగుల ఉత్పాదకశక్తి వినియోగాన్ని అధికం చేయవలసిన అవసరం వుంది. పది శాతం ఉత్పా

దళశక్తి వినియోగాన్ని పెంచుట ద్వారా ఆర్థికవ్యవస్థలోని కొరతలను తగ్గించ వచ్చునని కె.కె.బిర్లా అభిప్రాయం. (రచయితలు కాకతీయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా ఉంటున్నారు)

## అధోజ్ఞాపికలు

1. వైట్‌పేపర్ ఆన్ నేషల్ ఎకౌంట్స్ స్టేటిస్టిక్స్ ఫర్ 1970-79 (సెంట్రల్ స్టేటిస్టికల్ ఆర్గనైజేషన్)
2. ఇండియన్ లేబర్ జర్నల్ - ఆగస్టు 19 0
3. మొదటి అధోజ్ఞాపిక
4. 5-5-1980 "హిందూ" పత్రిక (డిస్కషన్ ఆన్ "ది స్టేట్ ఆఫ్ ది ఎకానమీ")
5. కుట్టి మీనన్ "ఇండియన్ ఎకనమిక్ క్రియిసిస్" (ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ 24-9-1980)
6. కె. కె. బిర్ల, "సండే" 14-9-1980. పత్రికలో ఎమ్. జె. అక్బర్‌తో ఇంటర్వ్యూ.

శ్రీ కె. వెంకట నారాయణ

శ్రీ ఎ. సదానందం

## లేఖలు

## స్వాగతము

భారత భారతీ! పరమ
పావన మంజుల భాషిణీ! శుభ
స్ఫోరక వాఙ్మయీ! కని సు
షుప్తి రవంత నితాంత కాంతితో
స్ఫార కవిత్వ విశ్రుతవి
శారదవై నవజీవనోన్నతిన్
భూరి మనోహరాంగివయి
పొల్పుగ రమ్మిక స్వాగతంబిదే!

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

## యువరచయిత(త్రు)ల మహాసభలు

సాంస్కృతీ సమాఖ్య (యువ సాహితీ వికాస వేదిక) కడప జిల్లా విభాగం పక్షాన మార్చి నెల మొదటివారంలో యువ రచయిత(త్రు)ల మహాసభలు నిర్వహించబడతాయి.

ఆధునిక సాహిత్యం లోని వివిధ ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాసాలు, వర్ధమానుల చర్చలు, గోష్ఠులు, కథాకవితా సమ్మేళనం వుంటాయి. ఇవిగాక ప్రత్యేక ఆకర్షణలుగా మినీకవితా ప్రదర్శన, పుస్తకప్రదర్శన, సాంస్కృతిక కార్యక్రమాలు వుంటాయి.

కడప జిల్లాలోని యువ రచయిత(త్రు)లు ప్రతినిధులుగా, ఇతర జిల్లాలలోని యువరచయిత(త్రు)లు సౌహార్ద్ర ప్రతినిధులుగా విచ్చేసి మహాసభలను విజయవంతం చెయ్యవలసినదిగా సాంస్కృతీ సమాఖ్య కడప జిల్లా విభాగం అధ్యక్షులు శ్రీ రాధేయ కార్యదర్శి శ్రీ తేజస్వీత గారు తమ సంయుక్త ప్రకటనలో తెలియజేస్తున్నారు.

యువరచయిత[త్రు]లు తమ తమ వివరాలను తెలియజేస్తూ, స్వంత చిరునామాగల కవరును జతపర్చి, కార్యదర్శి, సాంస్కృతీ సమాఖ్య, 10-139, బెల్లం మండి విధి, కడప -516 001 అను చిరునామాకు పంపి మహాసభల వివరాలను పొందవలసిందిగా కోరుచున్నారు.

కార్యదర్శి,
సాంస్కృతీ సమాఖ్య

## కథా సాహితి

13.12-1981 న కాళీపట్నం రామారావుగారితో హైదరాబాదులోని సామాజిక చైతన్యంగల కథా రచయితలు కొంతమంది ఇష్టాగోష్ఠి జరిపారు. వర్తమాన కథాసాహిత్యం

గురించి, దానిలోని విభిన్న ధోరణులను గురించీ చర్చించడం జరిగింది. కథా రచయితల సమస్యల గురించి, మంచి కథలు అతి తక్కువగా రావడం గురించీ చర్చించుకోవడం జరిగింది.

మంచి కథని పెంపొందించేందుకు రచయితులకు ఒక వేదిక అవసరమని భావించి "కథాసాహితి" అనే వేదికను ఏర్పాటు చేసుకోవడం జరిగింది. రచయితలు మంచి కథలు రాసేందుకు, పాఠకులకు మంచి కథలపట్ల అభిరుచి కల్పించేందుకు కృషి చేయాలని నిర్ణయించుకోవడం జరిగింది.

ఈ వేదిక సామాజిక అవసరాలను, సమాజాభివృద్ధిని కాంక్షించే రచనలకు అండగా నిలుస్తుంది. పెడధోరణులకు వ్యతిరేకంగా మంచి కథలను అందిస్తుంది. పాఠకులలో ఉత్తమాభిరుచులను పెంచుతుంది.

ఈ లక్ష్యాలదృష్ట్యా కథాసాహితి వేదిక తరఫున "కథ" అనే బులిటెన్ వెలువరించాలనుకుంటున్నాం. పై లక్ష్యాలతో ఏకీభవించే రచయితలు సభ్యులుగా చేరి వేదిక కార్యక్రమాలకు అండదండలు అందించాలని మనవి.

కథా రచయితలే కాక సంస్థలు, సానుభూతి పరులు తమ సహాయ సహకారాలు అందిస్తారని ఆశిస్తున్నాం. తెలుగులో మంచి కథలు వెలువడ్డానికి జరిగే కృషిలో పాలుపంచుకోవలసిందిగా విజ్ఞప్తి.

చంద్ర, ఎం. పార్ధసారధి, బి నరసింహారావు, కె కె. మీనన్, వీరభద్రరావు పమ్మి గారలతో ఒక ఎడిటోరియల్ బోర్డునీ ట్రెజరర్‌గా లిపారియా గారినీ ఎన్నుకోవడం జరిగింది.
అడ్రసు: కన్వీనర్, 1-8-1/117 సూర్యానగర్, చిక్కడపల్లి హైదరాబాద్.

జయధీర్ తిరుమలరావు
కన్వీనర్

# ఉషతో ఒక్క మాట!

## శ్రీ దీవి శ్రీనివాసాచార్యులు

వ్యియత్తలం నుంచీ
విశ్వకుహరం లోకి
మనస్సు నిండా
పయస్సు నింపుకు;
ప్రతి దినం దిగివచ్చే
ఉషా బాలా,
నీ వయస్సెన్ని యుగాలు?

వన్నె తరుగని
నీ రాగ రేఖలు,
చిన్ని పాపల
కనుల మెరిసే
బోసి నవ్వుల
రాసి సుమా!
వాని వన్నెల మూల మేమో?

[ఋగ్వేదం లో ఒక ఋక్కు చదివాక ఈ పంక్తులు వ్రాయడం జరిగింది. విశ్వామిత్రుడి మనస్సులో పొంగిన కవితావేశాన్ని ఆ ఋక్కు వ్యక్తంచేస్తుంది.]

# గ్రంథ విమర్శలు

## కావ్యాలంకార సూత్రాణి

(వామనుని స్వవృత్తితో కూడిన సూత్రములు. బాలానందిని అను వ్యాఖ్యానముతో కూడినవి. వ్యాఖ్యాత-డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు. డెమ్మీ 18+240 పేజీలు. వెల 15 రూ. లు. ప్రతులకు - శ్రీమతి పుల్లెల సుబ్బలక్ష్మి, ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు-500 007)

ప్రాచీనాలంకారికులలో ప్రసిద్ధుడైన వామన పండితులు కావ్యలక్షణాలను గురించి సంగ్రహంగా సూత్రాలు రచించి, వాటికి స్వయంగానే వృత్తి నించించాడు. ఇందులో అయిదు అధికరణాలు-శారీరం, దోషదర్శనం, గుణవివేచనం, ఆలంకారికం, ప్రాయోగికం అని వాటి శీర్షికలు. మొదటి దానిలో కావ్య స్వరూపం వివరించబడింది. రెండవ దానిలో దోషాలను గురించీ, మూడవ దానిలో శ్లేషాదులకు కావ్య గుణాలు వివరించబడినవి. తర్వాత అధికరణంలో శబ్దార్థాలంకారాలను గురించి ఉన్నది. చివరి అధికరణంలో కవి సమయాలు, శబ్దాల సాధుత్వాసాధుత్వాలు చెప్పబడినవి.

కావ్యానికి ధ్వనియే ఆత్మ - అనేవాదం ధ్వనికారుని నుండియే బహుళ ప్రచారానికి వచ్చింది. తర్వాత మహిమభట్టు, కుంతకుడు ధ్వని మార్గాన్ని వ్యతిరేకించినా, మమ్మటాదులు ధ్వనివాదానికి స్థిరత్వం కల్పించారు. ఆనందవర్ధనునికంటె - (ధ్వనికారుని కంటె) ప్రాచీనుడగుటవల్ల భామహాదుల పద్ధతినే అనుసరించి ధ్వనిసంగతిని ఎత్తక గుణాలంకారాలను మాత్రమే వివరించాడు. గుణాలంకారాలు ఉండడం కంటే దోషాలు లేకుండా ఉండడమే ముఖ్యం అగుటవల్ల కావ్యలక్షణాన్ని వివరించిన పిదప దోషాలను గురించి చెప్పవలసి వచ్చినది.

ఈ సూత్రాలకూ వృత్తికీ దమారమి అర్ధశతాబ్దం క్రిందట సుప్రసిద్ధ విద్వాంసులు వేదాల తిరువెంగళాచార్యులు గారు అనువాదం చేశారు. ఆయన ఉదాహరణకు తెలుగులోని పద్యాలనే స్వీకరించారు. కాని యిప్పటి వరకూ ఆంధ్ర వ్యాఖ్య వెలువడినట్లు నాకు తెలియదు. డాక్టర్ రామచంద్రుడుగారు బహువిషయ వేత్తలు. ఆయనకు సాహిత్య శాస్త్రం పైని ప్రత్యేకాభిమానం. ఇదివరకే భామహుని కావ్యాలంకారం, రాజశేఖరుని కావ్యమీమాంస వీరి ఆంధ్ర వ్యాఖ్యలతో వెలువడ్డాయి. కుంతకుని వక్రోక్తి జీవితానికి వీరు అనువాదం రచించగా కేంద్ర సాహిత్య అకాడమీవారు దానిని ప్రచురించారు. అవి సాహిత్యాభిమానుల ఆదరాన్ని పొందాయి. ఆ పద్ధతిలోనే నడిచిన యీ వ్యాఖ్యకూడా మిక్కిలి సులభ మార్గంలో రచింపబడినందున అందరిమన్ననను పొందగలదని భావిస్తున్నారు.

## కుమార సంభవము

(మూలకర్త: నన్నిచోడ మహాకవి. వ్యాఖ్యాతడాక్టర్ నేలటూరి వేంకట రమణయ్యగారు. డెమ్మీ సైజు 327 పుటలు. వెల 7 రూపాయలు. ప్రకాశకులు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-4.)

ఆంధ్ర ప్రబంధములలో అతి ప్రాచీన మయినదీ, ఉపలబ్ధాలైన పద్యకృతులలో మొదటిదీ అయిన కుమార సంభవాన్ని రచించిన మహాకవి కవిరాజ శిఖామణి, టెంకాణాదిత్య బిరుదాంకితుడైన నన్నిచోడుడు. ఆ ప్రబంధాన్ని 1909 ప్రాంతంలో సుప్రసిద్ధ పరిశోధకులు మానవల్లి-రామకృష్ణ కవిగారు ప్రకటించారు. అది ప్రకటించబడినకొద్ది కాలానికే అందలి ప్రయోగాలను గురించీ, కవి కాలాన్ని గురించీ పండితలోకంలో వాదోపవాదాలు చెలరేగినవి. తర్వాత కొన్ని దశాబ్దాలు గడచిన తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయం వారు ఆ ప్రబంధాన్ని సంస్కరించి ప్రకటించ

డానికి చాలా ఏండ్లు పట్టింది. అది బయటికి వచ్చుటకు కొంత ముందుగానే వావిళ్ళవారు కూడా దాన్ని ప్రకటించారు.

పయి ముద్రణాలన్నిటికీ మూలం తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉన్న ఒకే ఒక తాళపత్ర ప్రతి. దానిని కాపీ చేసినవారు తమకు తోచిన విధంగా వ్రాసుకొనుటవల్ల ఎన్నో పాఠ భేదాలు ఏర్పడినవి. సమన్వయ మార్గంకంటకావృతమై పోయింది. విద్వల్లోకంలో అసంతృప్తి తదనన్తరంగానే ఉండినది. డాక్టర్ వేంకటరమణయ్యగారికి ఈ ప్రబంధం పై ఆదరాభిమానాలెక్కువ వారు వ్యయానికి లెక్కచెయ్యకుండా తంజావూరికి తగిన విద్వాంసుని పంపి, ప్రతిని వ్రాయించి తెప్పించిపరిశీలనకు పూనుకున్నారు.కాని ఉద్యోగ ధర్మాన్ని నెరవేరుస్తూ,చరిత్ర పరిశోధనలలోమునిగి యున్నందున దీని విషయమై పరిశీలనకు సమయం లభించ లేదు. ఇతర వ్యాపకాలుముగించుకున్న తర్వాతపరిశీలనాత్మకంగా దీనికి వ్యాఖ్యానం వ్రాయుటకు పూనుకున్నారు. ఉచితజ్ఞులైనవ్యాఖ్యాతముద్రిత,అముద్రిత ప్రతుల పాఠాలనుపరిశీలించి,సరియైన పాఠాలను వివరిస్తూ కావలసినచోట్ల మాత్రం అర్థంయిస్తూ చాలా సంగ్రహంగానే వ్యాఖ్యనువ్రాశారు. కాని వృద్ధాప్యం వల్లనూ, అనారోగ్యం వల్లనూ, నాలుగాశ్వాసాలకు మాత్రమే వ్రాయగలిగారు. అది కూడా చిత్తుగానే ఉండిపోయింది. కాని ముద్రణ కనుకూలంగా శుద్ధప్రతిగా లేదు. ఇంతలో ఆయన కీర్తి శేషులగుటయు సంభవించినది. పిదప అకాడమీవారు ఆలోచించి, రచించినంత వరకయినా ఆ వ్యాఖ్యను ప్రకటింప నిశ్చయించి, ఆ కార్యాన్ని డాక్టరు వేంకట రమణయ్యగారి జామాతలు, సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, నన్ని చోడుని గురించి సమగ్ర పరిశోధనలు సల్పి ఆ పరిశోధన గ్రంథాన్ని ప్రకటించి, అకాడమీవారి పారితోషికమును పొందిన విద్వద్వరేణ్యులు వేదం వేంకట రామ శాస్త్రి గారికి అప్పగించారు. ఆయన చిత్తు ప్రతిని పరిశీలించి, శుద్ధ ప్రతిని తయారుచేసి, తమ ముద్రణాలయములోనే చక్కగా ముద్రించారు.

మద్రాసు యూనివర్శిటీ ప్రతిని చూడగా, విశ్వవిద్యాలయ పరిశోధకులు పాఠ నిర్ణయం పట్ల తగిన శ్రద్ధ తీసికొన్నట్లు కానరాదు. ఎన్నో అపపాఠాలు దొలివి పుస్తకం చివర ఇయ్యబడిన కొలదిపాటి అర్థాలు, ఆ అపపాఠాలనుబట్టి నిర్ణయించబడినట్లు కనబడుతుంది. 1969లో వావిళ్ళవారు ప్రకటించిన లఘుటీకలో మాత్రం టీకాకారులు సరియైన పాఠాలనే గ్రహించి కుమార సంభవానికి పూర్తిగా సంగ్రహ టీకను వ్రాశారు.

డాక్టర్ వేంకట రమణయ్యగారు గొప్ప విమర్శకులు. కాబట్టి ముద్రితాముద్రిత ప్రతులను పరిశీలించి సముచితములైన పాఠాలనే గ్రహించి తమ వ్యాఖ్యాన రచనను సాగించారు. కొన్ని ఉదాహరణములు—

1) "శ్రీవాణీంద్రాసురేంద్రార్పితమకుటమణి
శ్రేణిధామాంఘ్రి పద్మా
జీవోద్య త్కేసరదండా శ్రితజనలషితా
శేషవస్తుప్రదుండా...."

[అశ్వా. 1. పద్యం 1]

అనే మొదటి పద్యంలోనే అప పాఠాలున్నవి. దీని టీకలో వ్యాఖ్యాత "శ్రీవాణీంద్రామరేంద్ర = శ్రీ = లక్ష్మీదేవి యొక్కయు, వాణీ = సరస్వతి యొక్కయు, ఇంద్ర = భర్తలు— అనగా విష్ణువు, బ్రహ్మ, అమరేంద్ర = దేవేంద్రుడు. వస్తుప్రధుడని పూర్వముద్రణములు. వస్తుప్రదుడని వ్రాంతప్రతి. "అర్చిత" పూ.ము. "అర్పిత" వ్రా.ప్ర. సాధువు. అని సంగ్రహంగా ఉన్నది. "అర్పిత, వస్తుప్రదుండు"అనేఉండాలి. వెనుకటి ముద్రణాల పాఠంతప్పు. వావిళ్ళ ప్రతిలో "అర్పిత - వస్తుప్రదుండు" అనే పాఠాలే గ్రహింపబడి, అర్థం ఇవ్వబడినవి.

(2) "ఈ లక్ష్మీశ్వరుఁ డీ జగజ్జననిఁ డీ
యింద్రాది దిక్పాలు రిం
దీ లేఖావళి యిమ్మునీశ్వరగణం
దీ విప్రసంఘుంబు"....

[అశ్వా. 2. ప. 21]

కనే పద్యం వ్యాఖ్యానంలో 'ఈ లేఖావళి- "ఈ వేలావతి యిమ్మనీశ్వరగణంబీ విప్రసంఘంబు-" వ్రా.ప్ర. రామకృష్ణ అవిగారు వేలావతిని లీలావతిగా మార్చినారు. ఈ వేలావతి గాని, లీలావతి గాని యెవ్వరో తెలియదు. ఆమె నిచ్చట పేర్కొనవలసిన యావశ్యకతయుఁ గానరాదు. మద. విశ్వ. "లేఖావళి" అని- సమంజసము, లేఖావళి యనఁగా దేవతల సమూహము. 'లేఖా అదితినందనాః" అని నామలింగాను శాసనము అని యున్నది. వ్రాతప్రతిలోని తప్పు సవరించబడింది.

(3) "ఉదరమను చందిరంబున
హృదయాంభోజనాళ మేర్పడి, తనకొ
ప్పొదవ వెలిఁ దోచెనో యన
సుదతికి నూఁగారుఁ దీఁగె సుందరమయ్యెన్."
(ఆశ్వా. 3. ప. 52)

దీని టీక. "ఈ కందపద్య ప్రథమ పాదమునందొక అపపాఠము గలదు. వ్రా.ప్ర. ఉదరమున అచందంబ్బుః: దీనిని రా కవిగారు 'ఉదరమను చందనంబున" ననియు, మద. విశ్వ. ముద్రణ సంపాదకులు "ఉదరము పలుచందన మున"ననియు సవరించిరి. కాని పై సవరణలు పొందికలేక యున్నవి. ఏలనఁగా పద్యముయొక్క తృతీయ పాదము నందు "హృదయాం భోజనాళ మేర్పడి" అని యున్నది. "హృదయాం భోజము" "ఉదరమ చందనంబు"నుండిగాని, "ఉదరము పలుచందనము" వలనఁగాని యేర్పడదు. "అంభోజాత"మని కవి చెప్పియుండుట ఉదరమను నభస్సు నుండియే. రెండవ పాదములోని అంభోజాతనాళ మేర్పడి యెనని తలంచుట యుక్తము. కావున ప్రథమపాదమును "హృదయమను చందిరంబున" అని దిద్దుకొనవలయును. "చందిరము" అనఁగా నీరు_జలము."

ఈ పద్యమునందలి "చందిరంబు" అను సవరణ ఎంతో సమంజసంగా ఉన్నది.

ఈ విధంగా వ్యాఖ్యాత సునిశితంగా పరిశీలించి తగిన పాఠాలు స్వీకరించి వ్యాఖ్య వ్రాశారు. ఇది సంగ్రహ రూపంగా ఉన్నా చాలా ఉపయోగంగా ఉన్నది. అవసర మని తోచినచోట్ల విపులంగా వివరించారు.

ఈ వ్యాఖ్య నాల్గాశ్వాసాలకు మాత్రమే ఉన్నది. ఆ పైని వ్యాఖ్య వ్రాయకుండానే ఆయన కీర్తిశేషులయ్యారు. సమగ్రంగా ఇది లేకపోవడం వాఙ్మయాభిమానుల దురదృష్ట మనే చెప్పాలసి ఉన్నది.

శ్రీ -బులుసు వేంకట రమణయ్య

# విక్రమోర్వశీయము

[శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్రహ్మణ్యము, బి.ఎ., బి.యల్. నెల్లూరు. 1/8 డెమ్మీ పేజీలు 12+86; వెల రు. 5-00 ప్రతులకు రచయితకే వ్రాయాలి]

"పురా కవీనాం గణన ప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః
అద్యాపి తత్తుల్యకవేరభావా, దనామికా సార్థవతీ
బభూవ"

కాళిదాస మహాకవి ప్రతిభ, ఔన్నత్యం, ప్రత్యేకతలకు దర్పణం పట్టే శ్లోకం ఇది. ప్రత్యక్షర రచనా శిల్ప మర్మజ్ఞుడు, కాళిదాసు. అలంకారత అతి సాంద్రంగా నిబిడీకృతమైన కవిత్వంతో పాటు, నాటకీయ శిల్పాన్ని అనల్పంగా రసబంధురం చేయడం ఆయన సొత్తు. ఐదు అంకాలుగల విక్రమోర్వశీయం రూపకంలోనూ ఈ విశిష్ట లక్షణాల సమాహార రూపంగా దర్శనమిస్తాడు కాళిదాసు. విక్రమోర్వశీ రూపకంలోని ఇతి వృత్తం....జగత్ప్రసిద్ధమైన ఊర్వశీ పురూరవ ప్రేమోదంతం. కాళిదాస కృతికి అనువాదం ఈ గ్రంథం.

కాళిదాస భారతిని సంపూర్ణంగా తెలుగులో పండించి తమ గుండెలుపండించుకున్న విద్వత్కవిశేఖరులు శ్రీ గుఱ్ఱం వారు. వారి సాహిత్య సాంప్రదాయాల విజ్ఞత, లోకజ్ఞత- ఈ గ్రంథంలోనూ అడుగడుగునా విస్తరించాయి.

సంస్కృత రూపకాన్ని అనువదిస్తున్నా, తెలుగు నుడికారాన్ని తెలుగు పలుకుబడినీ రచనలో విస్తృతంగా చిలికి

తమ పులకల్ని వెలార్చుకున్నారు రచయిత. "సోముని కొక్క మెట్టడమువాడు" "పుల్కలు నారువోతగా...." "గిచిన కోతి బొమ్మలా మౌనంగా వున్నాడు" "కామదేవుడు వేషకు తినడం" "బెండు వడిపోవడం" "కనులనుండి నీరు కలుజు వాఱు" - వంటి ప్రయోగాలు దీనికి సాక్ష్యంగా నిలుస్తాయి:

శ్రీ గుఱ్ఱంవారి అనువాద సరళికి వాకే వాక్క ఉదాహరణ : "ఆభరణాస్యాభరణాం ప్రసాధనవిధే - ప్రసాదన విశేషః ఉపమానాస్యాపి సఖేః ప్రత్యుపమానం వపుస్తస్యాః" అన్న పూరూరవుడి శ్లోకం తెలుగున-"సొమ్ములకు సొమ్ములం కారమ్మునకు ననన్యమైన నవ్యాలంకారమ్ము వమకు ప్రత్యుపమయు సుమ్ము య్యమరీ ఎలామ సొగసుం దనువున్"- అన్న ధారాశుద్ధీ, శబ్ద శబలతాగల చిన్ని కందపద్యంగా వచ్చింది.

విక్రమోర్వశి వంటి అమృతకృతిని తెనిగించి తమ సాహితీ జీవనాన్ని సఫలం చేసుకున్న శ్రీ గుఱ్ఱంవారు ధన్యులు, అభినందనీయులు. ఈ గ్రంథానికి శిష్టము, విశిష్టము, పటిష్టము అయిన "భూమిక"- శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారిది. జగమెరిగిన సారస్వత ప్రియులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారికి ఇది అంకితమివ్వబడింది.

వదాల విషపును గురించి అచ్చులో శ్రద్ధ తీసుకోని కారణాన కోకొల్లలుగా, పుస్తకంలో "రామునితో:...."లు చోటుచేసుకున్నాయి!

## అద్దాలమేడ

[రచయిత : శ్రీ కె. ఆర్. కె. మోహన్. ప్రచురణ శ్రీముఖ పబ్లికేషన్స్, ప్లాట్ నెం. 12, హౌస్ నెం. 7-8, పి & టికాలనీ, గడ్డిఅన్నారం, హైదరాబాద్ - 500 036 1/8 డెమ్మిసైజు 7? పేజీలు,వెల రు 3-00]

ఈ సంపుటిలో రెండునాటికలు, రెండు ఏకపాత్రాభినయాలూ వున్నాయి. అద్దాలమేడ రంగుటద్దాలు-నాటికలు. శ్రీ కృష్ణరాయనిర్వేదం, ఈ నాడే నేనుంటే అనేవి-ఏకపాత్రాభినయాలు. స్త్రీపాత్ర లేకపోవడం వలన,భారీ సెట్లువేయవలసిన అవసరం లేనందువలన-తమ రెండు నాటికల్నీ ప్రదర్శనకు సుళువైన నాటికలుగా పేర్కొన్నారు రచయిత.

అద్దాలమేడ-ఒక చిన్న ప్రహసనం. అంతకుముందు ఒక వేశ్య నివసించి ఖాళీన గదిలోకి ప్రసాద్ అనే పోస్టల్ ఉద్యోగి అద్దెకు వచ్చి దిగుతాడు. ఆ వేశ్యతో సంబంధంగల "పెద్ద మనుషులూ" "రౌడీ రంగన్నా"-ఒక్కరొక్కరే అక్కడికి వస్తారు. వాళ్ళు తమ లోపాన్ని కప్పిపుచ్చుకుని పటాటోపాల్ని ప్రదర్శించుకుని తప్పుకు పోవడానికి చేసే ప్రయత్నాలు-ఒక ఫార్స్! నాటక చివరికి ప్రసాద్‌కి అసలు సంగతి తెలుస్తుంది. హాస్యంగానీ, సన్నివేశాలుగానీ నాటికని రక్తి కట్టించేవిగా లేకపోగా పాత్రల్ని స్టేజిమీద హాస్యాస్పదం చేసేవిగా వున్నాయి.

25 పేజీల్లో 5 రంగాలుగా కూర్చబడిన నాటిక-రంగుటద్దాలు సవతితల్లి పట్ల ఏముఖత్వం, అసహ్యంగల ఎనిమిదేళ్ళ పిల్లవాడు వున్నాడు. చివరికి అతను-తండ్రి మందలింపుతో తన అకారణ వైరాన్ని గుర్తించి, పెద్దే పిన్నిని కొడుతుంటే అడ్డుకుని బుద్ధులు చెప్పి - పిన్నిపట్ల మక్కువ, మమత ప్రదర్శిస్తాడు. ఇదీ కథా వస్తువు. మధ్యలో పిల్లవాటి జ్వరం, అల్లోపతీ, హోమ్యోపతీ, ఆయుర్వేదం, నాటు వైద్యాలకి సంబంధించిన నలుగురు డాక్టర్ల (!) వైద్యం. పూర్తిగా మెలోడ్రామాతో నిండిన నాటిక. ప్రదర్శిస్తుంటే ప్రేక్షకులు ఆనందించడం మాటెలావున్నా గేలి చేయడం మాత్రం ఖాయం.

వస్తువులో నవ్యత, రచనలో నాటకీయత, సన్నివేశాల్లో బలం పుంజుకుని చాలా దూరం నడిచి వచ్చింది తెలుగు నాటిక. ఈ రోజుల్లో పుస్తకంగా వీటిని ప్రచురించడం అవసరమే. శ్రవ్య నాటికలుగా పనికొస్తాయి.

నటుకు అవకాశం కల్పిస్తూ, చారిత్రకాంశం ప్రాతిపదికగా రచింపబడిన కృష్ణరాయ నిర్వేదం - మంచి ఏకపాత్రాభినయం. భాష, భావశబలత-రెండూ బాగున్నాయి. కన్యాశుల్కంలోని రామప్ప పాత్ర "ఈ నాడే నే నుంటే" అనే ఏకపాత్రాభినయం. రామప్పపాత్ర తత్వాన్నీ, ఆత్మనీ బాగా ఆకళింపు చేసుకుని రచించిన ఏకపాత్రఇది. ప్రదర్శన యోగ్యంగా వుంది.

1/8 డెమ్మిసైజులో 72 పేజీల పుస్తకానికి కేవలం మూడు రూపాయిల వెలనే నిర్ణయించిన శ్రీముఖపబ్లికేషన్స్ వారి సహాశయం అభినందనీయం.

విహారి

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S.Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S.Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61217

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA104M173 |
|---|---|
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Srisha |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |